ఓం శ్రీ సద్గురుభ్యోనమః

# ప్రబోధ చూడామణి యను శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థ దర్పములు - 2వ భాగము

రచయిత : శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువులు
వ్యాఖ్యాత : శ్రీ విజ్ఞానంద శ్రీ మంచిరాజు శ్రీనివాసమూర్తి



పరిపూర్ణ దర్శనాచార్య సదానంద
శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారు
వీరి ధర్మపత్ని శ్రీమతి సీతామహాలక్ష్మమ్మ గారు

# ప్రబోధ చూడామణి యను శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థ దర్పులు -౨వ భాగము

రచయిత : **శ్రీమత్భాగవత కృష్ణదేశిక ప్రభువులు**

వ్యాఖ్యాత : **శ్రీ విజ్ఞానంద శ్రీ మంచిరాజు శ్రీనివాసమూర్తి**

ప్రథమ ముద్రణ : 2012

కాపీలు : 1000

వెల : రూ. 35/-

ఈ గ్రంథములు వలయువారు & కాపీరైట్ :

**శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిరము**

డో.నెం. 10-204/ఏ,
యర్రబాలెం - 522 503.
మంగళగిరి మండలం, గుంటూరు జిల్లా.
ఫోన్ : 08645 - 233 140

ముద్రణ :

**శ్రీ లక్ష్మీగణపతి బైండింగ్ వర్క్స్**

మెయిన్‌రోడ్డు, కొవ్వూరు
ఫోన్ : 08813-231575

శ్రీగురుభ్యోనమః

# పీఠిక

శ్రీ శివరామ దీక్షితీ సాంప్రదాయమునకు కందార్థములు అత్యంత ప్రామాణికములై యున్నవి. ప్రబోధ చూడామణి అనే పేరుతో శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణ తత్వ కందార్థ దరువులు అను పేర శాలివాహన శకం 1765 సం॥ సరియైన శోభకృత నామ సం॥ ర మార్గశిర బహుళ చవితికి శ్రీమత్ రాజాధిరాజ మహారాజ రాజయోగీంద్ర చంద్రులగు శ్రీమత్ భాగవత కృష్ణ దేశక ప్రభువులు రచించిరి. భాగవతుల వారు అనే ఇంటి పేరుగల నారాయణ యోగి జానకమ్మ అను పుణ్య దంపతుల గర్భవాసమున ఏకైక పుత్రులుగా జన్మించిరి. హైదరాబాదు నగరంలో చౌట్ల మహారాజ్ గంజి అను ఒకవీధిలో వీరు నివసించే వారు. వెలనాటి శాఖకు చెందిన బ్రాహ్మణ కుటుంబంవారు. భిక్షాటనయే వంశాచారముగా కలవారు. బాల్యమునందే ఉపనయనాది సంస్కారములు జరపబడినవి. ప్రథమ కళత్రము పరమపదించడంతో తీవ్రవైరాగ్యముతో ఉండగా అనంతలక్ష్మి అను కన్యను తల్లిదండ్రులు ద్వితీయ వివాహము గావించిరి. ఈమెద్వారా వీరికి ఒక కుమారుడు కలిగి అనతి కాలములోనే మరణించెను. పూర్వ పుణ్యఫలము ఫలప్రదమై పల్నాడు తాలూకా ఎర్రగొండపాలెం నివాసి శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయ పరంపరా పీఠాధికారియైన శ్రీ పరశురామ సీతారామస్వామి దివ్యశ్రీ చరణములను ఆశ్రయించి, వారి సేవా శుశ్రూషలు చేయుచు, వారి అనుగ్రహమునకు పాత్రులై జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు పరిపూర్ణ బోధయే ఋజు మార్గముగా యెంచి అందు కృతకృత్యులైరి. ఆంధ్ర భాషయందు ఈ మార్గముననే పయనించిన వేమన, శివరామ దీక్షితుల మార్గముననే పాటిస్తూ తేట తెలుగులో ఈ పరిపూర్ణ భావమును ఆగమ నిగమ ఉపనిషత్ సాగర మదితార్థమై సకల వేదాంత సారాతీతమై "రహస్యం హేతదుత్తమం" అను భగవద్గీతా వచనమునకు రూప కల్పనగా ఈ గ్రంథమును రచించిరి. వీరు బహుముఖ ప్రజ్ఞావంతులు. ఈ గ్రంథము నందు పరిపూర్ణ భావముయొక్క స్వరూప స్వభావములు ఇమడ్చబడి బృహద్వాశిష్ఠ సిద్ధాంతము (పరిపూర్ణభావము) నకే ఒక పరిశోధనాత్మక వివరణ గ్రంథముగా సమాజమునకు అందింపబడినది.

ద్వైతాద్వైతరహిత పరమతత్వము సకల సుకకవిజనమనోరంజిత విలాసము, జనన మరణ ప్రవాహమును సులభముగా దాటించునది అయిన ఈ పరిపూర్ణ భావము రహస్యమై గురూపదిష్ఠ మార్గము నందు మాత్రమే అనుభవనీయమై యున్నది. "నస పునరావర్తతే"అనగా సర్వభ్రాంతి రహిత మొనర్చే ప్రబోధగా దీనిని సిద్ధాంతీ కరించడమైనది. శ్రీ మద్ రామడుగు శిరామ దీక్షితులవారు ప్రతిపాదించిన పరిపూర్ణ భావము "అచలోయం సనాతనః" అని

జగద్గురువగు శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతాసందేశము అను ఈ రెండు అంశములను క్రోడీకరిస్తూ తేట తెలుగులో ఈ సిద్ధాంతమును నిర్దుష్టముగా కేటాయించి, ఈ గ్రంథ రచనను సమాజమునకు అందించి యున్నారు. పరిపూర్ణ సిద్ధాంత మందలి సమగ్ర అవగాహన ఈగ్రంథముద్వారా స్పష్ట పరచబడుచున్నది. వీరు ఆశుకవిగా ఈ పద్యములను ఒక తాళపత్ర గ్రంథమునందు నిక్షిప్తము చేయుటచేత మూలగ్రంథము శ్రీకృష్ణ దేశికేంద్రులవారి స్వహస్తములతో సవరించబడి పీఠములో నుండిన మూల గ్రంథప్రతిని ఆధారముగా చేసుకొని పెక్కు అంశములు ఒకే లక్షణమున చేర్చబడి యుండి పాఠకులకు సులభగ్రాహ్యము అగుటకు పీఠాధిపతులైన శ్రీమద్ దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారిచే విభిన్న శీర్షికలుగా విభజించి విషయ గ్రహణమునకు అనుకూలముగా పరిచ్ఛేదనముగా విభజించి పీఠగ్రంథముగా ప్రకటించిరి. దీనివలన సిద్ధాంత పద్ధతి అందలి నిర్మిత విధానము బోధనా పద్ధతి అందలిసౌలభ్యము విషయ నిరూపణకు పాఠక లోకము సులభముగా గ్రహించుటకు వీలగుచున్నది. కం॥"ఏపురుషుడు గురువర్యుని శ్రీ పాదము బట్టలేదో సేలుగ నాతండీ పుస్తకమును జూచిన॥ ఏపట్టున నిల్వకేగు యిది నిజమయ్యా నరులారా మీమది తెలియ రయ్య యీ పరమ గోప్యము ఎవరెరుగ రోరయ్యా నాపల్కు మదిలోన నాటిన వానికే ఇది నిజమయ్యా నరులారా మీమది తెలియరయ్యా॥ అని ఈ గ్రంథమును గూర్చి వివరించి యున్నారు. గతంలో ఎందరో మహానుభావులు ఈ గ్రంథమునకు వ్యాఖ్యానములు వ్రాసియున్నారు. వారి అందరికి సహస్ర ప్రణామములు. శ్రీశివరామ దీక్షితీయ పీఠాధ్యక్షులైన శ్రీమతి అనసూయాంబ సమేత శ్రీమద్ దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి ప్రియ శిష్యులైన పరిపూర్ణ దర్శనాచార్య సదానంద శ్రీ ఇలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు, సీతామహాలక్ష్మి గార్ల ప్రియశిష్యుడైన మంచిరాజు శ్రీనివాసమూర్తి అను పేరుతో పిలువబడుచున్న నేను శ్రీగురుమూర్తి అనుగ్రహ ఆశీర్వచన బలమును అండగా గైకొని శ్రీగురుమూర్తిద్వారా విన్న ప్రబోధ విధానమును దృష్టిలో ఉంచుకొని ఈవ్యాఖ్యాన రచనను చేసియున్నాను. విజ్ఞులు సహృదయముతో ఈ రచన స్వీకరించి నన్నాశీర్వదిస్తారని మనసారా ప్రార్థిస్తున్నాను. ఈరచనను మాగురుదేవులైన శ్రీ సీతామహాలక్ష్మీ సమేత సదానంద శ్రీ రామచంద్రరావు రాజయోగీంద్రుల దివ్యశ్రీచరణములకు ఒక పూజాపుష్పముగా సమర్పించు కొనుచున్నాను.

ఈ గ్రంథముద్రణకు ద్రవ్యసహాయమొనర్చిన చి॥ సౌ॥ శివకుమారి ఫల్గుణి గారికి శ్రీగురుమూర్తి ఆశీర్వచనము సర్వదా ఉండి లక్ష్యశుద్ధి చేకూర గలుగు గాక.

ఇట్లు
**గురుపాద రేణువు**
**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

ఓం

శ్రీగురుభ్యోన్నమః

# ప్రబోధ చూడామణి యను శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వ కందార్ధ దర్పులు.

కం॥ పరిపూర్ణములో దోచిన। యెరుకే కలలేనియెరుక నెరిగి మృషని
యీ। మరుగెరుక కెరుకదెల్పిన। యెరుగుటయే। మేల్కసుమ్మీ।
యిదియామారకుమీ। సద్గురు వాజ్ఞ। కెదిరీ మీరకుమీయెరుక
యీరీతిగయెగిరీ పోయినవెనక। పరిపూర్ణ మొకటుండు।
పలుకరా దెట్లందు। నిదియామారకుమీ। సద్గురు వాజ్ఞ। కెదిరి
మీరకుమీ॥ 151

## ప్రతిపదార్థము

పరిపూర్ణములో దోచిన ఎరుకే = స్వతఃసిద్ధమైన పరిపూర్ణమునందు లేక తోచుచున్న గుర్తెరిగే శరీరమె

కల = లేనిది (సుర స్వప్నము)

లేని ఎరుక = పై విధంగా వున్నది పరిపూర్ణమైనపుడు ఎరుక లేనిదగు చున్నది. గావున లేని ఎరుక అని దీనికిపేరు

నెరిగి = పరిపూర్ణము, ఎరుక లనుగుర్తించి

మృషని = నిజము కానిదని, అసత్యమని

ఈ మరుగు = ఈ రహస్యము

ఎరుక ఎరుకకు తెల్పిన=గురువాక్యముచేత లేనిది అని దృఢ పరచుకొన్నమీదట

ఎరుగుటయే మేల్క సుమ్మీ = పై విధముగా దృఢపరచు కొనుటనే మెలుకువ అనే శబ్దముచే చెప్పబడు చున్నది

ఇది యామారకుమీ=ఇట్టి ఆరూఢతను కల్గించుకొనుటలో ఎట్టి సందేహం పెట్టుకొనవద్దు

సద్గురు వాజ్ఞకెదిరీ మీరకుమీ = మూలములేని గుర్తెరిగే శరీరము ఏమీలేదు అను భావమును విడచి వుండకు

ఎరుక ఈరీతిగ = షోడశి వాక్యము దృఢమైన పిమ్మట

ఎగిరి పోయిన వెనుక = స్వత:సిద్ధమైన పరిపూర్ణము వున్నది దానియందు గుర్తులేదు అన్న ఎరుక గూడా లేకపోయిన పిదప

పరిపూర్ణమొకటుండు = పరిపూర్ణము శేషించి వుండును

పలుక రా దెట్లందు = గుర్తించుటకు, వున్నదని గాని, లేదని గాని నిర్ణయించుటకు గుర్తేలేదు గనుక

ఇదియా మారకుమీ = ఇట్టి ఆరూఢత యందు ఎట్టి నిర్లక్ష్యము పనికిరాదు.

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణము నందు లేక తోచుచున్న ఎరుకే కల. ఇట్టి విధానము వస్తు నిశ్చయ పూర్వకముగా గురుముఖత: దృఢ పరచుకొన్న ఎరుక లేనిది అగుచున్నది. ఈరహస్యం ఆరూఢపరచుకొన్నవారికి అది మెలకువగా చెప్పబడును. ఈ భావము కలిగించు కొనుటలో ఎట్టి సందేహము పనికి రాదు. పరిపూర్ణము వున్నది అను సూచించు గురువాక్యం (ద్వాదశి) దానియందు గుర్తించే తెలివి లేనిది (షోడశి) భావమును ఎల్లప్పుడు మరచి వుండకు (నిర్లక్ష్యం చెయ్యకు) పై విధంగా వస్తునిశ్చయ పూర్వకంగా పరిపూర్ణము ఎరుకలను దృఢపరచుకొని అట్టి గుర్తును కూడా విడచి వుండుము. ఈ స్థితియందు వున్నది పరిపూర్ణమనిగాని లేనిది ఎరుక అని గాని అనుటకు గుర్తే లేకుండును. ఇదే స్థితి యొక్క లక్షణము.

**కం॥ తిప్పలగురాకపోకల। నెప్పుడు తానెరుగనట్టి యీ బయలందున్।
తప్పక తనకైతానే తప్పునగనవచ్చి యెరుక। తాగానరాదూ।
బయలున్నాది తనకెరుక లేదూ। యెప్పూడు బయలున్న
దెరిగితాలేనట్టి। చొప్పూసద్గురుబోధ। చొప్పూన దెలసీతె।
తాగానరాదూ। బయలున్నది। తనకెరుకలేదూ॥ 152**

## ప్రతిపదార్థము

తిప్పలు = మార్పులు

రాక పోకలు = జనన మరణాలు

ఎప్పుడు = ఏ పరిస్థితులలోను

తా నెరుగనట్టి ఈ బయలందున = పైన పేర్కొన్న పరిణామ క్రమములతో ఏమాత్రము సంబంధ పడక స్వత:స్సిద్ధమైన పరిపూర్ణము
తప్పక = క్రమమైన పరిణామములో
తప్పున = వెంటనే
తనకై తానే కనవచ్చి = తనంతట తానే తనకు తాను తోచబడి
ఎరుక తా గానరాదు = గుర్తెరిగే శరీరము తనంతట తానుగా లేక పోవుచున్నది
బయలున్నది = పరిపూర్ణము స్వత:సిద్ధమై వున్నది
ఎరిగి = ఈ అంశములు వస్తునిశ్చయ పూర్వకముగా దృఢపరచుకొని
తా లేనట్టి చొప్పు = తాను లేకపోవు విధానము
సద్గురు బోధ = పరిపూర్ణము వున్నది ఎరుక లేదు అను గురు వాక్యమును
చొప్పున తెలిసితే = గట్టిగ దృఢ పరచు కొన్న వెంటనే

## తాత్పర్యము

జనన మరణములు పొందు క్రమంలో మార్పులకు లోనుకాక స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు మూలము గాని ఆధారము గాని లేక కలవలె తనకు తానుగా గుర్తెరిగే శరీరము వెంటనే వచ్చి మరల తనకు తానుగా లేకపోవుచున్నది. పరిపూర్ణము వున్నదన్న గుర్తు తనకు లేదు. సర్వ కాల సర్వావస్థల యందు స్వత:సిద్ధమైవున్నది పరిపూర్ణమని, దానియందు మూలము గాని స్థానము గాని లేనిది ఎరుక అని పరిపూర్ణ భావమును దృఢపరచుకొన్న వెంటనే గుర్తెరిగే ఎరుక తనకు తానుగా లేక పోవు చున్నది.

కం॥ అన్నము శుక్లంబగు రస। మున్నతిగ రక్తమగును నొకచో
రెండున్। పన్నుగగలసిన మేనని। యెన్నబడున్ యెరుక గల్గి।
యిదెమాయసుమీ్మ। మూలములేనిదె నీవునమీ్మ। యున్నావు
పరిపూర్ణమున్నది। గనిలేని దెన్నడు లేదనియెరిగితెచాలు।
గుర్తదెమాయ సుమీ్మ। మూలములేని। దిదెనీవునమీ్మ॥ 153

# ప్రతిపదార్థము

అన్నము శుక్లంబగు = సప్తధాతు మయమైన అన్నము ద్వారా పురుషునియందు శుక్లము తయారగును
రసమున్నతిగ రక్తమగును=స్త్రీ యందు ఈ ధాతువు శోణితముగా తయారగును
ఒకచో ఈ రెండున్ = ఈ శుక్ల శోణితములు ఒకే స్థానమున కలిసిన వెంటనే
పన్నుగ = చక్కగా
కలిసి మేనన్ = ఒకటి యై శరీరముగా తయారై
ఎన్నబడున్ ఎరుక గల్గి = నేను అనే గుర్తెరిగే శరీరముగా పేర్కొనబడుచున్నది
ఇదే మాయ సుమీ = ఇది లేనిదిగా భావించుము
మూలము లేనిదిదె నీవు నమ్మియున్నావు = దీని పూర్వా పరములు విచారించిన వారికి మూలము గాని స్థానము గాని లేదని తెలియు చున్నది
పరిపూర్ణమున్నాదిగని=స్వత:సిద్ధమైన పరిపూర్ణము వున్నదని దృఢపరచుకొని
లేనిది ఎన్నడు లేదని=దానియందు మూలము గాని స్థానము గాని లేక వున్నగుర్తును
లేదని ఎరిగితె చాలు=గురువాక్యము చేత లేదని దృఢ పరచుకొంటె చాలు

# తాత్పర్యము

ఛాందోగ్యే పనిషత్ నందలి త్రివృత్కరణి విధానము విచారించిన వారికి పృధ్వీభూత సంబంధమైన కఠినాంశము, జల భూత సంబంధమైన ద్రవాంశము, అగ్నిభూత సంబంధమైన తేజాంశము జఠరాగ్ని రూపములో పచనమై సప్త ధాతువులుగా పరిణామము చెంది, పురుషునియందు అన్నరసముచే శుక్లముగాను, స్త్రీ యందు శోణితముగాను తయారై వీటి సూక్ష్మాంశముల కలయికలో గుర్తు ఏర్పడు చున్నది. ఇది అశాశ్వతమై క్షణికమై యున్నది కావున దీనిని మాయ అను శబ్దముచే సూచింపబడు చున్నది. దీని పూర్వాపరములు అనగా వస్తునిశ్చయ పూర్వకముగా విచారించినచో మూలముగాని స్థానముగాని లేదని తెలియు చున్నది. గురుముఖత: వస్తునిశ్చయ పూర్వకముగా స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణమును దానియందు లేక తోచుచున్న లేని ఎరుకను లేనిదని

ఏగుర్తుచేత ఈ అంశము గుర్తింపబడుచున్నదో అట్టి గుర్తు కూడా లేనిది అగుచున్నది అని దృఢ పరచుకొన్నవారికి జనన మరణ భ్రాంతి రహిత విధానము కలుగ గలదని తెలియ వలెను.

కం॥ పెనుమాయెను జూడుముయిదె। జనకుని జఠరంబు వలన
జననీగర్భం। బునజొచ్చి మారురూపున జనియించును
నవయవములు। జనితామైభువినీ। వినుకనుతిను మూర్కొను
వచ్చునుచనీ। దినదిన మభివృద్దొదీనిచే బయలును। గనియా
మాయల మల్లికథ మాయించుముపోని। జనితామై భువినీ।
వినుకనుతిను। మూర్కొనువచ్చునుచనీ॥ 154

## ప్రతిపదార్థము

పెనుమాయ = అత్యంత మోసపూరితమైన వస్తువు. మాయ అనగా లేనిది నిజము కానిది. (భ్రాంతి కారణమైనది) సత్యత్వముకలిగించునది. పెనుమాయ అనగా నిజము కాదని తెలుసుకొన్న వారిని కూడా నిజమని భ్రమింప జేయుశక్తి గల్గినది

చూడుము = గ్రహించుము (గుర్తించుము)

ఇదె = పిండాండ గతమైన ఈ శరీరమె

జనకుని జఠరంబు వలన = తండ్రి యొక్క శరీరమందు జఠరాగ్నిచే తయారైన శుక్లము నుండి

జననీ గర్భంబు జొచ్చి = తల్లి గర్భమందుసప్తధాతు మయమైన గర్భగోళమందున్న శోణితము నందు ప్రవేశించి

మారు రూపున జనియించును = పిండోత్పత్తి క్రమంలో గ్రుడ్డుగామారి క్రమంగా అవయవములు ఏర్పడి పిండాకృతి వహించి

అవయవములు = ఇంద్రియములు

జనితమై = ఏర్పడి

భువినీ = తల్లి గర్భమునుండి వేరుపడి భూమిపై

విను, కను = జ్ఞానేంద్రియములు

తిను = కర్మేంద్రియములు
మూర్కొను = నిద్ర, జాగ్రత, స్వప్నము, సుషుప్తి
వచ్చును = రాక పోకలు సాగించును
చను = మరణించును
దినదినమభివృద్ధౌ = క్రమక్రమముగా ప్రకృతి సహాయముతో బాల్య, యవ్వన, కౌమార, వృద్ధాప్య దశలు పొందు చుండును
దీనిచే = ఈ పిండాండాకారముగా కనిపించు శరీరము + గుర్తుచే
బయలును గని = స్వత: సిద్ధమైన పరిపూర్ణము ఉన్నదని దృఢపరచుకొని
అమాయల మల్లి కథ=మూలము లేని గుర్తెరిగే శరీరము యొక్క ఉనికి దాని వ్యవహారము
మాయించుము పోని = లేనిదని, నిజముకాదని దృఢపరచుకో

## తాత్పర్యము

సప్త ధాతుమయమైన తండ్రి శరీరమందు ఏర్పడిన శుక్ల ధాతువు నుండి తల్లి గర్భమందు ఏర్పడిన శోణితము నందు ప్రవేశించి పిండాండాకారమై గుడ్డు దశనుండి శరీరాకృతి ఏర్పడి, అవయవములు కలిగి, తల్లి గర్భము నుండి వేరై భూమిపై పడిన ఈ శరీరము మహామాయ, లేనిది, నిజము కానిది, భ్రాంతికి కారణమైనది. సత్యత్వము కలిగించునది పెనుమాయ. అనగా నిజము కానిదని తెలుసు కొన్న వారికి కూడా నిజమని భ్రమింపజేయు శక్తి కలిగినది ఈ గుర్తెరిగే శరీరము. క్రమ సహ అవయవములు ఏర్పడి ఇంద్రియ స్ఫూర్తి కలిగి అంతరేంద్రియములు, ప్రాణేంద్రియములు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు కలిగి స్థూల శరీర పరిణామ క్రమములో బాల్య, యవ్వన, కౌమార, వృద్ధాప్యములు కలిగి, ఇంద్రియములు వికసించి జాగ్రత, స్వప్నము, సుషుప్తి అను అవస్థలు పొందుచు వీనిచే కర్మానుభవము పొంది జనన, మరణ చక్ర భ్రమణములో తిరుగు చుండును. ఇది అత్యంత మోసపూరితమై భ్రాంతి కారకమై యున్నది. 84 లక్షల జీవరాసుల పరిణామ క్రమంలో అత్యంత

దుర్లభమై, కేవలం జనన, మరణ రహిత విధానము కలిగించు కొనవలెను. అను లక్ష్యముతో ఈ శరీరమును, స్వతఃసిద్ధమైన పరిపూర్ణమును గురు వాక్యము ద్వారా దృఢపరచుకొని, దానియందు ఈ గుర్తెరిగే శరీరమునకు మూలముగాని స్థానముగాని లేదని గ్రహించి, భ్రాంతి రహిత విధానము కలిగించు కొనుటయే దీని ముఖ్యమైన పని అని తెలుసుకో వలెను.

కం॥ పెట్టియలోపలిగారడి। చెట్టుపయిన్ గానవచ్చి చెట్టున జూడన్।
గట్టు వ యిు దోచునది కనుకట్టు నంమీదీనివలెనే
గనుపించునెరుకా। అంతలొయెచట గనుపించదెరుకా।
దిట్టామౌబోధాచేపట్టీ యెరుకనుతిరిగి। పుట్టాకుండగదాని।
పుట్టీముంచు ములేందె। గనుపించునెరుకా। అంతలొయెచట
గనిపించదెరుకా॥ 155

## ప్రతిపదార్థము

పెట్టియ లోపలి = పెట్టె లోపల

గారడి = కూర్చో బెట్ట బడిన పిల్లవాడు

చెట్టు పయిన్ గానవచ్చి=గారడీ విద్యద్వారా చెట్టు పైన ఉన్నట్లుగా కనబడి

చెట్టున చూడన్ గట్టుపై తోచును = చెట్టుపై కాకుండా మాయమై ఎదురుగా ఉన్న గోడపైన కనిపించును

కనికట్టుసుమీ = ఇది యొక కనికట్టు విద్యగా తెలిసి కొనుము

ఎరుక = గుర్తెరిగే తెలివి

అంతలో ఎచట = కాసేపట్లో కన్పించి, కనిపించకుండా పోవును

దిట్టామౌ బోధ =గొప్పదైన పరిపూర్ణ బోధ

చేపట్టి = గురుముఖతః వస్తు నిశ్చయ పూర్వకముగా దృఢపరచుకొని

ఎరుకను తిరిగి పుట్టాకుండగ = మూలము లేని గుర్తెరిగే శరీరము ఏమీ లేదని దృఢపరచుకొని

దాని పుట్టీ ముంచుము = దానియందు భ్రాంతిని విడిచి వుండుము

లేందె = లేకుండా పోవును

## తాత్పర్యము

కనికట్టు విద్యయందు గారడీ వాడు ఒకపిల్లవాడిని ఒక పెట్టెలో పరుండబెట్టి తన గారడీ శక్తిచే పెట్టె యందు కన్పించకుండా దగ్గరలో నున్న చెట్టుపైన కనిపించేలాగ చేయును. ఇది ఆ గారడీ విద్య ప్రభావముచే పై విధముగా తోచబడుచున్నది. ఈ విధముగానే గుర్తెరిగే ఎరుక తల్లి గర్భమనే పెట్టెలో ప్రవేశించి కొంతకాలము అందు నివశించి పిండాండాకారమై శరీరము అను చెట్టు పైన కన్పించును. క్రమములో మరణమును పొంది సమాధి, అను గట్టుపైన తెలియ బడును. ఇక ఆ పైన ఎచటను ఆ ఉనికి లేక పోయెను. ఇది అంతయు కూడా గారడీ విద్య వలె కన్పించును. ఇట్టి మార్పులకు లోను కాకుండా ఉండుటకై పరిపూర్ణబోధను గురుముఖత: దృఢపరచుకొని మూలము లేని గుర్తెరిగే శరీరము లేనిదనివిడచి యుండిన జనన మరణ భ్రాంతి తొలగును. అని తెలియ వలెను. ఈ కందార్థభావము పరిణామ క్రమములో బ్రహ్మాండము నందు కూడా విచారించవలెను. ఇది రహస్యము గురుముఖత: మాత్రమే తెలిసికొనవలెను.

కం॥ నేననని బ్రహ్మలోపల। లేనిదెసంభవమునొంది లీలతన కుదా।
వేనుజగములై వెలసెను। నేనదిమృగజలమురీతి।
నిజముగాదనుచూ। లోకులనేటి। గజిబిజివినుచూ। మానాస
మున వారి మాటకామోదించి। దానికిబోధాకు తగునంచు
వినజేస్తి। నిజముగాదనుచూ। లోకులనేటి। గజిబిజివినుచూ॥ 156

## ప్రతిపదార్థము

నేననని బ్రహ్మ లోపల=నేననే గుర్తు లేకుండా స్వత:సిద్ధమైనపరిపూర్ణము నందు
లేనిదె = మూలము గాని స్థానము గాని లేకనె
సంభవము నొంది = పరిణామక్రమమునకు లోనై
లీల = లేనిదైనను ఉన్నట్లుగా తోచబడుచు
తనకు తాను = తన ఆవరణము నందు తానే తన సంకల్ప బలముచేత

మేను జగములై వెలసెను = జీవేశ్వర జగత్తుగా పరిణామము చెందును
నేనది = ఈ పరిణామ క్రమమునకు లోనైన గుర్తును నేను
మృగజలమురీతి = ఎండ మావులయందు తోచబడు నీటివలె
నిజము కాదనుచు = సత్యము కాదనుచు
లోకులు = మతవాదులు
అనేటి = సిద్ధాంతపరచిన
గజిబిజి = భిన్న భిన్న సిద్ధాంతములు
వినుచు = దృష్టిలో ఉంచుకొని ఆలోచించి
మానసమున వారి మాట కావెూదించి = నా మనస్సులో వారు సిద్ధాంతీకరించిన ఈ భిన్న భిన్న భావములను ఆమోదించి
దానికీ బోధాకు తగునంచు వినజేస్తి = నిజము కాదు అను అంశమందు మత వాద అభిప్రాయములు పరిపూర్ణబోధ యందు నిజము కాదు అను భిన్న భిన్న అంశములకు సమన్వయము గావించి

## తాత్పర్యము

నేననే గుర్తు తో సంబంధపడకుండా స్వత:సిద్ధమైన పరిపూర్ణము నందు అధిష్టాన రూపమైన, (బ్రహ్మము) బ్రహ్మము, గుర్తెరిగే శరీరము తనకు తానుగా తోచబడి, తనయందు గల సృజనాత్మక శక్తిచే నేను అనేకము అగుదును అను సంకల్ప బలముచే జీవేశ్వర జగత్తుగా పరిణామము చెందెను. ఈ పరిణామము దీనికి ఆధారము (ఎరుక + జగములు) వీటి యందలి సత్యా సత్యములు నిర్ణయించుటలో భిన్న మత వాదములు బయలుదేరినవి. అందు అద్వైతము ప్రముఖమైనది. దీనిని సిద్ధాంత పరుస్తూ ఆదిశంకరుడు బ్రహ్మము సత్యము జగత్తు మిధ్య, జీవుడు ఈశ్వరుడు ఒకటేనని సృష్టి కారణమగు బ్రహ్మమునందు తోచబడు జగత్తు ఎండమావులవలె లేక రజ్జు సర్పము వలె తోచబడు చున్నదని (మిధ్యావాదము లేక మాయా వాదము) వీరిచే ప్రతిపాదింప బడినది. పరిపూర్ణ సిద్ధాంత రీత్యా విచారించినచో బ్రహ్మము జగత్తు అనునవి రెండు

వస్తువులు కావని, ఒకే వస్తువు యొక్క స్థూల, సూక్ష్మములని,ఇవి ఒకదానిని విడచి ఒకటి వుండవని, వస్తు నిశ్చయ పూర్వకముగా గుర్తించి, ఈ రెంటికీ సంబంధ పడక కేవలత్వము కల్గిన పరిపూర్ణము నందు, రెండు రూపములుగా తోచబడు ఈ గుర్తెరిగే శరీరము ఎండ మావుల వంటిదని, మూలము గాని, స్థానముగాని లేనిదని గురుముఖత: దృఢపరుస్తూ సిద్ధాంతీకరించబడినది, ఎరుక యొక్క వస్తు నిశ్చయ జ్ఞానము ఇందు చాలా ముఖ్యమైనది. ఈ సిద్ధాంతకర్త అయిన శివరామ దీక్షితుల వారిని వారి గురుదేవులైన శ్రీధర స్వామివారు " పూర్ణమద: " అను శాంతి మంత్రము ద్వారా ఈ భేదమును గుర్తింపజేసి, భ్రాంతి రహిత విధానమును దృఢ పరచి నట్లుగా దీక్షితీయ గ్రంధము నందు చెప్పబడుచున్నది. ఏలననగా పరిపూర్ణదర్శనము ఒక సోపాన క్రమములో షడ్ దర్శనములు (న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వ మీమాంస, ఉత్తర మీమాంస) ద్వారా ఆత్మ దర్శనము కలిగి పైన ఆత్మాతీతం, కేవలాత్మ అన్నట్లుగా ఒక క్రమములో సమన్వయ బుద్ధితో గురుముఖత: వస్తునిశ్చయ జ్ఞానము ద్వారా దృఢ పరచు కోవలసినదే తప్ప ఎట్టి ఊహ, అపోహల చేత సిద్ధాంత పద్ధతిని తెలుసు కొన జాలము.

**కం॥ గుడమేమధురము మధురమె। గుడమాగుడ మధురము లనుగొనకొనితొలుతన్। బొడమినదేదన సరిగా। బొడమిందో కటేగ। రెండుపోయినట్టేకదరా। తనువెరుకాలి। ట్టైనట్టె కదరా। పొడజూచి బయలునిప్పుడె మేనెరుకలజోలి। విడరా లేనివె రెండు। పెడచౌబెట్టక విను। పొయినట్టెకదరా। తనువెరుక। లిట్టైనట్టెకదరా॥ 157**

## ప్రతిపదార్థము

గుడమే మధురము = బెల్లము, తీపి

మధురమే గుడము = తీపియే బెల్లము

అగుడ మధురములను = ఈ తీపి, బెల్లము లను

గొన కొని = స్పష్టముగా, విచారించగా
తొలుతన్ పొడమిన దేదన = ఏదిముందు కలిగింది అని విచారించగా
సరిగా పొడమిందె = ఒక్క సారిగా ఏర్పడినది
ఒకటేగా = అందుచేత రెండు ఒకటే
రెండు పోయినట్టె గదా = ఒకే సారి రెండును ఉత్పత్తి అగుచున్నవి కావున ఒక దానిని విడిచి ఒకటి విడిచియుండవు. కావున ఒకటి వున్నచో రెండు వున్నట్లె. ఒకటి పోయినచో రెండు పోయినట్లె
కదరా = అవునుకదా!
తను వెరుకలు = ఎరుక, ఎరుక యొక్క దేహము
ఇట్లయినట్లె కదరా = ఈ విధముగా ఏర్పడినట్లె కదా!
పొడ జూచి = వస్తు నిశ్చయ పూర్వకముగా పై రెంటినీ విచారించి
బయలు = స్వత:సిద్ధమైన పరిపూర్ణమును
ఇప్పుడే = ఈ విధంగా దృఢ పరచుకొన్న పిమ్మట
మేనెరుకల జోలి = ఎరుక యొక్క శరీరము యొక్క సంబంధము
విడరా లేనివె రెండు=ద్వాదశి, షోడశి వాక్యముల ద్వారా పై రెంటిని లేనివని
పెడచెవిబెట్టకవిను=ఎట్టి నిర్లక్ష్యము చేయక పైభావమును దృఢ పరచు కొనుము

## తాత్పర్యము

బెల్లము, తీపి అను రెండు లక్షణములు ఒక్క సారిగా కలిసి ఉత్పత్తి అయి ఒకదానిని ఒకటి విడచి యుండుటకు వీలు లేక ఎట్లు ఉనికి కల్గి వున్నవో కలిసి వచ్చి కలిసి ఎట్లు పోవుచున్నవో గుర్తెరిగే ఎరుక దాని స్థూల రూపమైన ప్రపంచము విడదీయరానివై ఒకదాని నొకటి ఆశ్రయించి కలసియేయుండి కలసియే లేకపోవుచున్నవి. వస్తునిశ్చయ జ్ఞానము ద్వారా గురుముఖత: ఈఅంశమును స్పష్టముగా విచారించవలసియున్నది. ఇందు ఒకటి సత్యము ఇంకొకటి అసత్యము అనుటకు వీలులేదు. స్వత:సిద్ధమైన పరిపూర్ణమును గురువాక్యము ద్వారా దృఢపరచుకొని రెండుగా తోచబడుచున్న ఎరుకను ద్వాదశి, షోడశి వాక్యముల ద్వారా విడిచి

పెట్టవలెను. ఈ అంశము నందు ఎట్టి నిర్లక్ష్యము పనికిరాదు. అని తెలియవలెను. సాంప్రదాయ పద్ధతియందు ఎరుక పరిపూర్ణము అను శబ్ధములకు వస్తునిశ్చయం పూర్వకమైన నిరూపణ పరంపరా గతంగా గురుశిష్యన్యాయముగా మాత్రమే ఉపదేశింపబడుచున్నది. ఇది అత్యంత రహస్యమై యున్నది. ఉపదేశ సారమునందు పరిపూర్ణము ఎరిగి, ఎరుక ఎరిగి ఎరుకను మాను అను క్రమములో "యెరిగి" అనుశబ్ధమునకు "విని" అను అర్ధమే కాకుండా పై విధంగా వస్తునిశ్చయ పూర్వకంగా గుర్తించుము అను అర్ధముతో చెప్పబడినట్లుగా గ్రహించవలెను.

**కం॥ ఇదివున్నదియిదివున్నది। యిదివున్నదియనుచు బయలు**
**నెరిగియెరుకచే। యిదిలేనిదియిదిలేనిది। యిదిలేనిది యనుచు**
**నెరుక। నెరిగీతెసరిరా। ఆపైనుండె దెట్లందువినరా। వుదయాస్త**
**మానాములుడుగాక యిదినీనె। మ్మదిలోన నమ్మునామాట**
**నిశ్చయమిట్లు। యెరిగీతెసరిరా। ఆపైనుండె। దెట్లందు వినరా॥ 158**

## ప్రతిపదార్ధము

బయలు = స్వత:సిద్ధమైన పరిపూర్ణము

ఇది వున్నది ఇది ఉన్నది ఇది వున్నది అనుచు = వస్తు నిశ్చయ పూర్వకముగా గురుముఖత: గుర్తించి

ఎరుకన్ = గుర్తెరిగే తెలివి

ఇది లేనిది ఇది లేనిది ఇదిలేనిది యనుచు=గుర్తెరిగే శరీరము ఏమాత్రము లేనిదని

ఎరిగితే సరిరా = కేటాయించిన ఎరుక, పరిపూర్ణము లను వస్తునిశ్చయ పూర్వకముగా దృఢపరచుకొని విడచిన పిదప

ఆపై నుండేది = తదుపరి మిగిలినది

ఎట్లందు = ఏవిధముగా యున్నదని నిర్ణయము చేయును అనగా ఉన్నదనుటకు, లేనిదనుటకు గాని గుర్తెరిగే తానుండ వలెను కదా!

ఉదయాస్తమానాములుడుగాక = ప్రొద్దుట నుండి సాయంత్రం వరకు విడిచి పెట్టకుండా జాగ్రదావస్థంతయు

**ఇది** = ఈ ఆరూఢతను లేక ఇట్టి భావమును

**నెమ్మది లోన నమ్ము** = నీ మనసులోన గట్టిగ దృఢ పరచుకొనుము

**నామాట నిశ్చయము** = నాచే సూచింప బడు చున్న ఈ అంశములు చాలా దృఢమైనవి, స్థిరమైనవి అని నమ్ము

## తాత్పర్యము

సిద్ధాంత పద్ధతిగా పరిపూర్ణబోధయొక్క క్రమమును కందార్థములలో నిర్ణయించుటలో మొదటిగా అచల పరిపూర్ణమును రెండవదిగా లేని ఎరుకను కేటాయించి వస్తునిశ్చయ పూర్వకంగా దృఢపరచుకొన్న పిదప అట్టి దృఢపరచుకొన్న ఎరుకను కూడా విడచి యుండుట నిర్ణయించబడినది. ఉపదేశ పద్ధతియందు ఇది ఒక క్రమ విధానముగా పాటింపబడుచున్నది. ఈనిర్ణయ విధానము తెలియుటకు శిష్యుడు గుర్తుచేత తెలియ బడునది అంతయు (నానాత్వమంతయు) ఒకటిగా గుర్తెరిగి అఖండ ఎరుక స్వరూపుడు కావలసి వున్నది. తెలివిచేత తెలియ బడునదంతయు ఒకటిగా మారినపుడు ఆత్మాతీతం కేవలాత్మ అన్నట్లుగా తెలివిచే తెలియరానిదై గురుసూచన మాత్రంగా గుర్తింప గలిగినదై కేవలత్వము కలిగిన పరిపూర్ణము తనకు అన్యమై యున్నట్లుగా దృఢపరచుకొని అట్టి నిశ్చయ విధానమునందు నిర్ణయించగల గుర్తునుకూడా విడచి యుండవలెను. ఇది బోధయొక్క క్రమపద్ధతి. ఇందు కనువుగా గురువు తన్నాశ్రయించిన శిష్యునికి పిండదృష్టితో కూడిన స్థితి నుండి అఖండాత్మ దృష్టి కలుగు రూపమును గుర్తింపజేసి అనగా (స్థాన, స్వరూప, స్వభావములుగా) దృఢపరచి బోధింప వలసిఉన్నది. పరిపూర్ణము స్వత:సిద్ధముగా ఎట్లు ఉనికి కలిగి యున్నదో దానియందు గుర్తెరిగే శరీరము ఎట్లు లేక పోవుచున్నదో బోధచే దృఢ పరచి ఎరుకను విడచుటకు ద్వాదశి, షోడశి వాక్యములను ఉపదేశించి, అందలి నిజాభిప్రాయమును స్పష్టముగా వివరించవలసి యున్నది. ఇందు గురువాక్యము అత్యంత ప్రామాణికమై యున్నది. క్రమ పద్ధతిలో ఇట్టి ఆరూఢత పొందలేక ద్వాదశిని పరిపూర్ణమని,

షోడశిని ఎరుకని భావించి కొందరు సాంప్రదాయ పద్ధతియందలి విలువలు తెలుసుకొన లేకున్నారు. ఈ ఆరూఢత కలుగుటకు గురుసూచన అనగా (అచలము బయలు పరిపూర్ణము) ద్వారా దృఢపరచుకొని క్రమములో ఎరుకను విడువ వలసియున్నది. తెలుసు కొనుటకు విడచుటకు తానుముందుగా అఖండ ఎరుక స్వరూపుడుగా నిలువ వలసి ఉన్నది. ఇది ఒక ముఖ్యమైన అధికార లక్షణము. ఇది అత్యంత రహస్యము గురుగోప్యమై యున్నది. ఈ క్రమములో పరిపూర్ణము, ఎరుకలను గుర్తెరిగే ఎరుకను విడచుటలో ద్వాదశి, షోడశి వాక్యములు (విడచి యుండుటకు వీలుగా) జాగ్రదావస్థ కాలమంతయు మంత్రార్థము, మంత్రరహస్యము లను దృఢపరచుకొని ఎట్టి సందేహము నకు తావివ్వక గురువాక్యమునందు అత్యంత శ్రద్ధ గలిగి యధాతధంగా జీవించవలసి ఉన్నది.

కం॥ యెరుకే చదువులజేసును। యెరుకేవినుచదువు నెరుక
నెరుకేతిరమం। చెరిగించును శంకించును। యెరుకేకొనకే
మిలేక। యేగూనోయన్నా। బయలేచదువు। యెరుగాదోయన్నా।
యెరుకేయెన్నటి కైన పరిపూర్ణమున్నాదం। చెరిగీతాలే నాని
యెరిగీతెనిలువాక। యేగునోయన్నా। బయలేచదువు।
యెరుగాదోయన్నా॥ 159

## ప్రతిపదార్థము

చదువులు = జ్ఞానము అనగా వేదము

ఎరుకే చేసును = అధిష్టానము నుండియే పరిణమించినవి

ఎరుకే విను = ఆ వేదజ్ఞానమును శ్రవణం చేసేది కూడా గుర్తే

చదువు నెరుకే=వాటిని అధ్యయనంచేసి పాండిత్యము సంపాదించేది కూడా ఎరుకే

ఎరుకే తిరమం చెరిగించు=సచ్చిదానంద స్వరూపముగా తనను భావించునది ఎరుకే

శంకించు నెరుకే = అ శాశ్వతమని భావించునది ఎరుకే

కొనకేమి లేక ఏగునోయన్నా = పరిపూర్ణ బోధను గురుముఖత: శ్రవణం

చేసి అన్నిటికీ మూలమైన తనకు ఉన్న పరిపూర్ణమునందు మూలము గాని స్థానము గానీ లేదని తాను లేకుండా పోవునది ఎరుకే
బయలు = స్వత:సిద్ధమైన పరిపూర్ణము
ఏ చదువు ఎరుగదో యన్నా = పరిపూర్ణము తనయందు ఎట్టిగుర్తుకు స్థానముగాని మూలము గాని లేకుండా తనకు తానుగా నిలిచి వుండును
యెన్నటికైనా = ఎప్పటికైనా
ఎరుకే = ఈ గుర్తెరిగే శరీరమె
పరిపూర్ణము వున్నదని = స్వత:స్సిద్ధమైన పరిపూర్ణమే వున్నదని
ఎరిగి = గురుముఖత: దృఢపరచుకొని
తాలేనని ఎరిగితే = మూలము గాని స్థానము గాని లేదని గుర్తించిన పిదప
నిలువక ఏగు నోయన్నా = వుండుటకు వీలు లేక నశించి పోవును.

## తాత్పర్యము

అధిష్టాన రూపమైన ఎరుకే తనయందలి సంకల్పముచే (ప్రథమ చలనముచే) ఓం కారముగా పరిణమించి, శబ్ధ బ్రహ్మము అను పేరుతో (50 అక్షరములు) తో కూడి పంచాషత్ ప్రపంచమై ధ్వన్యాత్మకమైన ప్రణవమునుండి వర్ణాత్మకమైన అక్షరరూపంగా పరిణామము చెంది, వాటిని అధ్యయనము చేసి వాటియందు ప్రజ్ఞా పాటవములు కల్గించుకొని తన ఉనికిని కొన్నిచోట్ల శాశ్వతమని, కొన్నిచోట్ల అనుమానమని, భిన్నభిన్న వాదములు ప్రకటించి చివరకు తనకు పరిపూర్ణబోధచే తానుగానే లేక పోవుచున్నది.స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు గుర్తులేదు కనుక, పైక్రమమునకు తగులు కొనక కేవలత్వము కలిగి ఉండును. ఏనాటికైనా పరిపూర్ణ సాంప్రదాయ పద్ధతి యందలి గురువునాశ్రయించి పరిపూర్ణము స్వత:సిద్ధమై యున్నదని, దానియందు పరిణామ క్రమమునకు లోనైన గుర్తెరిగే శరీరము ఏమీ లేనిదని దృఢపరచుకొని గురువాక్యము (షోడశి) ద్వారా తాను లేక పోవుచున్నదని తెలియ వలెను.

**కం॥ చూపులలోగల వస్తువు। చూపులుగనువస్తువులును**
**చూపులుగూడన్। తేపకుయెరుకని తెలియుముచూపులు।**
**లేనట్టిబయలు। చూచెదింకేమీ। యెరుకేలేదు। తోచేదింకేమీ।**
**దీపామువలెకనుపాపాలొగను వస్తువె। పరమాత్మాని చూపితే**
**యెరుకాయ। చూచెదింకేమీ। యెరుకెలేదు। తోచెదింకేమీ॥ 160**

## ప్రతిపదార్థము

చూపులలో గలవస్తువు = దృక్కు
చూపులు గను వస్తువు = దృశ్యము
చూపులు = ద్రష్ట
కూడన్ = ఈ పై మూడు
తేపకు = వేరువేరుగా నున్న
ఎరుకని తెలియుము = ఒకటిగానే వున్నవని గుర్తించుము
చూపులేనట్టి బయలు = గుర్తుచేత గుర్తింపరాని పరిపూర్ణమును
చూచే దింకేమి = చూచుటకు, చూడబడుటకు సాధ్యము కాదు
ఎరుకే లేదు = గుర్తించుటకు వీలైన గుర్తే లేదు కనుక
తోచేదింకేమి = అది వున్నదని, ఇది లేనిదని భావించుటకు కూడా వీలులేదు
దీపాము వలె కనుపాపలో కల వస్తువె పరమాత్మాని చూపితే = ఆర్యదర్పణం ద్వారా నేత్ర స్థానమందు గల ఆపోజ్యోతినే పరమాత్మని అదే పరిపూర్ణమని చూపితే ఎరుకాయె=పై విధముగా సూచించబడుటచే గుర్తెరిగే తెలివికే లోబడి యున్నది.

## తాత్పర్యము

వేదాంత శాస్త్రమునందు ద్రష్ట, దృక్కు, దృశ్యము అను త్రిపుటి రూపముగానున్న ఈ సృష్టియందు దృక్కు బ్రహ్మమని, దృశ్యము మాయ యని, యదృశ్యం తన్నశ్యం అన్నట్లుగా సిద్ధాంతీకరించి యున్నారు. కాని వస్తు నిశ్చయముగా చూసినచో పై మూడునూ ఒకే వస్తువు యొక్క మూడు పనులుగా తెలియ వలెను. ఒకటి యున్నచో మిగిలిన రెండూ దానితో

కలసి యుండును. ఒకటి పోయినచో మిగిలిన రెండూ దానితో పాటే లేకుండా పోవును. ఎట్టి గుర్తుతో సంబంధపడక స్వత:సిద్ధమై యున్నది పరిపూర్ణము. దానియందు గుర్తెరిగే శరీరమునకు మూలము గాని, స్థానముగాని లేదు. ఆర్యదర్పణముద్వారా కొందరు మత వాదులు కంటి గుడ్డు యందలి ఆపో జ్యోతి ప్రకాశమునే ఎరుక యని అతడే పరమాత్ముడని చూపిస్తారు. ఇది ఎరుక పరిణామము లోనిదే గాని అనగా గుర్తుకు తోచబడి నదే గాని గుర్తుకువేరై వున్నది పరిపూర్ణము కాదని తెలియ వలెను.

కం॥ శతపత్రాప్తునిపొడగని। యతిరయమునతిమిరమణ
గియగుపడదెట్లు। ట్లతులితగురుకృపగలిగిన। మతిమంతు
లజూచియెరుక। మరి నిల్వబోదూ। సంశయమునీ। మదినిల్వ
రాదూ। శృతులందుస్మృతులందు యితిహాసములయందు।
సతతాము శ్రమపడివెతకీన యీ। యెరుక। మరి నిల్వబోదూ।
సంశయమునీ। మదినిల్వరాదూ॥ 161

## ప్రతిపదార్థము

శతపత్రాప్తుని = శతపత్రము = వంద దళములతో కూడిన పద్మము
ఆప్తుడు = స్నేహితుడు
పొడగని = ప్రభాత కిరణములను గమనించి
అతిరయమున = వెనువెంటనే, వేగముగా
తిమిరము = చీకటి
అణగి = ప్రకటము గాక తప్పుకొని
అగుపడదు = లేకపోవుచున్నది
అట్లు = ఆ విధంగా
అతులిత = అత్యంత గొప్పదైన, విలువ కట్టలేని
గురుకృప గలిగిన = దైవానుగ్రహమును పొందిన
మతి మంతులను జూచి = బుద్ధిమంతులను పరికించి, గమనించి
ఎరుక = పరిపూర్ణము వున్నది తాను లేనని గుర్తించిన గుర్తు

మరి నిల్వబోదు = ఉన్న దానిని నిర్ణయించుటకు తాను లేకపోవుచున్నది
సంశయము = ఈ అంశము నందు ఎట్టి అనుమానము
నీ మది నిల్పరాదు = నీ మనసులో ఏ మాత్రము నిల్వవుంచకు
శ్రుతులందు = శ్రుతులనగా చూసి చెప్పబడినవి (వేదమంత్రములు)
స్మృతులు = విని తిరిగి చెప్పబడినవి ఉపనిషత్తులు మొదలైనవి
ఇతిహాసములు = అష్టాదశ పురాణములు, ఉప పురాణములు
సతతము = ఎల్లవేళల
శ్రమపడి వెతికిన = ఎంత పరిశోధన గావించి విచారించిన
ఈ ఎరుక మరి నిల్వబోదు=ఈ గుర్తెరిగే శరీరము స్థిరముగ శాశ్వతముగ నిల్వబోదు

## తాత్పర్యము

స్వయం ప్రకాశరూపుడైన సూర్యునియొక్క ప్రభాత కిరణములు చీకటియొక్క స్పర్శకు అందిన వెంటనే క్షణక్షణమునకు చీకటి అదృశ్యమై ప్రకాశము బహిర్గతమగుచున్నకొలది చీకటి లేకపోవుచున్నది. ఎచ్చటికి వెళ్ళినది అని విచారించిన కూడా జాడ దొరకనిది అగుచున్నది. ఈ విధముగానే గురుకృపా ప్రసాద సిద్ధిచేత స్వతఃసిద్ధమైయున్న పరిపూర్ణము యొక్క ఉనికి గురు సూచన ద్వారా దృఢపరచుకొన్నవారికి క్రమముగా పరిపూర్ణము యొక్క ఉనికి ప్రకటమై ఎరుక యొక్క ఉనికి క్రమసహా లేనిదై చివరకు తనకు మూలము గాని స్థానము గాని లేకుండా రద్దగుచున్నది. ఇందుకు ఎట్టి సందేహము లేదు. ఇందు ఎరుక యొక్క వస్తు నిశ్చయ జ్ఞానము (స్థాన, స్వరూప, స్వభావములు) పరిపూర్ణ సూచన (అచలము, బయలు, పరిపూర్ణము) ప్రముఖముగా దృఢపడవలసి యున్నది. ఇందులకు గురు కృప అత్యంత అవసరము. ఈ రహస్యమును గురుముఖతః దృఢపరచుకోవలసినదే తప్ప వేదాంత శాస్త్రమందు అత్యంత ప్రామాణికములైన వేదజ్ఞానము చేత గాని బ్రహ్మవిద్యకు ఆధారమైన ఉపనిషత్ జ్ఞానముచే గాని వీటిని దృఢపరచుటకు చెప్పబడుచున్న అష్టాదశ పురాణములలో ఈ రహస్యము తెలియ బడదు.

౧౦॥ లేనికలదోచినప్పుడు। లేనివిచిత్రంబులన్ని లేకనె తోచున్।
లేనికలమేలుకొన్నను। లేని విచిత్రములు తానులేకపోవునురా।
అనుమానాము। లేదిందువినరా। లేనెరుకయీ రీతిగా
నెబయలునుజూస్తె। తాను తనచిత్రములు। పూనెందు
నిలచుండ లేకా పోవునురా। అనుమానాము। లేదిందు వినరా॥ _162

## ప్రతిపదార్థము

లేనికల దోచినపుడు = జాగ్రదావస్థ రీత్యా స్వప్నావస్థ నిజము కానిది కనుక లేనికల అని చెప్పవలసి వచ్చినది

లేని విచిత్రంబులు = అట్టి కలయందు తోచబడిన విషయ పరంపర

అన్ని = మొత్తమంతా

లేకనే తోచున్ = వస్తునిశ్చయముగా లేకపోయిన సత్యముగానే తోచబడును

లేనికల మేలుకొన్నను = ఇట్టి కలనుండి మెలకువ పొందిన పిదప

లేనివి చిత్రములు = కల యందు తోచబడిన సంఘటనలు

తాను = అట్టి విచిత్రములను అనుభవము కావించు గుర్తు

లేక పోవునురా = మెలకువచే లేక పోవుచున్నది

అనుమానములేదిందు వినరా = ఈ అంశములయందు ఎట్టి అనుమానము లేక పోవుచున్నది కదా

లేని ఎరుక=పరిపూర్ణము వున్నదని తాను లేదని దృఢ పరచుకొన్న గుర్తు

ఈ రీతి గానే = పైన దృష్టాంతమందు చెప్ప బడిన విధంగా

బయలును జూస్తే = గురు బోధ రీత్యా పరిపూర్ణము వున్నదని దృఢపరచుకొన్న మీదట

తాను తన చిత్రములు = గుర్తెరిగే తాను తన నుండి ఏర్పడిన జగత్తు

పూని = ప్రయత్న పూర్వకంగా

ఎందు నిలుచుండ = ఎక్కడా కూడా ఉనికి కలిగి యుండుట

లేక పోవునురా = లేక పోవుచున్నవి

## తాత్పర్యము

జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యావస్థ అను అవస్థలయందు కలుగు వాసనా ప్రభావముచే స్వప్నావస్థయందు జాగ్రదావస్థలో అనుభవమునకు రాక విడిచి పెట్టబడిన వాసనలన్నియు సంస్కార రూపమైన స్వప్నావస్థయందు అనుభవమునకు వచ్చును. ఒక మనస్సే ద్రష్ట, దృక్కు, దర్శనమై వ్యవహరించును. ఇందు భావనలేకాని క్రియలుండవు. ఇట్టి స్థితియందు ఉన్న మనస్సు మెలకువ కలిగిన మీదట అంతకుపూర్వం అనుభవించినవన్నీ లేకపోవుచున్నవి. ఇందు ఎట్టి సందేహము ఉండబోదు. ఈ రీతిగానే పరిపూర్ణము నందు గుర్తెరిగే శరీరము (ఎరుక) లేనిదని గురువాక్యము చేత దృఢ పరచుకొన్నమీదట తాను లేక పోవుటచే తన పరిణామ రూపమగు జగత్తు కూడా తన వలెనే లేకపోవు చున్నది. ఇందులకు ఎట్టి సందేహము పనికిరాదు.

కం॥ మరణసుషుప్తుల జెందిన। పురుషుడు మేల్కనినవాడు
భువితదితరుడౌ। పురుషుడు కలగనువాడని। యెరిగుండు ము।
మొదటి యతడెరుగాడీరెంటీన్ని। రెండోపురుషు డెరుగూనీ
రెంటీన్ని। యిరువురొక్కటెసుమ్మి తిరిగీ పుడుదురువీరె। గురునీచె
మేల్కొంటె। తిరిగీపుట్టనే పుట్టడెరుగాడిరెంటీన్ని। రెండో పురుషు।
డెరు గూనీరెంటీన్ని॥ 163

## ప్రతిపదార్థము

మరణ సుషుప్తులు పొందిన పురుషుడు = క్షర పురుషుడు

మేల్కనిన వాడు భువితదితరుడౌ పురుషుడు = అక్షర పురుషుడు

కలగను వాడని = ఉత్తమపురుషుడనే కలలో తోచబడిన వాడని

ఎరిగుండుము = వస్తు నిశ్చయ పూర్వకముగా గుర్తించుము

మొదటి యతడెరుగాడీ రెంటీన్ని=క్షరపురుషునికి ఈ రెండంశములు తెలియ బడవు

రెండో పురుషు డెరుగునీ రెంటీన్ని = అక్షర పురుషుడు ఈ రెండంశములు తెలిసి యుండును

ఇరువురూ ఒక్కటే సుమీ = ఈక్షరాక్షర పురుషులు ఒకరిని గూర్చి ఒకరికి తెలిసినా తెలియక పోయినా పురుషోత్తమ పద్ధతి యందు వీరు ఒక్కటిగాఅగు చున్నారు
తిరిగి పుడుదురు = ఈ ఇరువురు పురుషులు జన్మ కర్మలకు లోనగుదురు
వీరె గురునిచే మేల్కొంటె = పరిపూర్ణము వున్నది దానియందు ఎరుక లేదు అను రహస్యము గురుముఖత: దృఢ పడిన మీదట ఎరుక రూపమైన తాను లేకపోవుటచే వీరిరువురూ కూడా లేక పోవు చుందురు.
తిరిగి పుట్టనే పుట్టరు = పరిపూర్ణబోధచే ఇట్టి ఆరూఢత వలన పరిణామ క్రమమునకు లోనుకారు

## తాత్పర్యము

పిండాండమునందు మరణము, సుషుప్తి అను అవస్థలను పొందుచున్నవాడు క్షర పురుషుడు. బ్రహ్మాండమునందు ఉత్పత్తి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణ కలుగ జేయువాడు అక్షర పురుషుడు. క్షరపురుషునికి అక్షర పురుషుని జ్ఞానము లేదు. కాని అక్షర పురుషునికి తన గురించి క్షరపురుషుని గూర్చి పూర్తిగా తెలిసి యుండును. ఈ అక్షర పురుషుడు కూడా పురుషోత్తముని పరిణామమే. పురుషుడు అనగా పురమందు శయనించువాడని అర్థము. " త్రిపురుషైక పురుష: " అనగా ఒక పురుషుడే ముగ్గురుగా తోచబడుచున్నాడు. అఖండ రూపుడైన ఎరుక పురుషుడు తన సంకల్ప పరిణామముచే బ్రహ్మాండోపాధి కలిగి అక్షర పురుషుడుగా చెప్పబడు చున్నాడు. ఈ స్థితి నుండి కూడా పరిణామము చెంది పిండాండోపాధి ఏర్పడినపుడు క్షర పురుషుడుగా చెప్పబడుచున్నాడు. క్షరమనగా మార్పునకు లోనైనది. అక్షరమనగా మార్పుకు లోను కానిది. ఒక అక్షర పురుషుడే అధో దృష్టిచే క్షరపురుషుడుగాను, ఊర్ధ్వదృష్టిచే పురుషోత్తముడుగాను చెప్పబడుచున్నాడు. మరుపు రూపమైనవాడు క్షర పురుషుడు. ఎరుక రూపమైనవాడు అక్షర పురుషుడు. ఒకరిని గూర్చి ఒకరికి తెలిసిన, తెలియక పోయినా వీరు ఎరుకనే కలలో తోచబడుచున్నారు కనుక వీరికి జన్మ పరంపరలు తప్పవు. గురు కృపచే స్వత:సిద్ధమైనది పరిపూర్ణమని

దానియందు గుర్తెరిగే శరీరము ఏమీలేదని గురువాక్కు చేత మెలకువ పొందిన గాని వీరి జనన మరణ భ్రాంతి తొలగదు అని తెలియ వలెను.

కం॥ యెరుకే యెరుకకుకొడుకులు। యెరుకేతల్లిదండ్రి యెరుక
కెరుకేయితరుల్ । యెరుకే యెరుకకు మూలము। యెరుకకు
మూలంబుబయులం। చెట్లందునోయీ। యెరుకేయెరుక।
కేమిలేదోయీ। యెరుకలేని వుత్తపరిపూర్ణమునుజూచి।
యెరుకెతాలే నాని యెగిరిపోయితెపై మాటెట్లందు నోయీ
యెరుకే యెరుక కేమీలేదోయీ॥ 164

## ప్రతిపదార్థము

ఎరుకే = గుర్తెరిగే శరీరమె
ఎరుకకు కొడుకులు = ఎరుక కొడుకులుగా మార్పు చెందును
ఎరుకే తల్లి తండ్రి = తల్లీ తండ్రి రూపముగా వున్నది గూడా ఎరుకే
ఎరుకకు ఎరుకే ఇతరుల్ = తనకు తానే ఇతరులుగా తోచబడుచున్నది
ఎరుకే ఎరుకకు మూలము = ఎరుకకు ఎరుకే ఆధారము స్తానము
ఎరుకకు మూలము బయలంచెట్లందువోయి = ఉన్న పరిపూర్ణము లేని ఎరుకకు మూలము, ఆధారము కాదు
ఎరుకే ఎరుకకు ఏమీ లేదోయి = తన మూలమును ఆధారమును విచారించగా తనకు తానే లేక పోవు చున్నది
ఎరుక లేని ఉత్త పరిపూర్ణమును జూచి = స్వత:సిద్ధమైన పరిపూర్ణమును గురువాక్యము చేత దృఢపరచుకొని
ఎరుక తాలేనని ఎగిరి పోయితె=గుర్తెరిగే శరీరము తాను లేనని దృఢపరచుకొన్నమీదట
పై మాటెట్లందు నోయి=ఉన్నదని గాని, లేనిదని గాని నిర్ణయమే లేకుండును.

## తాత్పర్యము

ఎరుకే తన పరిణామ క్రమములో సర్వముగా మార్పు చెంది **కొడుకు, తల్లి తండ్రులు,** ఇతరులుగా వ్యవహరించు చుండును. (అన్నియు

తానై కందార్థ భావము (ప్రకారము) అన్నిటికీ మూలమైన తాను తనమూలమును విచారించినపుడు స్వతఃసిద్ధమైన పరిపూర్ణము నందు తనకు మూలముగాని, స్థానము గాని లేదని తనయందు తానే శూన్యమని గురువాక్యముచే దృఢ పరచుకొని తాను లేక పోవుచున్నదని భావము.

కం॥ నినునీవు నన్నునేనును। ననునీవునేనిన్ను యెరిగి
నదెకలయిదితా। తననెరుగని దానినిగని। తనకలిమిమృష
నుచు దెలసి। తానేగెనేనీ। అదిమేల్కవలి। దాన్నెవ్వడెరిగీనీ
ననునీవునే నిన్నుబోధ। వినిపించువినుమాని। యనుటాకిద్దరి
కిపుడు। మునుపున్నయెరుకేది। తానేగెనేనీ। అదిమేల్కవలి।
దాన్నెవ్వడెరిగీనీ॥ 165

## ప్రతిపదార్థము

నిను నీవు = నీ గురించి, నీ గుర్తు గురించి

నన్ను నేనును = నేను, నా గుర్తు గురించి

నను నీవు నేనిన్ను ఎరిగినదె కల=ఈ రెండు గుర్తులు కలిగించుకొన్న గుర్తు లేనిది

ఇది = ఈ గుర్తెరిగే శరీరము

తా తన నెరుగని దానిని గని = ఈ గుర్తుతో సంబంధ పడని పరిపూర్ణమును ఉండ జూచుకొని

తన కలిమి మృషనుచు దెలిసి = తన ఉనికి లేనిదని దృఢ పరచుకొని

తానేగె నేని = గురు వాక్యము చేత లేకపోయిన పిదప

అది మేల్క = ఈ స్థితినే మెలకువగా చెప్పబడు చున్నది

దాన్నెవ్వడెరిగీనీ = స్వతఃసిద్ధమైన దానిని ఇట్టి మెలకువ కలిగించు కొన్న మీదట గుర్తెరుగుటకు ఎవ్వరు మిగలరు

నిను నీవు = గుర్తిస్తు వినగలిగే నీవు

నే నిన్ను = బోధిస్తు దృఢపరచుకో అని చెప్పే నేను

బోధ = దృఢ పరచ బడిన అంశము

వినిపింతు = చెప్పమని
వినుమాని యనుటకు = గ్రహింప మని చెప్పుటకు
ఇద్దరికీ = గురు శిష్యులకి
ఇప్పుడు = ఇట్టి స్థితి యందు
మునుపున్న ఎరుకేది = ఇంతకు పూర్వము ఉన్న గుర్తు ఇపుడు లేనిది.

## తాత్వర్యము

వినే శిష్యుడు ఉపదేశించే గురువు వీరిరువురి మధ్య జరిగే ప్రబోధ ఎరుకనే కలలోనివి. (ఎరుకను కల లోపల కందార్థము) స్వతఃసిద్ధమైన పరిపూర్ణమును గురువాక్యముచే దృఢ పరచుకొని దానియందు గుర్తెరిగే తెలివికి మూలము గాని స్థానముగాని లేదని దృఢ పరచుకొనుటయే మెలకువగా చెప్పబడుచున్నది. ఉన్నపరిపూర్ణము నందు చెప్పే గుర్తుగాని, వినేగుర్తుగాని లేదు. ఇట్టి ఆరూఢత చెందిన పిమ్మట వినిపించుటకు, వినుటకు ఇద్దరియందు గుర్తు లేక పోవుచున్నది. ఇదియే మెలకువ స్థితిగా చెప్పబడుచున్నది.

**కం॥ నానావిధావయవములు। నానావిధనామరూప నటనలు**
**మాయల్। నానావిధాలవూహలు। నేననుయెరుకందెయిన్ని। నిబి**
**డామైయుండూ। బయలునుగన తా। నిలువ లేకుండూ। నేను**
**మేనీరెండునేనెనేలేకుంటె। మేనూలేదిది లేకనే నిల్చెదెట్లిన్ని।**
**నిబిడా మైయుండూ। బయలునుగనతా। నిలువా లేకుండూ॥ 166**

## ప్రతిపదార్థము

నానావిధావయవములు = అంతరేంద్రియ, ప్రాణేంద్రియ, జ్ఞానేంద్రియ, విషయేంద్రియ, కర్మేంద్రియములు
నానావిధ నామ రూప నటనలు=భిన్న భిన్న రూపములతో కూడిన పేర్లు, వస్తువులు
నానావిధ ఊహలు = భిన్న భిన్న సంస్కారములు
నేనను ఎరుకయందే = నే ననే గుర్తెరిగే శరీరము నందే
యిన్ని = పైన పేర్కొన్న వన్నీ

నిబిడామైయుండు = గర్భీకృతమై యుండును
బయలును గన = స్వత:సిద్ధమైన పరిపూర్ణమును వుండ జూచుకొని
తానిలువ లేకుండు = ఉన్నదానియందు గుర్తెరిగే తెలివికి మూలముగాని స్థానము గాని లేదని దృఢపరచుకొని
నేను = గుర్తెరిగే శరీరము
మేను = దానికి స్థూలముగా వ్యాపించి వున్న జగత్తు
ఈ రెండు నేనే = పై రెండు కలసి నేనను గుర్తు ఏర్పడు చున్నది.
నే లేకుంటె మేనులేదు=సూక్ష్మమైన గుర్తు లేనిచో స్థూలమైన శరీరము లేకుండును
ఏదిది లేక = ఈ పైన పేర్కొన్న రెండు లేకపోవుట చేత
నేనిల్చేదెట్లెన్ని = నేను అనే గుర్తు నిల్చుటకు తావులేదు.

## తాత్పర్యము

అధిష్టాన రూపమైన అఖండ ఎరుక యందు నానాత్వ మంతయు బీజరూపముగా ఇమిడి యుండును. తన యందు గల సృజనాత్మక శక్తిచే అనేక మగుదును గాక అను సంకల్పముచే అవ్యక్తము, మహత్తు, మహదహంకారము, పంచతన్మాత్రలు, పంచ మహా భూతములుగా పరిణామము చెంది ఏకం అనేకం భవతి అన్నట్లుగా పరిణామము చెందును. అందువలన నానాత్వ మంతయు ఎరుకకు పూర్వపుదశ యందు బీజ ప్రాయముగా యుండి పరిణామ క్రమములో నానాత్వము చెందు చుండును. ఈ పరిణామము దీనికి స్వాభావికము. స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు ఇట్టి గుర్తుకు మూలము గాని, స్థానము గాని లేదు అని దృఢ పరచుకొన్నమీదట పైన పేర్కొన్న గుర్తు లేక పోవుచున్నది. వస్తునిశ్చయముగా ఈ గుర్తును విచారించిన వారికి నేను, మేనులు రెండూ కలిసి గుర్తు ఏర్పడు చున్నది. అని తెలియును. పిండాండము నందు వ్యష్టి మన:ప్రాణముల కలయికలో బ్రహ్మాండము నందు సమిష్టి మన:ప్రాణముల కలయికలో, అధిష్టాన అవ్యక్త సంధిలో గుర్తు ఏర్పడు చున్నది. ఈ రెంటిలో ఒకదానిని విడచి ఒకటి ఉండవు. ఒకదానిని

విడచుటకు ప్రయత్నించుటలో దానితో పాటుగా రెండవది గూడా లేక పోవును. గురు ముఖత: వస్తునిశ్చయ పూర్వకముగా ఈ నేను మేనుల వివరణ తెలియ వలసి ఉన్నది. ఇది అత్యంత గురుగోప్యమైన రహస్యము అని తెలియ వలెను.

కం॥ పరిపూర్ణ మనెటి పలకే। యెరుకను బల్పాక్షరముల
కెచ్చుటగనినన్। తిరమైయున్నది కనుగొని। యెరుకను
బల్పాక్షరముల। నికగట్టిపెట్టు। యెవరికి దెలియ। దిదిమూల
గుట్టు। గురుమూర్తి కరుణాచెయెరిగితెల్పితినేనీ। పరిపూర్ణబో
ధాను। పరులుజెప్పినబోధ। నికగట్టిపెట్టు। యెవరికి దెలియ।
దిదిమూలగుట్టు॥ 167

## ప్రతిపదార్థము

పరిపూర్ణమనేటి పలకే=స్వత:సిద్ధమైన పరిపూర్ణము కదలని పలకతో పోల్చబడుచున్నది

ఎరుకను బల్పాక్షరముల = గుర్తెరిగే తెలివిని కదలికతో కూడిన అక్షరసముదాయము తో పోల్చబడుచున్నది

యెచ్చుటకనినన్=ఎచ్చుటెచ్చుట విచారించినను ఈ అంశము దృఢపరచుకొనుటకు

తిరమైయున్నది = కదులుటకు వీలులేక దృఢమై స్వత:సిద్ధమై యున్నది

కనుగొని = గురుముఖత: విచారణ జేసి

ఎరుకన్ బల్పాక్షరములను = జీవేశ్వర జగద్రూపముగా తోచుచు చలనాత్మకమైన ఈ వస్తువులను ఎరుక స్వరూపముగా గుర్తించి

నికగట్టిపెట్టు = ఆపైన ఎరుక లేనిదని దృఢపరచుకొనుము

ఎవరికి తెలియదుఇది=ఈ చలాచల లక్షణములు మతకర్తలకు తెలియని అంశము

మూలగుట్టు = అత్యంత రహస్యమైన అంశము

గురుమూర్తి కరుణచే ఎరిగి = ఎరుక, పరిపూర్ణములయొక్క వస్తునిశ్చయ జ్ఞానము గురుముఖత: మాత్రమే గుర్తింప తగినది

ఎరిగి తెలిపితి నేనీ పరిపూర్ణ బోధ=ఈ సమగ్రమైన విచారణను గురుముఖత:

ఆరూఢపరచుకొని ఈ కందార్థముద్వారా మీకు చెప్పుతున్నాను
పరులు చెప్పినబోధ = మతవాదులు చెప్పేటి సిద్ధాంతము

## తాత్పర్యము

కదలని పలకపై కదలగలిగే శక్తి కలిగిన బలపముతో కదులుచున్న అక్షరములు వ్రాయబడుచు తిరిగి రద్దుచేయబడి, మరల తిరిగి రాయగలిగి నట్లుగా అఖండమైన పరిపూర్ణమునందు గుర్తెరిగే ఎరుక తనయందు గల సృజనాత్మక శక్తిచే పిండాండ బ్రహ్మాండాకారముగా పరిణామము చెంది చలనాత్మకమై వచ్చి పోవుచుండెడి స్వభావము కలదై వున్నది. ఈ అంశములను గురుముఖత: వస్తు నిశ్చయ పూర్వకముగా అచలము, బయలు, పరిపూర్ణము అను సాంకేతిక శబ్దములచే కదలని వస్తువు గూర్చి పిండ బ్రహ్మాండములు, అధిష్టానము, గుర్తెరిగే ఎరుక యొక్క వస్తు నిశ్చయ పూర్వకముగా స్థాన, స్వరూప, స్వభావములతో దృఢ పరచుకొని ఉన్నపరిపూర్ణమునందు లేనిది ఎరుక యని గ్రహించి ఎరుక పరిణామ రూపమగు బ్రహ్మాండ పిండాండములు లేనివని విడిచి యుండుము (ద్వాదశి, షోడశి భావములు).

ఈవిధానము మతవాదులకు తెలియక జన్మ కర్మలకు కారణమగు అధిష్టానమునే మోక్షస్థానముగా నిర్ణయించి భిన్నభిన్న భావములు ప్రచారము చేసి యున్నారు. కాని పరిపూర్ణ బోధ రీత్యా పరిపూర్ణము, ఎరుక లను విడివిడి గా గుర్తించి, గుర్తించిన గుర్తును రద్దు పరచుకొన గల్గిన భ్రాంతి రహిత విధానము జనన మరణ రహిత విధానమునకు మార్గముగా సూచింప బడు చున్నది. " రహస్యం హేత దుత్తమమ్ " ఉత్తమమైన ఈ రహస్యము గురుముఖత: మాత్రమే దృఢపరచు కొనవలసి ఉన్నది. ఇట్టి ఆరూఢత యందు భిన్నభిన్న మతములకు చోటు ఇవ్వగల్గిన ఎరుకకు మూలము గాని, స్థానముగానీ లేనిదగుచున్నది. కావున దానిని విడచి యుండుము అని భావము.

**కం॥ చూపించజూపరానిది। చూపించితిదాన్నివుండ జూచితివిగదా।**
**చూపించజూచెనిదిదీ। న్నేప్రొద్దికదల్చబోకు। మిదె గురుబోధా।**
**నిన్నంటాదు। నితరామెబాధా। నాపాపనా కూన। నాచిన్ని।**
**నాయన్న। నాపెన్నిధానామ। నారత్నముల కొండ। యిదె**
**గురుబోధా। నిన్నంటాదు। నితరమే బాధా॥ 168**

## ప్రతిపదార్థము

నాపాప =నాతండ్రీ

నాకూనా = మా నాయనా

నా చిన్ని = నా ముద్దులవాడా

నాయన్నా = నా బాబు

నాపెన్నిధానమా = నా జీవిత లక్ష్యమా

నారత్నముల కొండా = నా నిధి నిక్షేపములు,

చూపించ చూపరానిది = చూపించుటకు వీలుకానిది

చూపించితి = నీకు చూపగలుగు చున్నాను

దాన్ని = అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును

యుండజూచితివి కదా = నీవు వుండగా అది ఎట్లు ఉనికి గలిగి యున్నదో దృఢపరచుకొన గలిగితివి గదా

చూపించ జూచెనిది = వస్తునిశ్చయ పూర్వకముగా చూపించుటకు వీలై యున్న గుర్తెరిగే శరీరమును నీకు వేరు కాకుండా చూపించ గల్గు చున్నాను

దీన్ని = ఈ గుర్తెరిగే శరీరాన్ని

యేపొద్దు = త్రికాలముల యందు

ఇకతల్చ బోకు = మూలము లేని గుర్తెరిగే శరీరము లేనిదని దృఢపరచుకో

ఇదే గురుబోధ = ఇదే పరిపూర్ణ భావము నందలి రహస్యము

నిన్నంటాదు ఇతరమేబాధ = ఇట్టి ఆరూఢతయందు, జనన మరణ చక్రము నందు ఈ గుర్తు ప్రవేశింపదు

# తాత్పర్యము

చూచుటకు, చూపించుటకు వీలైయున్న వస్తువు మన స్వస్వరూపమైన ఆత్మ లేక బ్రహ్మము (ఎరుక) ఈ ప్రక్రియ కర్మ చక్షువులచే కాక జ్ఞాన చక్షువుచేత మాత్రమే చూపుట, చూడబడుట సాధ్యమగుచున్నది. "ఆత్మా వారే ద్రష్టవ్యో " అనగా ఆత్మ చూడతగినది అని శ్రుతి చెప్పుచున్నది. దేనిచేత అను ప్రశ్నకు "మనసైవాను ద్రష్టవ్యం" అనగా మనస్సుచే మాత్రమే చూడ తగినది అని పేర్కొనబడు చున్నది. గురువు తన్నాశ్రయించిన శిష్యునికి పిండాండ దృష్టినుండీ బ్రహ్మాండ దృష్టికి బ్రహ్మాండ దృష్టినుండి అధిష్టాన దృష్టికి విచారణ ద్వారా మనస్సును వికశింప జేసి అఖండ ఎరుక యొక్క ఉనికిని వస్తు నిశ్చయ పూర్వకముగా స్థాన, స్వరూప, స్వభావములతో దృఢ పరచి బుద్ధినిశ్చయము గావించును. దర్శితంయేన అను శబ్ధముచే గురుగీత యందు గురువు యొక్క అవసరము చెప్పబడుచున్నది. వస్తువును గూర్చి బోధించుటయే కాక చూపించుట కూడా జరగ వలసియున్నది. అప్పుడే "దర్శనం యేన" అను శబ్ధము సార్ధకమగును. "పిండ బ్రహ్మాండంబులు రెండునూ" అను కందార్థములో ఈ అంశమునే పేర్కొంటూ "అఖండంబగు ఎరుక రూపు కనరా మాతండ్రి" అని చెప్పబడుచున్నది. ఇది అంతయు బుద్ధి నిశ్చయము. ఇది విన్నశిష్యుడు తన మనస్సును ఏకాగ్రము చేసి విన్న స్వరూప స్థితి యందు మనస్సును వ్యాపకత్వము జేసి, ఆత్మ నిశ్చయము సాధించవలసియున్నది. ఈ విధాన మంతయు గురుశిష్యుల మధ్య రహస్యముగా బోధనా, సాధనా పద్ధతులచే సాధ్యము కాగలదు. ఉపదేశ పద్ధతియందే ఇది సాధ్యపడును. పరిపూర్ణబోధయందు ఎరుక నిరూపణ చాలా అవసరమై యున్నది. పైన పరిపూర్ణబోధచే అది నిరసన గావింపబడగలదు.

ఏది తెలిసిన మీదట ఇక తెలియ వలసినది లేదో అదియే ఎరుక యొక్క వాస్తవరూపము. తెలివిచే తెలియ బడునది. ఇదియే " ఎరుకకు ఎంత ఎరుకో " నేను అంత తెలియ జేసితిని. ఈస్థితియందు గురుశిష్యులు

ఏకస్థితియందుండుటచే గురుసూచన ద్వారా అచలము, బయలు, పరిపూర్ణము అను శబ్ధములచే పరిపూర్ణ సూచన గావించి దృఢ పరచబడుట జరుగును. ఇట్టి స్థితియందు తాను, తనకన్యముగానున్న పరిపూర్ణము అను రెండంశములు గ్రహింప గలుగను. దీనినే వుండ జూచుకొనుట అను శబ్దముచే సూచింపబడుచున్నది. ఇట్టి ఆరూఢత యందు ఉన్నదానిని గ్రహించి లేనిది లేదని గ్రహించ గల్గుట సాధ్యమగును. ఇట్టి స్థితినిగూర్చిన అంశము అత్యంత గురుగోప్యము. గురుకృపచే మాత్రమే ఆరూఢపరచ గలుగు బోధనా విధానము.

ఇట్టి ఆరూఢత చెందిన వారికి ఇక జనన మరణ భ్రాంతి కలుగదని, సందేహరాహిత్యమునకు ద్వాదశి, షోడశి మంత్రార్థములు వివరించి స్థితి అనుభవము గురువు కలిగించును. ఇట్టి ఆరూఢత చెందినవాడు మాత్రమే గురు ఆజ్ఞాను సారము గుర్తువిడిచి, పూని మరలతిరిగి వేరొకరికి అట్టి స్థితి ఆరూఢపరచగలుగు యోగ్యత అధికారము సంక్రమించును. దానిని వక్కాణిస్తూ పాప, కూన, చిన్ని, నాయన్నా, పెన్నిధానమా, రత్నముల కొండా అను శబ్దములచే శిష్యుని యోగ్యతను, పాత్రతను, ప్రయోజనాన్ని ఈ కందార్థమందు సూచింపబడుచూ ఒక్క పరిపూర్ణబోధచే పైన పేర్కొన్న క్రమంలో ఆరూఢత చెందినవారికి మాత్రమే జనన మరణ భ్రాంతి రహిత విధానము కలుగ గలదని స్పష్టముగా చెప్పబడు చున్నది.

పరిపూర్ణమును చూపించుట కాని, చూపుట గాని సాధ్యము కాదు. అట్టి అంశమును చూపుటకు, చూచుటకు వీలైవున్న ఎరుకను (జ్ఞానము) ద్వారా మాత్రమే గ్రహింప జేయుట సాధ్యమగును. ఈ అంశమును చెప్పుటకు ఈ కందార్థమునందు ఎట్లు వీలగుచున్నదో చెప్పబడు చున్నది. సాంప్రదాయబద్ధమైన గురూపదిష్ట మార్గమునందు మాత్రమే ఈ ఎరుక, పరిపూర్ణము నిరూపణ వీలగును. ఇదియే గురుప్రబోధయందలి రహస్యము. ఇదియే ఈ కందార్థమునందలి పిండితార్థము వంటిది.

కం॥ నామము రూపము నటన। స్తోమము బయలందు లేదు
చూడుము నీవా। నామమురూపము నటన। స్తోమము
యెరుకందుగలదు చూడూమి నిజమూ। బయలెరుకాల। చూచి
చూడకుమూ। వేమారునేనెంత వినజెప్పినా గాని।
యీమార్గమెతప్పు। యికలేదు రెండోది చూడూమి నిజమూ
బయలెరుకాల। చూచి చూడకుమూ॥ 169

## ప్రతిపదార్థము

బయలందు = స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు

నామము = శబ్దము

రూపము = ఆకారము

నటన, స్తోమము = క్రియలు మొదలైన సమూహము

లేదు = వుండజాలదు

చూడుము నీవు = వస్తు నిశ్చయపూర్వకముగా నీవు దృఢపరచుకొనుము

ఎరుకందు = గుర్తెరిగే తెలివి యందు

నామము రూపము నటన స్తోమము = శబ్దము, ఆకారము, క్రియలు మొదలైన సమూహము

కలవు = కలవు

చూడుమీ నిజము = వస్తునిశ్చయ పూర్వకముగా దృఢపరచుకో

బయ లెరుకాల = పరిపూర్ణము, లేనిఎరుకను

చూచి చూడకుమీ = ఉన్నదానిని దృఢపరచుకొని లేనిదానిని గుర్తించుము

వేమారు = అనేక పర్యాయములు

నేనెంత వినజెప్పినాగాని = ఎన్ని దృష్ట ద్రాష్టాంతములుగా చెప్పబడుచున్న

ఈ మార్గమె తప్పు=పరిపూర్ణము వున్నది ఎరుక లేదు అను విధానము తప్పు

ఇకలేదు రెండోది = భ్రాంతి రహిత విధానమునకు వేరే మార్గము లేదు

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణమునకు నామము, రూపము, క్రియ, వ్యవహారము ఏమీలేదు. ఇవన్నియు గుర్తెరిగే ఎరుకయందు మాత్రమే కలిగియున్నవి. ఈ రెండంశములు వస్తునిశ్చయ పూర్వకముగా కేటాయించి గురుముఖత: గుర్తించుకొనవలసి ఉన్నది. ఆపైన ఉన్న పరిపూర్ణమునందు ఎరుక లేనిదని గ్రహించి గుర్తును షోడశి వాక్యము ద్వారా విడిచి యుండుము. ఎన్ని దృష్ట ద్రాష్టాంతముల ద్వారా దృఢ పరచిన ఈ క్రమము తప్ప జనన మరణ రహిత విధానమునకు వేరే మార్గము లేదని గుర్తించుము.

**కం॥ గురుడు గురుబోధ శిష్యుని। కెరిగించెటి వేళ్లశిష్యు డెరిగెటి వేళ్ళన్। యిరువురు వైశ్వానర క। ర్పూరములవలె వెలిగియ వల। పొడజూపరోయీ అట్లనెనీ। విక్కడదెలియు మోయీ। పరిపూర్ణమెరుకాల నెరిగి। యా మీదట। యెరు కాను విడచూటె। గురుబోధం చెరుగూము। పొడజూ పరోయీ। అట్లనె నీవిక్కడ దెలియుమోయీ॥ 170**

## ప్రతిపదార్థము

గురుడు = పరిపూర్ణ భావమును ఉన్నదున్నట్లుగా దృఢపరచుకొన్నవాడు
గురుబోధను = తాను దృఢపరచుకొన్న పరిపూర్ణభావమును
శిష్యునికి=అట్టి భావమును ఆరూఢ పరచుకొనుటకు ప్రయత్నించు వానికి
కెరిగించేటి వేళ = పరిపూర్ణము, ఎరుకలను వస్తునిశ్చయ పూర్వకముగా గుర్తింపజేయు సంధర్భములో
ఇరువురు = గురు శిష్యులు వారి గుర్తుతో సహా
వైశ్వానర కర్పూరమువలె = దీపము కర్పూరము కలిసి
వెలిగి = ప్రకాశించి
ఆవల = ఆ తదుపరి
పొడ జూపరోయి = వెదకిన ఇరువురి గుర్తు రద్దగును
అట్లనే = అవిధముగానే

నీవిక్కడ తెలియు మోయి = గుర్తెరిగే శిష్యుని గుర్తు ఎట్లు రద్దు కాగలదో గ్రహించుము లేక దృఢపరచుకొనుము
పరిపూర్ణ మెరుకాలనెరిగి = వస్తునిశ్చయ పూర్వకముగా పరిపూర్ణము ఎరుకలను గుర్తించి
యామీదట = ఆపైని
ఎరుకను విడచుటె=పై రెంటినీ గుర్తించిన గుర్తును విడచుటే (షోడశి వాక్యము ద్వారా)
గురుబోధం చెరుగుము=గురుబోధ యందలి క్రమవిధానము అని తెలుసు కొనుము

## తాత్పర్యము

ఈ కందార్థమందు ద్వాదశి, షోడశి మంత్రములే కాక పంచదశి మంత్రము యొక్క విధానము కూడా చెప్పబడుచున్నది. పరిపూర్ణము ఎరుకల యొక్క ఉనికిని వస్తునిశ్చయ పూర్వకముగా గురువు శిష్యునికి సూచించువేళ శిష్యుడు అట్టి సూచనను గ్రహించు వేళ వారిరువురు దీపము (అగ్ని) కర్పూరము వలె ప్రకాశించి ఒకటిగా జ్వాలగా ప్రకాశించి వెలిగి, వెలిగి రెండు లేకపోయిన విధముగా వారిరువురి గుర్తులు లేకపోవును. ఆవిధంగానే పరిపూర్ణబోధయందు గురువు, శిష్యుడు ఇరువురు అఖండ ఎరుక స్వరూపులుగా మారియుండి నపుడు అచలము, బయలు, పరిపూర్ణము అను శబ్దముల ద్వారా పరిపూర్ణముయొక్క ఉనికి దృఢపరచి అనుమాన నివృత్తికి ద్వాదశి వాక్యము ద్వారా ఆవరణమునుండి విడిపించును. ఇట్టి స్థితియందు పరిపూర్ణము యొక్క ఉనికి గ్రహింపబడి అది ఉన్నదని, దానియందు తాను లేనని గ్రహించును. ఇదియే లేని ఎరుక స్థితి. ఈ స్థితియందు షోడశి వాక్యము ద్వారా ఈ గుర్తును కూడా రద్దుపరచును. పై విధముగా దృఢపరచుకొన్న పిదప రద్దు అయిన స్థితిని పంచదశీ మంత్రము ద్వారా అనగా కలదోచిన శరీరము ఏలాగున లేదో ఆలాగునే మూలము లేని గుర్తెరిగే శరీరము లేదని దృష్టాంత పూర్వకము గాను, అనుభవముచే దృఢ పరచుకొనుటకు కర్పూరము దీప సంయోగము

చెందితే ఏలాగున లేదో అలాగునే మూలము లేని గుర్తెగే శరీరము లేనిదని ద్రాష్టాంతము ద్వారా దృఢపరచును. ఈ క్రమమంతయు గురుప్రబోధము నందు రహస్యముగా నున్నది. ఉపదేశ పద్ధతిచే సూచింపబడును. ఇదియే పరిపూర్ణబోధ శిష్యునికి బోధించు విధానము సాంప్రదాయక పద్ధతిగల గురువుచేత మాత్రమే ఈ రహస్యము తెలియ వలెను.

**కం॥ సతికౌగిట తత్పతి త। త్పతి కౌగిట సతియుజేరి పవళించి**
**కలన్। మృతిజెంది మేలుకని సు। స్థితులైయొక రొకరి కట్టి।**
**చేష్ట తెల్పుదురా। సిగ్గెడలి యా। చేష్టానిల్పుదురా। ప్రతిలేని**
**గురుబోధస్థితి జెంద్యట్లనె సం। తతతిరిగి లేనెరుక। గతి**
**యిట్టిదని దానిచేష్టదెల్పుదురా। సిగ్గెడలియా। చేష్టానిల్పుదురా॥171**

## ప్రతిపదార్థము

సతికౌగిట తత్పతి, తత్పతి కౌగిట సతియుజేరి=భార్యా భర్తలు సంతానవతు లగుటకు ఏక శయ్యపై ఒకరిని యొకరు ఆశ్రయించుకొని యున్నవేళ

పవళించి = నిదురించి (శయనించి)

కలన్ మృతిచెంది = కలలో ఒకరి కొకరు మరణించినట్లుగా భావన చెంది

మేలు కొని = మెలుకువ చెంది

సుస్థితులై = ఒకరి నొకరు సముదాయించుకొని

యొకరికొకరు = ఒకరి నొకరు ఎదురెదురుగా చూచుకొని

అట్టి చేష్ట తెల్పుదురా = స్వప్నావస్థయందు వారు పొందిన భావమును ఒకరి కొకరు వ్యక్త పరచు కొందురా

సిగ్గెడలి = సిగ్గు విడచి

ఆచేష్ట నిల్పుదురా=కలలో వారు పొందిన భావములు నిజములని భావిస్తారా?

ప్రతిలేని గురుబోధస్థితి = సాటిలేని పరిపూర్ణబోధయొక్క స్థితి లక్షణము

చెంది = పొంది, దృఢపరచుకొని

అట్లనే = పైన పేర్కొన్నవిధంగా

సంతత = ఎల్లప్పుడు

తిరిగి = బాగా విచారణ చేసి
లేని ఎరుక గతి ఇట్టిదని = స్వతఃసిద్ధమైన పరిపూర్ణము నందు లేని గుర్తెరిగే శరీరము యొక్క ఉనికి

## తాత్పర్యము

భార్యా భర్త ఇరువురు ఏకశయ్యాగతులై జాగ్రదావస్థ నుండి నిద్రావస్థకు ప్రయాణమై మధ్యలో స్వప్నావస్థయందు భావనా రూపమైన మనస్సు యొక్క విక్షేప శక్తిచే ఒకరి కొకరు అభిముఖముగా వుండి కలగాంచుచు భర్త కలలో భార్య, భార్య కలలో భర్త మరణించినట్లుగా భావన చెంది, అట్టి ఉద్వేగములో మెలకువస్థితి చెంది ఒకరి ఎదురుగా ఒకరు గాంచుకొనుచు మెలకువ యందలి వాస్తవమును దృఢముగా ఎంచి, కలయందలి దృశ్యము అవాస్తవమని, నిజముకాదని దృఢపరచుకొని ఒకరి కొకరు స్వప్నమందలి భావమును వ్యక్తపరచుకొనుటకు ఇష్టపడరు. ఏలననగా అది అవాస్తవమని వారు గుర్తెరుగుటయే. ఆవిధముగానే పరిపూర్ణమును ఎరిగి, ఎరుకను ఎరిగి, ఎరుకను విడచుట అను బోధ క్రమములో వస్తునిశ్చయ పూర్వకముగా పైరెంటి వివరణ దృఢపరచుకొని చివరిగా ఎరుకను విడచు సంధర్భమందు అంతవరకు వారు భావించిన వస్తువులను గూర్చి (ఎరుక, పరిపూర్ణము) తెలిసితిమి అనిగాని, తెలియలేనిది అనిగాని, విడచితిమి అనిగాని, ఏనిర్ణయమును చెప్పుటకు సాహసించరు. ఏలననగా ఎట్టినిర్ణయము చేయుటకైనను గుర్తెరిగే ఎరుక వుండవలెను. గుర్తునకు లోబడునది ఏదియు పరిపూర్ణము కాదని సిద్ధాంతము కావున ఎట్టినిర్ణయము లేక పరిపూర్ణమునందు ఉనికి కలిగి యుందురు అని భావము.

కం॥ పరిపూర్ణ మెరుక లివియని। గురువరుడెరిగించి యెరుక కూటమి
మాన్పన్। గురువుకుగురు। వెవరనుటకు మరి శిష్యునికింకనోట
మాటవెళ్ళీనా పోయినయెరుక మళ్ళిమళ్ళీనా। గురుశిష్యులనియేటి
గురుతెన్నడెరుగాక। నిరతాము యొకరీతి నిలుచున్నబయలందు।
మాట వెళ్ళీనా। పోయి నయెరుక మళ్ళీ మళ్ళీనా॥ 172

## ప్రతిపదార్థము

పరిపూర్ణము = స్వత:సిద్ధమై యున్న వస్తువు
ఎరుక = సమస్త సృష్టికి అత్యంత మూలాధారము బ్రహ్మము
లివియని ఎరిగించి = వస్తునిశ్చయ పూర్వకముగా స్థాన, స్వరూప, స్వభావములతో గుర్తింప చేసి
గురువరుడు = సాంప్రదాయబద్ధమైన ఆరూఢత చెందిన పరిపూర్ణగురువు
ఎరుక కూటమి మాన్పన్=గుర్తెరిగే ఎరుక యొక్క సంబంధము నుండి విడిపించిన
గురువుకు = అట్టి గురుమూర్తికి
గురువెవరనుటకు = పై క్రమము బోధ పరచ బడిన గురువుకు
మరి = అట్టి స్థితిని పొందిన తరవాత
శిష్యునికి ఇంక = దృఢ పరచుకొన్న శిష్యునికి
నోటమాట వెళ్ళీనా = మాట్లాడుటకు భావము సరిపోదు
పోయిన ఎరుక మళ్ళీ మళ్ళీనా = గురువాక్యముచేత విడువ బడిన (మూలము లేని గుర్తెరిగే శరీరము) ఎరుక వీడిన తరువాత తిరిగి ఆక్రమించదు
గురు శిష్యులనియేటి గురుతెన్నడెరుగాక = ప్రబోధించు గురువు దృఢపరచుకొన్న శిష్యుడు అను గుర్తు లేకుండా
నిరతాము = సర్వకాల సర్వావస్థల యందు
ఒక రీతి = ఎట్టి మార్పులకు లోనుకాకుండా
నిలుచున్న = కదలనటువంటి
బయలందు = స్వత:సిద్ధమైన పరిపూర్ణము నందు

## తాత్పర్యము

సాంప్రదాయబద్ధమందలి పరిపూర్ణగురునిచే వస్తునిశ్చయ పూర్వకముగా పరిపూర్ణము, ఎరుకలనుగూర్చి సమగ్రముగా గుర్తింపచేసి, చివరిగా గుర్తించిన గుర్తునుగురువాక్యముచే ఎరుకను విడచిన పిదప శిష్యునికి తనకు ఉపదేశించి దృఢపరచిన గురువునుగూర్చి గాని, వివరించుటకు శిష్యునికి గుర్తు వుండదు కనుక తన అనుభవమును

వ్యక్తపరచుటకు మాటలు సరిపోవు. గురువు, శిష్యుడు అను గుర్తు ఏమాత్రము లేక స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందుఉనికి కలిగియుండి ఏనిర్ణయము చేయని స్థితియందు ఉనికి కలిగి యుండును. బోధాగ్నిచే విడిచి పెట్ట బడిన ఎరుక మరల తిరిగి సంక్రమించదు. నిర్ణయో నాస్తి సర్వదా అన్నట్లుగా ఉండును.

**కం॥ అందముగా సద్గ్రంథము। చందము వినిపింతుదాన్ని చదివి నవిననన్। ముందుగబయలెరుకై యే। సందునలే నెరుక లేక। జనవలెసుమీ్మ। అదెయిది। వినిచదువుమీనమ్మీ। యెందూకు నీకింక యితరశాస్త్రములజోలం। దుగుర్తుండిపోదదిగాన యీాయెరుక। జనవలెసుమీ్మ। అదెయిది విని చదువుమీనమ్మీ॥173**

## ప్రతిపదార్థము

అందముగా = స్పష్టముగా
సద్గ్రంథము = పరిపూర్ణభావమును దృఢపరచగల్గు కందార్థగ్రంథము
చందము = నిర్మిత విధానము లేక బోధనా క్రమము
వినిపింతు = కందార్థరూపములో మీకు దృఢపరచగలను
దాన్ని చదివిన వినినన్ = ఈ గ్రంథమును స్వయముగా పరిశీలించినగాని, గురుముఖత: శ్రవణము చేసినగాని
ముందుగ బయలెరుకై = ప్రథమములో స్వత:సిద్ధమైన పరిపూర్ణమును గూర్చి వివరించిన పిదప
యేసందున = ఏస్థానమందు (పిండ, బ్రహ్మాండ, అధిష్టానము)
లేని ఎరుక = ఉన్న పరిపూర్ణమునందు లేక తోచుచున్న గుర్తైరిగే శరీరము
లేక = లేనిదై
జనవలె సుమీ = రద్దు కావలసినదే
అదె ఇది=అట్టి విలువలతో కూడిన ప్రయోజనకరమైన గ్రంథమే ఈ కందార్థ గ్రంథము
విని చదువు నమ్మీ = గురువాక్యానుసారముగా, వస్తునిశ్చయ పూర్వకముగా గ్రంథమందలి గూఢార్థమును గ్రహించుము

ఎందుకు నీకింక ఇతర శాస్త్రములజోలి =పైనచెప్పిన ఆరూఢత యందు మిగిలిన శాస్త్ర జ్ఞానమంతా అవసరంలేనిదని గుర్తించుము

అందు గుర్తుండి పోదు = శాస్త్రజ్ఞానము నందు చెప్పబడిన విషయ నిరూపణలో భ్రాంతి విస్తారమెగాని, భ్రాంతి రహిత విధానముండదు.

అదిగాన = అందుచేత

## తాత్పర్యము

జన్మ తరుణోపాయమునకు సర్వభ్రాంతి రాహిత్యము కలిగించు పరిపూర్ణబోధయే ఉత్తమమైన మార్గముగా చెప్పబడుచున్నది. సాంప్రదాయ బద్ధమైన గురువు ద్వారా వస్తునిశ్చయ పూర్వకముగా పరిపూర్ణమెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మానుటయే క్రమము. ఇట్టి విధానము ఈ కందార్థగ్రంథమునందు స్పష్టముగా చెప్పబడుచున్నది. కావున దీనిని సద్గ్రంథముగా చెప్పబడుచున్నది. గురుశిష్య న్యాయములో ఈ రచనను క్రమములో వినుటచేత కేవలత్వము కలిగిన అచల పరిపూర్ణ దర్శనము, దానియందు లేక తోచుచు సర్వభ్రాంతులకు మూలమై యున్న ఎరుక దృఢపడి చివరకు భ్రాంతి రహిత విధానముచే షోడశి వాక్యము ద్వారా బోధయందు ఆరూఢతగాంచ వచ్చును. కావున నామాటయందు, ఈ గ్రంథము యందు సంపూర్ణ విశ్వాసముంచి గురుముఖత: ఈగ్రంథమును శ్రవణముచేసిన పైన పేర్కొన్న ఆరూఢత సిద్ధించును. ఇట్టి విధానము కాక శాస్త్రాదుల పరిశీలన చేయదలచినచో భ్రాంతి విస్తారమగునేగాని భ్రాంతి రహిత విధానము తెలియ బడదు. యేలననగా శాస్త్రమందు గుర్తెరిగే తెలివిని బ్రహ్మముగా పేర్కొంటూ దానిని పొందుటయే మోక్షముగా నిర్ణయించి యున్నారు.

**కం॥ అలభద్రాచలమనినబ। యలుగాగుర్తెరుగవలయు యెరుక నువిష్ణుం।
దులదోచిగురునికృపచే। నిలువక విష్ణ్వేగిరి పోతె। నిశ్చాయమదెరా।
కృష్ణదాను। నిశ్చాయు మిదెరా। యిలమీదయెవరైన యీా
కందార్థములలోపలి గూడార్థము దెలియ। భ్రమనుజెందరువారు।
నిశ్చయమదెరా। కృష్ణదాసు। నిశ్చయమిదెరా॥ 174**

## ప్రతిపదార్థము

అల భద్రాచలము = భూమండలమందు భద్రమైన కదలని స్థితి
అనిన = పేర్కొనబడిన, చెప్పబడిన
బయలుగా గుర్తెరుగ వలయు = అచల పరిపూర్ణముగా గుర్తించుము
ఎరుకన్ = గుర్తెరిగే ఎరుక
విష్ణువు అందుల తోచి=విష్ణువు యొక్క అవతారమే రామభద్రుడుగా తోచబడెను.
గురుకృపచే = పరిపూర్ణ గురువుయొక్క అనుగ్రహముచే
నిలువక = ఉండుటకు స్థానము లేక
విష్ణ్వేగిరి పోతే = గుర్తెరిగే శరీరముగా వున్న రాముడు లేకపోతె
నిశ్చయ మదేరా = స్వత:సిద్ధమైన పరిపూర్ణ పరబ్రహ్మమే యుండును
కృష్ణదాసు నిశ్చయమదేరా = ఈ గ్రంధ రచయిత యగు కృష్ణదేశికేంద్రుల వారి ఆరూఢత కూడా ఇదియే
ఇల మీద = ఈభూమండలముపైన
ఎవరైనా = మానవోపాధికి చెందిన వారెవరైనా
ఈకందార్థముల లోపలి గూఢార్థముతెలియ = ఈ గ్రంధ రచనల యందలి సారవంతమైన భావమును దృఢపరచుకొన్నమీదట
భ్రమను చెందరు వారు = సర్వ భ్రాంతి రహిత స్థితి పొందగలరు

## తాత్పర్యము

భూమండలమందు భద్రుడు అనే భక్తుడు తన తపోబలముచే శ్రీమహా విష్ణువుని ధ్యానించి వారి అనుగ్రహముచే భద్రాచలము అను పేరున ఒక కదలని శిఖరముగా పేరు పొందెను. తదుపరి శ్రీమహావిష్ణువు తన భక్తునికోరికమేరకు స్వయంభువుగా, శ్రీరాముడుగా ఈ భద్రాచలమందు వెలసెను. ఇదియొక పుణ్యక్షేత్రముగా ప్రసిద్ధిచెందినది.

పరిపూర్ణ సిద్ధాంత రీత్యా సకలదేశములయందు, సర్వకాలముల యందు సమస్తమైన వస్తువులయందు చలించక తనకు తానుగా స్వత:సిద్ధమైయున్నది అచల పరిపూర్ణము. దీనియందు మూలముగాని, స్థానముగాని లేకనే తనకు తానుగా కలవలె స్వయంభువుగా గుర్తెరిగే శరీరము

తోచబడినది. ఈ కందార్థమందు పైనపేర్కొన్న పరిపూర్ణము భద్రాచలము గాను, దిగువన పేర్కొన్న ఎరుకను రాముడు గాను పేర్కొంటూ కదలిక లేక స్థిరమైన దానియందు కదలికతో కూడి వచ్చిపోయే లక్షణము కలిగిన ఎరుకను సూచిస్తూ పరిపూర్ణబోధచే పైఅంశములు దృఢపరచుకొని, స్థిరమైనది ఉన్నదని, అస్థిరమైనది లేదని దృఢపరచుకొన్నమీదట శేషించినది అచల పరిపూర్ణముగా నిల్చియుండును. అట్లని నిర్ణయించుటకు గుర్తులేకుండును. సద్గురు కృపచేత మాత్రమే ఇట్టి ఆరూఢత సాధ్యము. ఈగ్రంథ కర్తయగు భాగవత కృష్ణ దేశికేంద్రులవారి ఆరూఢత కూడా ఇట్టిదియే. ఈ భూమండలము నందు జనన మరణ భ్రాంతి రహిత విధానమును ఆశించువారు ఈ రచనను గురుముఖత: దృఢపరచుకొన్న మీదట ఇందలి మర్మ ధర్మములు ఆరూఢమై ఎట్టి భ్రాంతికి లోనుకారని తెలియ వలెను.

కం॥ ఒరులునేననకనిండిన। దెరిగింపుమదేమొబయలుయే
నొరులనుచున్। యెరుగునీవెవరుయీ। లేనెరుకను వున్నావు వుంటె।
యిదిలేనంచనుకో। నేనొనినునీ। మదినీలేననుకో యెరిగియీలే
నెరుకయిట్లలేకుండీతె। పరిపూర్ణమో। దాన్నేపగిదీ గుర్తెరిగేము।
యిదిలేనంచనుకో। నేనొనినునీ। మదిని లేననుకో॥ 175

## ప్రతిపదార్థము

ఒరులు = ఇతరులు

నేను = గుర్తెరిగే నేను

అనక = ఎట్టి గుర్తు లేక

నిండినది = సర్వత్రా తానై యున్నది

ఎరిగింపుమదేమొ = అది ఎటువంటిదో తెలియ పరచుము

బయలు = పరిపూర్ణము

యేనొరులనుచున్ = నేను, ఇతరము అనుచు

ఎరుగు నీవెవరు? = గుర్తించే నీవెవరు?

ఈ లేనెరుకను = ఈ గుర్తెరిగే శరీరాన్ని

వున్నావు = తెలియ బడుతున్నావు

వుంటె ఇది లేనంచునుకో = ఉన్నాగాని లేవని అనుకో

నేనో = గుర్తెరిగే నేను ఎవరు?

నిను నీమదిని లేననుకో = నీ మనస్సులో నీవు లేని వానిగా భావింపుము

ఎరిగి యీ లేనెరుక ఇట్లా లేకుండితే పరిపూర్ణమొ = పై విధముగా గుర్తెరిగే నేను లేను అనిదృఢపరచుకొన్న మీదట స్వత:సిద్ధమైన పరిపూర్ణము ఉండునా? లేదా?

దాన్నే పగిది గుర్తెరిగేము = ఉన్నదానిని లేనిది ఎట్లు గుర్తించ గల్గును

## తాత్పర్యము

30వ కందార్థమునకు ఈ కందార్థమునకు చాలా దగ్గర సంబంధమున్నది. ప్రారంభదశలో పరిపూర్ణగురువు వద్దకు శిష్యుడువచ్చి ఉపదేశ సారమును గ్రహించి అంతకు పూర్వము తనకున్న వేదాంత పరిజ్ఞానముతో ఉపదేశసారమందలి అంశములను అనగా పరిపూర్ణమును ఎరిగి లేని ఎరుకనెరిగి, ఎరుకను మాను అను క్రమములో సమన్వయము చేసుకుని, తనకు కల్గిన సందేహములను ప్రశ్నల రూపంలో అడుగగా గురువు క్లుప్తంగా సమాధాన పరచడం, సిద్ధాంత పద్ధతిని ప్రబోధించడం పై కందార్థమునందు చెప్పబడుచున్నది. ఇందు ప్రశ్నలు శిష్యునివి, సమాధానాలు గురునివి. తర్వాత బోధక్రమమునకు ఆరూఢతకు అవసరమైన " మదిలో గురుని మాట నమ్మి యుండుట, చంచలబుద్ధిమానుండుట, గురుర్వాక్యం యధాతధంగా పాటించుట " అను యోగ్యతతో సిద్ధాంతపద్ధతి యందలి బోధనాంశములగు పరిపూర్ణమెరుగుట, ఎరుక నెరుగుట, బయలు ఎరుకల అత్యంత విభిన్న తత్వము, బయలాకాశముల ఆరోపిత తాదాత్మ్యము, సృష్టి విధానము, ఎరుక విడిచే విధానము, మతనిరసన, ఎరుక పరిణామము, బయలు గుర్తెరుగునా, పరిపూర్ణబోధ అను శీర్షికలద్వారా ప్రబోధను దృఢపరుస్తూ, శిష్యునికి అంతకు పూర్వం గల్గిన సందేహములను

నివారిస్తూ బోధించుట జరిగినది. ఈ కందార్థము ద్వారా శిష్యుని యొక్క ఆరూఢతను పరీక్షింప తలచి ప్రశ్నలు గురునివిగా సమాధానాలు శిష్యునివిగా పేర్కొంటూ బోధయొక్క క్రమమును, విశిష్టతను, ఆరూఢ విధానమును, ఈ రచయిత మనకు చెప్పబూనుచున్నారు. ఒరులు నేననక నిండిన దెరిగింపుము. అదేమొ = అచల పరిపూర్ణ పరబ్రహ్మము యేనొరులనుచున్ ఎరుగు నీ వెవరు = లేనెరుకను వున్నావు = వుంటె ఇది లేనం చనుకో నేనో = నిను నీమదిని లేననుకో ఎరిగి = ఈ విధముగా దృఢపరచుకొన్నమీదట ఈ లేనెరుక ఇట్లా లేకుండితే పరిపూర్ణమొ దాన్నెపగిది గుర్తెరిగేము ఈ విధముగా శిష్యునిబోధచేత సమాధాన పరచబడెను. మౌలికముగా పరిపూర్ణము వున్నదని, ఎరుక లేనిదని దృఢపరచు కొన్న మీదట ఎరుక లేక పోవుట యందు శిష్యునికి కల సందేహముగుర్తును విడిపించుట ద్వారా అనగా లేనిది ఉన్నట్లు కన్పించుటె కాని ఎరుక యొక్క ఉనికి వాస్తవముగా లేనిదని సిద్ధాంతమందలి విశిష్టతను వివరిస్తు జనన మరణ రహిత విధానము భ్రాంతి రహిత విధానము ద్వారా మాత్రమె కలుగ గలదని ఇందు స్పష్టముగా చెప్పబడుచున్నది.

## (హితోప దేశము)

హిత + ఉపదేశము = హితోపదేశము. హితముఅనగా మంచి ఉపదేశము అనగా "చెప్పుట" వివరించుట, చూపించుట లేక లక్ష్య నిర్ధేశ్యము చేయుట లేక జీవిత విధానము అలవాటు పరచుట. దీనినే నీతి శాస్త్రముగా చెప్పబడుచున్నది. సమాజములో ఒక వ్యక్తిని గూర్చి మంచి కోరేవారు తల్లి తండ్రులు, స్నేహితులు, భార్య, గురువు వీరి సూచనలు, సలహాలుతప్పనిసరిగా గ్రహించి అమలు పరచవలసియున్నది. ఏలననగా పైన పేర్కొన్న వారి అందరి ఉపదేశములు వ్యక్తి శ్రేయస్సును కోరి యుండును. ఐతే తల్లితండ్రులు, స్నేహితులు భార్య వీరి ఉపదేశమందు ఏకించిత్తు అయినా లౌకిక ప్రయోజనము, స్వార్థపరత్వం కలిగి యుండును. గురూపదేశమునందు దానిని పాటించబడుట, పాటించబడక పోవుట అను

రెండంశముల యందు వ్యక్తి ప్రయోజనమే వుండును గాని, గురునికి ఎట్టి లబ్ధి ఉండజాలదు. సాంప్రదాయమునందు "గురు వాక్యము" యధా తధాగా జీవించ వలసి యున్నది. ఈ కందార్థ రచనలో పరిపూర్ణబోధ యొక్క గొప్ప తనాన్ని పేర్కొంటూ పదుగురు నినుజూచి భళి శభాష్ ఈ త్రోవకు ఎదురే లేదు ఇదిగో నేజేసెద అనేటట్లు శిష్యుని తీర్చి దిద్దుతాను అని గురువు చేత కృష్ణ దేశికేంద్రుల వారు ప్రతిజ్ఞచేసియున్నారు. రాజయోగి ధర్మము నందు భుక్తి ముక్తి అను రెండు ప్రక్రియలు ప్రముఖముగా చెప్పబడును. గురూపదిష్ట మార్గమునందు తాను గ్రహించిన భావమును జీవితంలో నడక ద్వారా ప్రవేశ పెట్టి అనుకూల ప్రతికూల సంఘటనలను ఎదుర్కొంటు సమత్వ బుద్ధి పూని తాను పొందిన భావమునకు అనువుగా ఆదర్శవంతమగు జీవితము గడప వలసి యున్నది. విన్న ప్రబోధకి అనువుగా జీవితంలో మార్పును కోరుకుంటూ, తన్ను తాను సరిదిద్దుకొంటూ బోధచే పేర్కొన బడిన స్థితియందు ఆరూఢత పొంద వలసి వున్నది. ఇట్టి అంశము లన్నియు ఈ శీర్షిక ద్వారా ఈ గ్రంధకర్త పలు దృష్టాంతముల ద్వారా అందించుచున్నారు.

కం॥ మానవుడుచేయబూనిన। దానినిలో తెరిగి చేయదగు నని
మదిలో। నేనెరిగినీకుజెప్పితి। పూనుమురుచిబుట్టదేని। పోనీ
నీమనసు। రుచిబుట్టితె। పూనూనీమనుసు। నేనేమి యనబోతె
నీకేమిదోచునో। లేనినిష్టూరాములేకుండుటేలెస్స పోనీనీ
మనసూ। రుచిబుట్టీతె। పూనూనీమనసు॥ 176

## ప్రతిపదార్థము

మానవుడు = మనస్సు అనే పదార్థము బాగుగా కలవాడు (వికసించిన వాడు) మను సంతతికి చెందినవాడు

చేయబూనిన దానిని = చేయవలసిన పనిని

లోతెరిగి చేయదగునని = పూర్వాపరములు, లాభనష్టములు, కష్టసుఖములు బాగుగా విచారించి చేయవలసియున్నది

అని = పైవిధముగా పేర్కొని
మదిలో నే నెరిగి నీకు చెప్పితి=అనుభవపూర్వకముగా నేను ఆలోచించి చెప్పుచున్నాను.
పూనుము = పాటించుము లేక అమలు పరచుము
రుచిపుట్టదేని = పాటించుటకు నీకు ఇష్టము కానిచో
పోనీ నీమనసు = నా మాటను విడిచి వేయుము
రుచిబుట్టితే = చేయాలనిపిస్తే
పూనూ నీమనసు = పాటించుము
నేనేమి యనబోతె నీకేమి దోచునో = నేను ఎంతస్పష్టముగా, అనుభవపూర్వకముగా చెప్పినాగాని నీమనస్సునకు ఏ విధముగా తోచునో లేని నిష్ఠూరము లేకుండుటె లెస్స = మంచిని చెపుతూ చెడుభావనను కలిగించుకొనుట ఎందులకు?

## తాత్పర్యము

మనస్సు అనే పదార్థము విశేషముగా కలవాడు మానవుడు. ఇది వ్యక్తిగతము గాను, ఆత్మ గతము అను రెండు రీతులుగా వ్యవహరించుచుండును. వ్యక్తిగతమైనది స్వార్థముతో కూడి తాత్కాలిక ప్రయోజనం ఆశించి యుండును. విశేషమైనది ఆత్మ సంబంధమైనదిగా యుండి (బుద్ధి) శాశ్వత ప్రయోజనము కొరకు కావలసిన ఆలోచనలు మన ముందుంచును. ఈ విధానము ఒక్క మానవోపాధియందు మాత్రమే ఏర్పరచబడినది. కోశములలో దీనిని విజ్ఞానమయ కోశముగా చెప్పబడు చున్నది.కావున జ్ఞానేంద్రియములద్వారా పంచతన్మాత్రలను గుర్తించి వాటి అంశములను అనగా విషయములను అంత:కరణ చతుష్టయమునకు (మనో బుద్ధి చిత్త అహంకారములు) నివేదించి కార్యసాఫల్యమునకు కర్మేంద్రియముల ద్వారా కర్మ యొనర్చుట మానవ లక్షణమై యున్నది. కావున కార్య సాధకుడు ఈశ్వర నిర్ణయ మందుగల పైవిధానమును పాటించి కార్య సాఫల్యత పొందవలసి యున్నది. అనిపించగానే చేసే లక్షణము పశు లక్షణము. ఇట్టి ఆలోచనా విధానము స్వతహా ఎవరికి లేనిఎడల

తనశ్రేయస్సును కోరే వారు అనగా జన్మ నిచ్చిన తల్లి తండ్రులు, తన హితము కోరే స్నేహితులు, చతుర్విధ ఫల పురుషార్థములు సాధించుటలో సహాయ కారిగా వుండు సహధర్మచారిణి (ధర్మపత్ని, అర్ధాంగి) భుక్తి, ముక్తి క్రియల యందు సమగ్రమైన అవగాహన కలిగించి జన్మరాహిత్యముతో పాటుగా, ఋణరాహిత్యమును కూడా కలిగించగలుగు సమర్థత కలిగిన పరిపూర్ణగురువు వీరిద్వారా విషయ గ్రహణ యందు తనకు కలిగిన సంవేదనమును ఆలోచనరూపంగా పైవారినుండి స్వీకరించి పాటించుట ఉత్తమమైన మానవోపాధి లక్షణము. పరిపూర్ణగురువు తప్ప తన శ్రేయస్సు కోరి సలహాలు ఇచ్చేవారి యందు ఏ కించత్ ప్రయోజనము వారు ఆశించి వుండ వచ్చును. పరిపూర్ణ బోధయందు ఆరూఢుడైన ఆచార్యుడు ఎట్టి ప్రయోజనమును శిష్యుని నుండి ఆశించక ఇహపర సాధనయందు లోక కల్యాణమున పాటించ వలసిన విధి విధానమును శిష్యునికి నిర్దేశించును. ఇక్కడ గురు వాక్యము యధా తధాగా శిష్యుడు పాటించవలసి యున్నది. " పదుగురు నిన్ను చూచి భళి శభాష్ ఈ త్రోవకు ఎదురులేదనుచు ఇదిగో నేను చేసెద " అనుమాట వాస్తవ రూపముగా జీవిత విధానములో ప్రవేశపెట్టి నడక నేర్ప కలుగను. ఇట్టి విధానము నందు శిష్యునికి కొన్ని ఇష్టమైనవి, కష్టమైనవి కూడా ఉండ వచ్చును. ఈ కందార్థమునందు శిష్యుని మనస్సును దృష్టిలో వుంచుకొని గురూపదేశము గావింపబడు చున్నది. విషయ సంబంధమైన మనస్సు స్వార్థ పరమైనది కావున ఇది గురువాక్యమును శంకించును. విషయ రాహిత్యమై, జనన మరణ రాహిత్యమునకు అనువుగా యున్న మనస్సు యధా తధముగా స్వీకరించి పాటించును. శాస్త్రమునందు ఈ అంశము ప్రముఖముగా చెప్పబడు చున్నది.

1. సత్యంబ్రూయాత్ = సత్యమునే చెప్పుము
2. సత్యం ప్రియం బ్రూయాత్ = సత్యమై ప్రియమైయున్నవి మాత్రమే చెప్పుము
3. నబ్రూయాత్ సత్యం అప్రియం = సత్యమైనదయిన, ప్రియమైనదయిన ఇష్టంకానిచో చెప్పవద్దు

పై క్రమములో కార్య సాధనకు యుండవలసిన యోగ్యతను, అధికారాన్ని ఈ కందార్థములో పేర్కొంటు నిద్రాణంలో వున్న మానసిక శక్తిని జాగృత పరచుకొని, ఆనంద దాయకంగా జీవించ గలుగు విధానమునకు గురుప్రబోధ ఎట్లు సహాయ భూతముగా యుండునది ఈ కందార్థము ద్వారా చెప్పబడుచున్నది.

**కం॥ హరికర నఖముఖవిదళిత। కరిమస్తకగళితమైన ఘన మౌక్తికముల్।**
**దొరికిన నెరుకలుగురిజలె। ధరియింతురు రెంటి విలువ।**
**తమరెరుగకనెకా। అట్లనెబోధ। క్రమ మెరుగక నెకా। పరిపూర్ణ**
**బోధానుయెరిగింపుచుండీన। యెరుకాకె। కొందారు మరిగేరీ**
**మార్గము। తమరెరుగకనెకా। అట్లనెబోధ। క్రమమెరుగకనెకా॥ 177**

## ప్రతిపదార్థము

హరి =సింహము
కర = చేతులు
నఖ = గోళ్ళు
ముఖవిదళిత =నోటినుండి జారిపడిన లేక విసర్జింపబడిన
కరి =ఏనుగు
మస్తకగళితమైన = నెదడు నందు పేరుకున్న
ఘన మౌక్తికముల్ = విలువైన ముత్యములు
దొరికిన = వారికి సంక్రమించిన
ఎరుకలు = ఆటవికులు
గురిజలెధరియింతురు = గురివి గింజలనే ఆభరణములుగా ధరియిస్తారు
రెంటి విలువ తమరెరుగకనేకా = పరిపూర్ణబోధయొక్క నిర్మిత విధానము క్రమపద్ధతిలో తెలియక పోవటంచేత
పరిపూర్ణ బోధను ఎరిగింపుచుండిన = జనన మరణ రహితమునకు సర్వభ్రాంతి రహిత స్థితిని కలిగించు పరిపూర్ణ బోధ ఉపదేశించగా
ఎరుకకే కొందరు మరిగేరు = భ్రాంతి కారకములైన వివిధ సాధనల యందే గడిపేవారు

ఈ మార్గము తమరెరుగకనేకా = ఈ పరిపూర్ణబోధయందు క్రమపద్ధతి వారు గుర్తించక పోవడం వల్లనే కదా!

## తాత్పర్యము

బాగా మదించిన ఏనుగు యొక్క కుంభస్థలమును తన వాడిఅయిన గోళ్ళతో సింహము వేటాడి చీల్చి వేడి వేడి నెత్తురును తాగి మిగిలిన మాంసపు ఖండములను చెల్లా చెదరు చేయును. ఆ మాంసపు ఖండములు మట్టిలో కలిసి వాటి సహజత్వమైన ప్రకాశమును కోల్పోవును. అడవిలో తిరుగాడు చెంచులు ఆ మాంసపుఖండములను ఏరి శుభ్రపరచి వాటిని వారి ఆహార సముపార్జనమునకు కావలసిన ద్రవ్యములను కొనుగోలు చేయుటకు అమ్ము కొనెదరు. వాటినే మౌక్తికములు అను పేర పిలువ బడుచున్నవి. అడవిలో ఎరుపు, నలుపు కలిగి వింత గొలిపె గురి గింజలు ఆభరణములుగా ధరిస్తారు. రెండింటి విలువ వారికి తెలియక పోవుట చేతనే పై విధముగా ప్రవర్తిస్తున్నారు. ఆవిధము గానే పరిపూర్ణబోధ యందలి క్రమపద్ధతిని, నిర్మిత విధానాన్ని సాంప్రదాయక పద్ధతిగా గురుముఖత: దృఢ పరచుకొని, ఆరూఢ పరచుకోజాలని అల్పబోధ పరాయణులు, సర్వభ్రాంతి స్థితి కలిగించు పరిపూర్ణ బోధయందు ప్రవేశించిన భ్రాంతి కారకములగు ఎరుక సాధనల యందే లక్ష్యముంచి కృషి చేస్తారు. ఈ బోధ యొక్క విలువ తెలియని వారు కనుకనే ఈ విధముగా వ్యవహరిస్తున్నారని ఈ కందార్థము నందు పేర్కొనబడు చున్నది.

## గురుకృప

పరిపూర్ణ సిద్ధాంతము సూత్రప్రాయంగా అనువదించుటలో పరిపూర్ణమును, లేని ఎరుకను ఎరిగి ఎరుకను మాను అనుటయే. ఇందు "ఎరిగి" అను శబ్దము చాలా విశిష్టమైనది. శాస్త్రము చెప్పలేనిది ఒక గురువు మాత్రమే చెప్పే అంశము ఇదే. (స్థాన, స్వరూప, స్వభావములతో) గుర్తింప గలుగుటయే ఎరుగుట అను శబ్దమునకు విశేషార్థము. గురుముఖత: అనుగ్రహ విశేషముచేగాని ఇది సాధ్యపడదు. కావున గురుకృప పొందుట

అత్యంత అవసరమై యున్నది. వస్తు నిశ్చయ జ్ఞానమందు బుద్ధి నిశ్చయము, ఆత్మ నిశ్చయము అను రెండు విధములు కలవు.

**1)బుద్ధి నిశ్చయము:-** గురుముఖత: తాను విన్న అంశములు గ్రహింపగల్గుట, అర్థము చేసుకొనుట, తిరిగి చెప్పగల్గుట.

**2)ఆత్మ నిశ్చయము:-** గ్రహింపబడిన వస్తువు నందు మనస్సును వ్యాపకమొనర్చి, అట్టి వస్తువునకు తాను వేరుగా లేనని దృఢమైన భావము కలిగి యుండుట. ఇంద్రియ జ్ఞానము నందు కూడా ఆ వస్తువు భావమును కలిగించుకొని లోపల, బయట అనుభేధము లేక అఖండాత్మ దృష్టి కలిగి వుండుట. దీనికే పూర్ణ దృష్టిగా చెప్పబడును. సిద్ధాంత రీత్యా పరిపూర్ణము ఎరగాలన్నా, ఎరుకను విడవాలన్నా తాను ముందుగా అఖండాత్మ స్వరూపుడై నిల్వ వలసి వున్నది. శాస్త్ర కృప,(వేద కృప), ఆత్మకృప, దైవకృప అని మూడు తరగతులుగా చెప్పబడుచున్నది. మానవుని శరీరక, మానసిక ఆత్మ శక్తులు ఎంత గొప్పవైయున్నా ఈగురుకృప తోడు లేనిదె పూర్ణ ఫలము సిద్ధించదు. ఇందు రెండు తరగతులు కలవు. 1 మంత్రోపద్రష్ట అయిన గురుకృప = ఇతనివల్ల బోధ యందు శ్రవణ, మనన, నిధి ధ్యాసలు కలిగి బోధయందు గట్టి తనము. విని చెప్పగలిగే సామర్థ్యము సిద్ధింపగలదు, ఇది తన ప్రవర్తనచే సాధింపవచ్చును.

**2) ఈశ్వర కృప:-** ఉపదేశ పద్ధతి యందు నిర్దేశింపబడిన అనుష్టాన పద్ధతిచే మాత్రమే ఇది సిద్ధించును. గురూపాసన సర్వదేవోపాసన. గురుతత్వం యొక్క ప్రభావము స్వరూప నిర్ణయము మంత్రమందు నిక్షిప్తమై వుండును. మంత్ర శాస్త్రము ప్రకారము ఇట్టి విధానము పాటించుట చేత మంత్రాధిష్టాన దేవతా అనుగ్రహప్రభావముచే ఇట్టి అఖండాత్మ దృష్టి కలుగును. కృప అనగా అనుగ్రహము. అనుగ్రహమపగా తిరిగి స్వీకరించుట. ఈ పద్ధతిచే పరిపూర్ణ బోధయందు వ్యక్తి నిష్టగానున్న తన జ్ఞానము తత్వాదృష్టి కలిగిన అఖండాత్మజ్ఞానముగా

మారవలెను. బ్రహ్మ విద్యకు ఏకాగ్రత పరిశుద్ధాంత:కరణ అత్యంత ఆవశ్యకమై ఉన్నవి. ఇవన్నియు ఉపాసన పద్ధతి యందు నిర్ధేశింపబడినవి. అనుష్టాన ప్రక్రియయే సిద్ధింపబడవలెను. అందుచే ఉపదేశ గురువు బోధనాక్రమముతో సరిపెట్టక అనుష్టాన పద్ధతిని పాటింపజేసి శిష్యునికీ సామర్ధ్యము కలిగించును. బ్రహ్మ విద్యోపాసనయందు ఆరూఢత కలుగు వరకు గురుశిష్యులిద్దరూ ఒకే స్థానమందు నివసిచియుండుట చాలా అవసరము. దీనినే స్థాన శు శ్రూషగా చెప్పబడుచున్నవి. ఇట్టి అవసరంవున్నా, ప్రయోజనంవున్నా నేటికాలంలో ఈ అంశము అందరికీ సాధ్యపడుటలేదు. ఇట్టి పరిస్థితి యందు అనుష్టాన ప్రక్రియచే గురువు అనుగ్రహప్రాప్తిని కలిగింపచేసి పరిపూర్ణ బోధకు కావల్సిన యోగ్యతను, పాత్రతను, సామర్ధ్యాన్ని కలిగించవలసి యున్నది. మంత్ర దీక్షయందుగల రహస్యమిదే. సాంప్రదాయమునందు బ్రహ్మైవాహమస్మి అను ఫలసిద్ధికి గురుగీతా ధర్మమునందు చెప్పబడిన గురుమాలామంత్రోపదేశము, అహంపదార్ధరహిత: అనులక్ష్యమునకు ద్వాదశి, షోడశి వాక్యములను ఉపదేశ కాలమందు శిష్యునికి ఉపదేశించుట ఒక ఆచారముగా నిర్ధేశింపబడుచున్నది. ఏప్రక్రియకా ప్రక్రియలు పాటింపజేస్తూ సమగ్రమైన జ్ఞానాన్ని ఆరూఢపరుస్తూ ఉండుట వరశిష్య లక్షణమై వున్నది. ఇట్టి సమగ్రమైన కృషి చేతనే పరిపూర్ణ బోధయందు ఆరూఢత చెందుటకు వీలగును. ఇట్టి గురుకృప ఎట్లు సిద్ధించును? మంత్రము, మంత్రార్థము, మంత్రరహస్యముల ద్వారా శిష్యునికి ప్రబోధించు విధానము రహస్యమై సాంద్రాయబద్ధమై వున్నది.

కం॥ ప్రొద్దున నిద్దురమేల్కని। వద్దికియేతెంచిగురుని వక్త్రజనితమౌ।
సుద్దులు మ్రొక్కి వినుముయే। ప్రొద్దిదిబహు ముద్దుసుమ్మి।
పుట్టినందులకూ। గురుచరణాము। పట్టినందు లకూ। నిద్దామౌభక్తీ
చెసీవిట్లు జేసీతె దిద్దీతీరిచిబోధ తెరువూ జూవునునీవు।
పుట్టినందులకూ। గురుచరణాము। పట్టినందులకూ॥ 178

## ప్రతిపదార్థము

ప్రొద్దున నిదుదర మేల్కొని = సూర్యోదయానికి పూర్వమె నిద్రావస్త నుండి జాగ్రదావస్థ లోకి ప్రవేశించి
వద్దకి ఏతెంచి = అతి దగ్గరగా సమీపించి
గురుని వక్త్రజనితమౌ = గురుని నోటినుండి వెలువడే
సుద్దులు = ప్రబోధకు సంబంధించిన అంశములు
మ్రొక్కి = నమస్కరించి
వినుము = గ్రహించుము
యేప్రొద్దు = త్రికాలముల యందు (ఉదయం, మధ్యాహ్నాం, సాయంత్రం)
ఇది బహు ముద్దుసుమీ = ఈ విధానము అత్యంత యోగ్యమైనది సుమా
పుట్టినందులకు=84 లక్షల జీవరాసులలో ఉన్నతమైన మానవోపాధి వచ్చినందుకు
గురు చరణము పట్టినందులకు = పూర్వజన్మ పుణ్య వశముచే జన్మ రహిత విధానమునకు పరిపూర్ణగురువును ఆశ్రయించి నందులకు
నిద్దామౌ భక్తిచే = అనన్యమైన ఎడతెగని ప్రవాహ రూపకమైన భక్తిచే
నీవిట్లు జేసితె = ఈ విధముగా నీవు పాటిస్తే
దిద్ది= బోధ యందు నీకు కలిగిన భావములు సవరించి
తీర్చి = అందులో నీకు కలిగిన సందేహములు
బోధ తెరవు జూపును = పరిపూర్ణ బోధ యందలి మార్గమును ఆరూఢతను సిద్ధింప జేయును

## తాత్పర్యము

ఈ కందార్థమందు స్థాన శుశ్రూష యొక్క విధానమును, ప్రభావమును ప్రముఖముగా చెప్పబడుచున్నది. పరిపూర్ణబోధ యందు ఆరూఢత చెందవలెనన్నచో గురుశిష్యులిద్దరూ ఒకే స్థానమునందు కొంత కాలమైనా జీవించవలసి వున్నది. శిష్యునికి తాను నేర్వ వలసిన బోధకు అనువుగా మనసు యొక్క స్థితి గతులు అంచనా వేసుకుని లోపములు సరిదిద్ది బోధయందు ఆరూఢత చెందుటకు వీలుగా తన వంతు సహకారము గురువు శిష్యునికి చేకూర్చగలుగుటకు వీలగును. నిత్యము గురుసేవా శు

శ్రూషలతో ప్రబోధ వినగల్గుట శిష్యుని కర్తవ్యమై యున్నది. గురు సందర్శనము, ప్రబోధ వినుటకు ముందుగా నమస్కారముతోప్రారంభము కావలసి వున్నది. అహంకార అభిమానములు విడచి, వినయ విధేయతలు కలిగించు కొనుటయే ఈ నమస్కారము యొక్క ప్రయోజనము. ఈ విధానములో ఈ కందార్థము నందు శిష్యుడు పాటించవలసిన విధానము గురు ప్రబోధ యందలి సామర్థ్యము అను రెండంశములు స్పష్టముగా చెప్పబడుచున్నవి. తన నమస్కార విధానముచే శిష్యుడు గురువుని ప్రసన్నుని గావించుకొని తనవైపు, తన గురించి ఆలోచింప చేసేలా చేసుకుని తద్వారా తాను బోధయందు క్రమ విధానము వినిఅందు కలిగిన సందేహములు నివారించుకొని బోధస్థితి యందు అరూఢత చెందవలె నన్నచో గురు ప్రబోధ అత్యంత అవశ్యమై వున్నది. పదేపదే విన్నగాని, ఈస్థితి ఆరూఢమగుట దుర్లభము. కావున త్రికాలముల యందు గురుసాక్షాత్పరబ్రహ్మ అను భావనతో అనన్య చింతన కలిగి ఎడతెగని ప్రవాహ రూపకమైన అత్యంత భక్తి విశ్వాసములతో గురుని సేవించి తద్వారా గురుకృపను సిద్ధింప చేసుకొని, బోధయందు ఆరూఢత చెంద గలుగు విధానము ఈ కందార్థము ద్వారా సూచింప బడుచున్నది. ఈ విధానము అత్యంత దుర్లభమైన మానవోపాధికి వచ్చి, అంతే కాక జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు పరిపూర్ణ గురుమూర్తియొక్కపాదము లాశ్రయించి నందులకు బోధ దృఢీకరణ కొరకు పాటించవలసిన అత్యంత ముఖ్యమైన అంశముగా పేర్కొనబడుచున్నది. ఈ విధానముద్వారా గురుడు ప్రసన్నుడై పరిపూర్ణబోధ యందుగల బోధనా విధానము, సందేహనివారణ స్థితి ద్వారా ఆరూఢత చెందుట అను అంశముల యందు గట్టితనము గల్గించునని భావము.

పైభావము గురుశిష్యులిరువురు ఒకచోట వున్నపుడు మాత్రమే సిద్ధింప గలుగను. వేరు వేరు చోట్ల వున్నపుడు ఈ విధానము పాటించుటెట్లు? ఈ అర్థమును లక్ష్యార్థముచే మాత్రమె గ్రహింప వీలగును. ఉపదేశ

కాలమందు గురువు తనకు ప్రతిరూపముగా, పరంపరానుగతంగా సంక్రమించు మంత్ర దీక్షను శిష్యునికుపదేశించి మంత్ర, మంత్రార్థ, మంత్ర రహస్యములనుపదేశించి గురు స్వరూపము యొక్క వాస్తవికతను వస్తు నిశ్చయ పూర్వకముగా స్థాన, స్వరూప, స్వభావము లతో దృఢపరచి గురుశిష్య శబ్దములు ఒక తత్వములుగా ఎట్లు ప్రకాశించు చున్నది బోధించి, అందలి సాధనా పద్ధతిని ఉపదేశ క్రియద్వారా బోధించును. ఇది అత్యంత రహస్యము, సాంప్రదాయ పద్ధతి యందలి గురు శిష్య న్యాయముగా మాత్రమే దీనిని తెలియ వలసి వున్నది. వాచ్యార్థ, లక్ష్యార్థముల ద్వారా ఈ కందార్థమందలి భావమును గ్రహించి, వ్యక్తులుగా వున్నపుడు పాటించు విధానము, తత్వములుగా వున్నపుడు పాటించు విధానము స్పష్టముగా గ్రహించేలా చేయును. తద్వారా అనుష్టాన విధానము, ప్రయోజనము, ఫలసిద్ధి పరోక్షముగా ఈ కందార్థము నందు సూచింపబడుచున్నది.

కం॥ నామాటలెస్సవినుమా। సామాన్యంబనుచు జూడజనదీ బోధన్।
ప్రేమాతిశయంబుననగని। వేమారిది గురుని నోట।
వినవలెనుమీ్మ। నిత్యముజదువు కొనవాలె నమీ్మ। నామారూప
క్రియనటనలుగలిగీన దేమివస్తువౌదాన్ని। యెటునిల్వ నివ్వాదు।
వినవాలెనుమీ్మ। నిత్యముజదువు। కొనవాలెనమీ్మ॥ 179

## ప్రతిపదార్థము

నామాట = నేను ప్రబోధించు విధానము, అందు గల అంశములు

లెస్స వినుమా = స్పష్టముగా, ఎట్టి సందేహమునకు లోనుకాకుండా, ఉన్నది ఉన్నట్లుగా, విన్నది విన్నట్లుగా

సామాన్యంబనుచు చూడజనదీ బోధన్=సర్వసామాన్యమైన విషయావరణతో కూడిన మాటలుగా భావించకుము

ప్రేమాతి శయమున = అత్యంత భక్తిశ్రద్ధలతో

ఇది = ఈపరిపూర్ణ భావమును

వేమారు = అనేక పర్యాయములు, బాగాదృఢమయ్యేదాకా

గురునినోట వినవలెసుమీ=తనకుపదేశం చేసిన గురుముఖత: మాత్రమే వినవలెసుమీ

నిత్యము = ఎల్లప్పుడూ

చదువుకొనవలెనమ్మీ =అత్యంత విశ్వాసముతో విన్నది విన్నట్లుగా మననము చేసుకొనవలెను

నామరూప క్రియనటనలు కల్గిన దేమి వస్తువా=సమస్త సృష్టికి అత్యంత మూల కారణమై శబ్దాది పంచతన్మాత్రలకు మూలమై వున్నవస్తువు (ఎరుక)

దాన్ని = అట్టి వస్తువును

ఎటు నిల్వనివ్వదు = ఏ స్థానమునందు మూలముగాని, స్థానముగాని లేనిదని, దాని ఉనికి పరిపూర్ణమునందు లేనిదని దృఢపరచబడును.

## తాత్పర్యము

జన్మ రహిత విధానమునకు అత్యంత చేరువైన మార్గము అచల పరిపూర్ణ ప్రబోధ. దీనిని అత్యంత భక్తి శ్రద్ధలతో గురూపదిష్ట మార్గము నందు ఎట్టి నిర్లక్ష్యము లేక వస్తు నిశ్చయ పూర్వకముగా పదే పదే దృఢ పడే పర్యంతము విని, మననము చేయుచు ప్రతి నిత్యము పాటించ వలసిన విధానము కలది ఈ బోధ. దీని వలన అచల పరిపూర్ణ భావము స్వత:సిద్ధమై సర్వభ్రాంతులకు, జన్మ కర్మలకు మూలముగానున్న గుర్తెరిగే శరీరము ఏస్థానము నందు లేనిదని దృఢపరచగల్గిన బోధనా విధానము కలదని తెలియుము.

**కం॥ అన్నముదిన్నను ఆకలి। తిన్నగనీరంబుద్రావతృష్ణయు రోగం।**
**బెన్నగనౌషధసేవను। జన్మక్రియంన్ యెంరుకనిల్వ।**
**జాలదోయన్నా। యీబోధ। నీచెవులాతొ విన్నా। కన్నూలతో జూచి**
**కడ ముట్టజదివీన। నిన్నెన్నటికీ యెదుట నిలచుండి కనుగొన।**
**జాలదోయన్నా। యీబోధనీ। చెవులాతొవిన్నా॥ 180**

## ప్రతిపదార్థము

అన్నా = నాయనా

అన్నము తిన్నను ఆకలి=ఆకలి లక్షణము అన్నము తినడము అనుప్రక్రియ ద్వారా తొలగును

తిన్నగ = ఈ విధంగా
తృష్ణ = దాహము
నీరంబుత్రావ = మంచినీరు సేవించుట చేత
ఎన్నగా = విచారించగా
రోగం = స్థూల శరీర సంబధమైన వ్యాదులు
ఔషధ సేవ = రోగ నివారణ కొరకు ఉపయోగించే మందు
జన్న క్రియన్=పైన పేర్కొన్న లక్షణములు క్రియల ద్వారా ఎటుల నివారింపబడుచున్నవో
ఎరుక = జన్మ కర్మలకు అత్యంత మూలకారణమైన గుర్తెరిగే శరీరము
ఈ బోధను = పరిపూర్ణ బోధను
నీ చెవులతో విన్న = వస్తు నిశ్చయ పూర్వకముగా గురుముఖతా ఏకాగ్రమైన మనస్సుతో విన్నచో
నిల్వబోదు = మూలంగాని స్థానంగాని లేకుండా పోవును
కన్నులతో చూచి = గురుముఖత: బోధనువిని దృఢపరచుకొన్నమీదట
కడముట్ట చదివీన = చివరిదాకా అనగా పరిపూర్ణము ఎరిగి ఎరుక నెరిగి ఎరుకను మాను అన్నక్రమంలో
నిన్ను = గుర్తెరిగే ఎరుక స్వరూపుడవైన నిన్ను
ఎన్నటికి = ఎప్పటికి
ఎదుట నిలుచుండి = స్వత: సిద్ధమైన పరిపూర్ణము నందు తాను నిలుచుటకు తనకు మూలము గాని స్థానము గాని లేదని దృఢపరచు కొని
కనుగొన జాలదు = ఏ నిర్ణయము చేయని స్థితి కలుగ గలదు

## తాత్పర్యము

నాయనా! అన్నము తినుటచేత ఆకలి, మంచినీరు త్రాగుట చేత దాహము ఔషదము సేవించుటచేత అనారోగ్యము అనులక్షణములు ఎట్లునివారింపబడు చున్నవో అట్లే జన్మకర్మలకు అత్యంత మూలకారణ మగు మూలము లేని గుర్తెరిగే శరీరము స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు

తనకు మూలముగాని స్థానముగాని లేదని గురువాక్యము ద్వారా దృఢపరచుకొని (షోడశి వాక్యము) ద్వారా గుర్తుని విడచి వుండిన జనన మరణ భ్రాంతి తొలగునని తెలియ వలెను.

**కం॥ జననమరణ ప్రవాహము। నణచును యీబోధ పట్టుడని సాధువులిచ్చిన। నొల్లకుండి వారలు। జనినపుడా బోధ మీద। జనియించి ప్రేమా। వెదకెదరట్టి। జనచేష్టలేమాయని తోచి నీకు నేవినజెప్పవలసె। నీవును యీబోధను వల్లననకు దొరకదు మళ్లి। జనియించి ప్రేమా। వెదకెదరట్టి। జనచేష్టలేమా॥181**

## ప్రతిపదార్థము

జనన మరణ ప్రవాహము = పుట్టుట, చచ్చుట తిరిగి మరల పుట్టుట అను లక్షణములు కలిగిన ఎరుక

అణచును = లేకుండా చేయును

ఈ బోధ = ఇట్టి పరిపూర్ణబోధ

పట్టుడని = విని దృఢపరచుకొనండని

సాధువు లిచ్చిన = పరిపూర్ణబోధయందు ఆరూఢత కలిగి ప్రచారము చేయు గురువు ఉపదేశించగా

ఒల్లకుండి = స్వీకరించక, వినక

వారలు జనినపుడు = అట్టి మహాత్ములు బ్రహ్మైక్యము చెందిన తరువాత

ఆబోధ మీద = వారు ఉపదేశించు పరిపూర్ణ భావము మీద

జనియించె ప్రేమ = కావాలనే ఆసక్తి కలిగి

వెదకెదరు = అట్టి భావము నుపదేశించు గురువుల దర్శనం కోసం ప్రయత్నిస్తారు

జనచేష్టలేమా=ఇట్టి విచిత్రమైన ప్రవర్తనతో కూడిన జీవిత విధానం చూచి

తోచి = బాగా మనసున విచారించి

నీకు నేవిన జెప్ప వలసె = ఇంతస్పష్టముగా నేను వివరించి చెప్పుటలో ఉద్దేశ్యమిదె

నీవును ఈ బోధను వల్లననకు = నా అభిప్రాయమును గ్రహించి నీవు ఈ బోధ వినుటయందు ఎట్టినిర్లక్ష్యము చేయకు
దొరకదు మళ్ళి = నీకు కావలసివచ్చినపుడు అందుబాటులోకిరాదు

## తాత్పర్యము

పరిపూర్ణ బోధ జనన మరణ ప్రవాహమును ఇంకింపచేయ గల సామర్థ్యము గల జన్మ తరుణోపాయము, మానవ జన్మయొక్క ముఖ్యోద్ధేశ్యము జనన మరణ భ్రాంతి రహిత విధానమె. ఇట్టి అపూర్వమైన, అరుదైన భావమును సాంప్రదాయ పద్ధతియందు గల గురు శిష్యన్యాయముచే తాము దృఢపరచుకొని గురువాజ్ఞానుసారముగా లోకకల్యాణము కొరకు ప్రచారము చేయుటకు ఒక బాధ్యతగా స్వీకరించి ఉపదేశించు గురువులు ఎన్నివిధములుగా చెప్పినా వారు జీవించి ఉండగా దానియందు నిర్లక్ష్యం వహించి, వారు బ్రహ్మైండైక్యం చెందిన పిదప ఈ బోధయొక్క విలువను, అవసరాన్ని గుర్తించి ఎవరు చెప్తారు? ఎలా వస్తుంది? అను లక్షణములను కలిగిన జనులను చూసి నామనస్సులో వారి దురదృష్టమును, అయోగ్యతను గుర్తించి నీకు (శిష్యుని) అట్టి దురదృష్టము కలుగ కుండా జాగ్రత్త పడుటకు ఈ బోధ యొక్క విలువలు, అవసరం, ప్రయోజనము గూర్చి పదే పదే చెప్పబడుచున్నది. ఎట్టి నిర్లక్ష్యము, అలసత్వము లేక అవకాశం సద్వినియోగము చేసుకొని దీని అవసరం, ప్రయోజనం ఇపుడు లేకపోయినా భవిష్యత్తులో చెప్పేవారు అందుబాటులో వుండరని, ఇపుడే దీనిని గ్రహించి నిల్వ వుంచుకో వలసిన అవసరమున్నదని గ్రహించుము.

కం॥ చక్కెర మెక్కకలోకులు। చక్కెర మాధుర్య మెరుగ। జాల
రటువలెన్। మక్కువతోవినిచదువక। చక్కగ గ్రంథార్థ మెరుగ।
జాలేరజనులూ। కావున నీవు। చాలించి పనులూ। చొక్కామీ
గ్రంథాముచూడూమి కొనవేళ్ళ। యిక్కాడితో జన్మ మెత్తావుసరి।
తెలియజాలేరజనులూ। కావున నీవు చాలించి పనులూ॥ 182

## ప్రతిపదార్థము

చక్కెర = మధుర రసము కలిగిన శ్రేష్టమైన తీపి పదార్థము

మెక్కక = తినక

లోకులు = మానవోపాధికి చెందినవారు

చక్కెర మాధుర్యమెరుగ జాలరు = వినుట చేతగాని, చదువుట చేతగాని, చూచుట చేతగాని పైనపేర్కొన్న మాధుర్యము ననుభవింప జాలరు

అటువలెనె = అవిధంగానే

మక్కువతో = ప్రేమతో కూడిన శ్రద్ధతో

విని = ఇతరులు చెప్పగా వినిగాని

చదవక = స్వయముగా గ్రంథమును పరిశోధించుట గాని చేయక

చక్కగా = ఉన్నదున్నట్లుగా

గ్రంధార్థము = ఈకందార్థము నందు చెప్పబడిన పరిపూర్ణభావము

ఎరుగ జాలేర = వస్తునిశ్చయపూర్వకముగా ఉన్నదున్నట్లుగా గ్రహించలేరు

జనులు = జనన మరణ ప్రవాహమునకు లోనైనవారు

కావున = అందుచేత

నీవు = ఇంతవరకు ఆసక్తి చూపగలుగుచున్న శిష్యుడవైన నీవు

చాలించి పనులు = ఇతరమైన ప్రయత్నములన్ని వదిలిపెట్టి

చొక్కామీ గ్రంధము = శ్రేష్టమైనటువంటి ఈ కందార్థ గ్రంధము

చూడుమీ = విచారించి తెలుసుకొనుము

కొనవేళ్ళ = చిట్టచివరిదాకా

ఇక్కడితో జన్మమెత్తవు సరి = క్రమపద్ధతిలో వస్తునిశ్చయ పూర్వకముగా ఉన్నదున్నట్లుగా దృఢపరచుకొని సర్వభ్రాంతి రహితము ద్వారా జనన మరణ భ్రాంతి రహితము పొందగలవు

## తాత్పర్యము

ఈ ప్రపంచంలో మానవులు అత్యంత మధురమైన తీపి పదార్థమును స్వయముగా జిహ్వేంద్రియము ద్వారాతిని, అనుభవములోకి

తెచ్చుకొన్నట్లుగా కాక, అట్టి మధురపదార్థమునుగూర్చి విన్నా, చదివినా రసానుభూతిపొందలేరు. ఈ విధంగానే అత్యంత భక్తి శ్రద్ధలతో గురుముఖత: వస్తునిశ్చయపూర్వకముగా ఈ గ్రంథమునందు పేర్కొనబడుచున్న పరిపూర్ణము, ఎరుక, ఎరుకను విడచుట అను అంశములు వినినగాని, చదివినగాని అనుభూతి పొందలేరు. వినిపించుట ద్వారా ఆరూఢ పరచుట, అనుభూతి పరచుట గురుప్రబోధయందు యిమిడి ఉన్నవి. కావున జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు మార్గముగా పేర్కొనబడుచున్న ఈ కందార్థ గ్రంథమును గురుముఖత: మాత్రమే క్రమములో వినుటకు వీలు కల్పించుకొని, ఇతరమైన పనులు తాత్కాలికముగానైనా నిలుపుచేసి మొదటినుండి చివరిదాకా శ్రవణము చేయగలిగినపుడు జనన మరణ భ్రాంతి రహిత విధానము దృఢ పడి సర్వ భ్రాంతి రహిత స్థితి చేకూర గలదు.

**కం॥ గూఢార్థమెరిగి సతతా। రూఢుండైనతడు గ్రం। థరుచి గొనడు**
**భువిన్। గాఢతరజ్ఞానంబున। మూఢుండై యున్న వాడు।**
**మొదటికె వినడూ। సుజనులపొడ। ముదమొప్పగ నడూ।**
**వాడువీడనరాని వాడే గ్రంథమువినె। వాడునిశ్చయ మిట్టి।**
**వార్తలెరుగనివాడు। మొదటీకెవినడూ। సుజనుల పొడ।**
**ముదమొప్పగనడూ॥ 183**

## ప్రతిపదార్థము

భువిన్ = ఈ భూ మండలమందు , ఈప్రపంచమందు
గూఢార్థము = రహస్యముగానున్న వస్తునిశ్చయ జ్ఞానము
ఎరిగి = గురుముఖత: వస్తునిశ్చయ పూర్వకముగా గుర్తించి
సతతము = ఎల్లవేళలా(సర్వకాల సర్వావస్థలయందు)
ఆరూఢంబైనయతడు = గట్టిగా దృఢపరచుకొన్నవాడు
గ్రంధరుచి గొనడు = గ్రంథమును చదువుటకిష్టపడడు
గాఢతరజ్ఞానంబున = దట్టమైన స్వస్వరూప విస్మృతిలోనున్నవాడు
మూఢుండై యున్నవాడు = ఉపదేశించినను గ్రహింపు లేనివాడు

మొదటికే వినడు = ఈ గ్రంథమును వినుట కేమాత్రము ఇష్టపడడు
సుజనుల పొడ = సత్పురుషులతో సహవాసము చేయుటకిష్టపడడు
ముదమొప్పగనడు = అట్టివారిని స్వబుద్ధితో దర్శించుటకు కూడా ఇష్టపడడు
వాడు వీడు అనరానివాడె గ్రంథము వినేవాడు = పైన పేర్కొన్న ఆరూఢతగాని, దిగువ పేర్కొన్న అవిద్యాదోషముగాని లేని, జిజ్ఞాస కలిగి వున్నవాడు మాత్రమే
నిశ్చయము = స్పష్టమైన అధికారము గలవాడు
ఇట్టివార్త లెరుగని వాడు = ఈ అధికారము లేనివాడు

## తాత్పర్యము

పరిపూర్ణ బోధయందు పరిపూర్ణమును, లేని ఎరుకను వస్తునిశ్చయ పూర్వకముగా దృఢ పరచుకొని ఎరుకను విడచు విధానమందు స్పష్టమైన ఆరూఢత కలవానికి ఈ గ్రంథ పరిశీలనతో పనిలేదు. స్వస్వరూప విస్మృతితో అవిద్యాదోషముచే పూర్వపుణ్యఫలము లేనివాడు ఈ గ్రంథము ను చదువుటకుగాని, వ్యాఖ్యానించి వివరించువారిని దర్శించుటకు గాని ఇష్టపడడు. అట్టి ఆరూఢతగాని, అట్టి అవివేకము గాని లేక పూర్వ పుణ్యఫలముచే జన్మ తరుణో పాయమునకు ప్రయత్నించు ఒక జిజ్ఞాసికి మాత్రవే ఈ గ్రంథమును చదువుటకు, ఇందలిభావములు దృఢపరచుకొనుటకు, తద్వారా జన్మసాఫల్యము పొందుటకు ఇష్టపడును.

**కం॥ తాబేటి తలపుచేతను। తాబేల్పిల్లలక్షుధార్తి తలగుట తెలియన్।**
**తాబేటి గర్భమందున। తాబేలైపుట్టకున్న। తరమా యితరులకూ**
**సద్గురుబోధ ట్లరయనితరులకూ। యేబాధలెరు గాని యీ**
**బోధగల వారి। చే బోధ బడయాక చేకొనదలచీతె। తరమా**
**యితరులకూ। సద్గురుబోధ। ట్లరయాని తరులకూ॥ 184**

## ప్రతిపదార్థము

తాబేటి తలపు చేతను = తాబేలు తనసంకల్ప బలము చేతనె
తాబేటి పిల్లల = తనపిల్లల యొక్క

క్షు దార్తి = ఆకలి బాధను
తలగుట తెలియున్ = ఎట్లు పోగొట్ట గలుగు చున్నదో తెలియుటకు
తాబేటి గర్భమందున =ఆ తాబేలు గర్భ వాసమునందు
తాబేలై పుట్టకున్న = తాబేలు పిల్లగా పుట్టకున్న
తరమా ఇతరులకు=ఈ అనుభవము పొందుట మిగిలిన జీవో పాదులకు సాధ్యమవునా
సద్గురు బోధ=పరిపూర్ణ మెరిగి, ఎరుకనెరిగి, ఎరుకను మాను అను విధానము
అట్లరయా ఇతరులకు = పైన పేర్కొన్న విధంగా ఉపదేశ పద్ధతిగా గురుశిష్య న్యాయంకాకుండా
ఏబాధలెరుగని ఈ బోధ గలవారిచే = పుట్టుక, చావులనెడి చక్రము నుండి బయటపడి పరిపూర్ణ బోధ యందు ఆరూఢతచెందిన వారిచే
బోధబడయక = అట్టి వారిద్వారా దృఢ పరచు కొనక
చేకొన దలచితే = తన తెలివి తేటలచే ఊహాపోహలతో ఈ గ్రంధమందలి భావమును గ్రహింపబూనుట
తరమా ఇతరులకు = గురుపుత్రులు కానివారలకు సాధ్యమవుతుందా?

## తాత్పర్యము

ప్రకృతి నియమానుసారము తాబేలు తన కన్న పిల్లల ఆకలి బాధను భౌతికమైన ప్రక్రియ ఏమాత్రము పాటించకుండానే తన సంకల్ప బలముచే నివారించ గలుగుచున్నది. సామాన్యుల కిది ఆశ్చర్యకరమైన విషయము. ఇట్టి అనుభవము ఎట్లు కలుగును? అని ఎవరైనా సందేహింప బూనినచో అట్టి సందేహ మనస్సులు తమ ఉపాధిని మార్చి తాబేటి ఉ పాధియందు పిల్ల గా జన్మించిన మీదట గాని అట్టి అనుభవము సిద్ధింపదు. ఈ విధంగానే గృహస్థాశ్రమ ధర్మము నందు భుక్తి ముక్తి క్రియలు రెంటియందు పరిపూర్ణత్వమును సాధించి (పరిపూర్ణము ఎరిగి, ఎరుకను ఎరిగి, ఎరుకను మాను) సర్వభ్రాంతి రహిత స్థితిని సాధింప బూనుట కూడా ఆశ్చర్య కరమైన అంశమే. కాని పరంపరాప్రోక్తముగా వున్న సాంప్రదాయ బద్ధమైన వస్తునిశ్చయ జ్ఞానపు వివరణతో కూడుకున్న

సద్గురూపదిష్టమార్గమునందు చతుర్విధ శుశ్రూషలచే గురుకృపాలబ్ధిద్వారా ఈ బోధయందు అరూఢతచెందుట సాధ్యమగునని పైన ఉదాహరణద్వారా మనకు చెప్పబడుచున్నది. సామాన్యులకు అనగా సాంప్రదాయ పద్ధతి పాటించనివారికి అట్టి అరూఢత సాధ్యము కాదని "స్వయం తీర్ణయ: పరంస్తారయతి " అన్నట్లుగా పరిపూర్ణబోధ యందు స్పష్టమైన అరూఢత కల్గి గురువు ఆజ్ఞానుసారంగా జీవించు లక్షణము గల్గిన గురువును ఆశ్రయించి వారి ద్వారా ఉపదేశ క్రమంలో ఈబోధ పొందవలసినదే తప్ప వేరు మార్గములేదు. ఇట్టి పద్ధతి గాక ఇతర మార్గము వల్ల ఇట్టి స్థితి చేకూర జాలదు అని కూర్మ వృత్తి ఉదాహరణ ద్వారా గురుకృప దాని ప్రభావము ఇందు చెప్పబడు చున్నది.

**కం॥ ఈతాపేక్షను మనుజులు। నూతిదరింజేరినిల్చినోట గొలిగినన్। యీతేలవచ్చువారికి। చేతుల తోనీళ్ళమీద। చేరీయీ దకనూ। మునునేర్చిన। వారీదించకనూ। యీరీతిగనె దేశికేంద్రుడు దెల్పాక। చాతుర్యమున బోధసాధించనయ్యౌన। చేరి యీదకనూ। మునునేర్చిన। వారీదించకనూ॥ 185**

## ప్రతిపదార్థము

మనుజులు=మనువు సంతతికి చెందినవారు లేక మనస్సు ఎక్కువగా వికసించినవారు

ఈతాపేక్షను = నీటియందు తేలియాడు ప్రజ్ఞాపాటవము గల్గిన విద్య

అపేక్ష = కావాలనే కోరికతో

నూతిదరిన్ జేరి = జలనిధికి స్థానమైన, భూమితోసంబంధ పడిన స్థానమునకు దగ్గరచేరి

నిల్చి = దాని దగ్గరగా నిలబడి, ఒడ్డున నిలబడి

నోట గొలిగినన్ = నోటినుండి వచ్చిన మాటలద్వారా, ఈదుటలో పాటించు క్రమమును నోటితో ఉచ్ఛరించిన

ఈతేలవచ్చు వారికి=ఈదుట అను విద్య యందు వారికి ప్రజ్ఞా పాటవము సిద్ధించదు

చేతులతో నీళ్ళమీద చేరి ఈదకనూ = ఒడ్డునుండి దిగివచ్చి నీళ్ళతో చేరి తాను తెలుసుకొన్న విధాన మంతయు ప్రయత్న పూర్వకముగా పాటిస్తూ (కాళ్ళు, చేతులు, తలకాయ ఆడిస్తూ) ఈతనేర్వవలసి యున్నది

మును = అంతకు పూర్వము

నేర్చినవారు = ఈ విద్యయందు నిపుణత సాధించినవారు

ఈదించకను = స్వయముగా దగ్గరవుండి ఈత విద్యయందు ప్రజ్ఞా పాటవములు నేర్పుతూ కల్గించ వలసివున్నది.

ఈరీతిగానె = ఈ విధంగానే

దేశికేంద్రుడు తెల్పాక = పరిపూర్ణబోధయందు ఆరూఢత గల్గిన గురువు ద్వారా వస్తునిశ్చయ పూర్వకముగా పరిపూర్ణము ఎరుగుట, ఎరుకను ఎరుగుట అను క్రమమును పాటించక

చాతుర్యమున = తన స్వంత తెలివి తేటలతో, ప్రజ్ఞా పాటవముతో

సాధించనయ్యాన = పరిపూర్ణబోధయందు ఆరూఢత సిద్ధించునా?

## తాత్పర్యము

నీటియందు తేలియాడుచు ప్రజ్ఞా పాటవములు ప్రదర్శించగలుగు విద్యను ఈత విద్య అని చెప్పబడును. నీటియందు ప్రాణ సత్తా అత్యంత సూక్ష్మముగా నుండును. జలచరములు తప్ప భూచరములు నీటియందు తేలియాడుట కష్ట తరము. అత్యంత జాగరూకతతో ప్రాణ గండము లేకుండా తనను తాను రక్షించు కొనుచు ఇతరుల్నికూడా రక్షింప గలుగు శక్తి సామర్థ్యములు ఈ విద్య యందు పొందవచ్చును. ఇందుకు తగిన గురువును ఎంచుకొని ముందుగా నూతియందు తరువాత చెరువులో, సరస్సులో, నదిలో తదుపరి క్రమంలో సముద్రమందు ఈ విద్యను పాటిస్తూ, ప్రదర్శిస్తూ, అందు ప్రజ్ఞా పాటవములు పొందవలసి ఉన్నది. ఇట్టివాడు గజ ఈతగాడు అని పిలువ బడును. ఇట్టి విద్య యందు నిపుణత సాధించినవారు విద్యా వ్యాప్తి కొరకు, సమాజానికి అందించడానికి కొన్ని గ్రంథములు వ్రాసి, అందు ఈవిద్య యందలి విధి విధానమును పొందు పరచి యున్నారు. ఇది

గ్రంథస్థమైన విద్య. దీనిచే ప్రేరణ గల్గినవారు విద్య యందలి ఆసక్తిచే జలనిధులకు స్థానమైన ప్రాధమిక దశయగు నూతిని సమీపించి, ఒడ్డున నిలిచి, గ్రంథమందు తాను గ్రహించిన అంశములు నోటితో వల్లించిన మాత్రమున వారికి ఈతయందు ప్రావీణ్యత కలుగదు. స్వయముగా నూతిలో దిగి ఈ తయందలి విధి విధానము ప్రయోగాత్మకంగా పాటిస్తూ స్వయంకృషితో ఈత నేర్చుకొనవలెను. లేదా అట్టి విద్య యందు ప్రజ్ఞా పాటవములు కలిగిన మార్గ దర్శకుని పర్యవేక్షణలో వారి సూచనలు, ఈత విధానము స్వయముగా పాటిస్తూ క్రమంలో ఈత విద్యయందు ప్రావీణ్యత సంపాదించ వలసియున్నది. అట్లు కాక స్వప్రయత్నంచేత ఈత నేర్వగలిగినప్పుడు విద్య సంక్రమించక పోగా ప్రాణ గండము సిద్ధించును. ఈ విధంగానే అచల పరిపూర్ణ ప్రబోధ అత్యంత రహస్యమై లౌకిక విద్యలు, కామ్యవిద్యలు దాటి, బ్రహ్మవిద్యకు కూడా దూరమై, వార్తిక సిద్ధాంతము నుకూడా దాటి, అత్యంత రహస్యమై సాంప్రదాయ బద్ధముగా వస్తు నిశ్చయ పూర్వకముగా గురూపదిష్ట మార్గమునందు మాత్రమే ఉపదేశింప బడుచున్నది. సమాజశ్రేయస్సుకు దీని నందించుటకు ఈసాంప్రదాయమందలి మహాత్ములు ఈ పరిపూర్ణబోధను సిద్ధాంతపరంగా గ్రంథస్తము జేసి (పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను) దీని అవసరాన్ని, ప్రయోజనాన్ని ప్రపంచానికందించి యున్నారు. అట్టి రచనలలో ఈగ్రంథము ఒక భాగము. ఇందలి బోధనా విధానం సిద్ధాంత పద్ధతియందు చెప్పబడినట్లుగా ఉపదేశ పద్ధతి పాటిస్తూ గురుముఖత: మాత్రమే వస్తు నిశ్చయ పూర్వకంగా నేర్వ వలసిఉన్నది. ఇట్టి విధానమునందు మాత్రమే జనన మరణ భ్రాంతిరహిత విధానము కలుగ గలదు. ఎట్టి ఊహా పోహలు దీనియందు పనికిరావు.నిర్ధుష్టంగా గ్రహింప వలసివున్నది అని తెలియ వలెను.

కం॥ ప్రవిమలచిత్తుడు శిష్యుడు। సవినయముగ దేశికునకు
శరణాగతుడై। త్రివిధప్రసాదములనుగొని। భవనాశస్థితులు లేని।
పద్ధాతివినినన్। తిరిగిరాని। పద్ధాతిగనినన్। భువిలోవానిసాటి
బోల్వ నెవ్వరులేరు। అవిరాళభక్తి నీవారీతి నుండేవీ పద్ధాతి
వినినన్। తిరిగిరాని। పద్ధాతిగనినన్॥ 186

## ప్రతిపదార్థము

ప్రవిమల చిత్తుడు శిష్యుడు = త్రికరణ శుద్ధితో కూడిన ప్రవర్తనచే పరిశు ద్ధాంత: కరణ కల్గినశిష్యుడు

సవినయముగ = అత్యంత భక్తి, శ్రద్ధ, నమ్రతలతో

దేశికునకు = పరిపూర్ణబోధను ఉపదేశించు గురుమూర్తికి

శరణాగతుడై = లమిత్యాది పంచపూజలచే సర్వార్పణబుద్ధి కలిగి

త్రివిధ ప్రసాదములు=మూడు రకములైన శ్రేష్టమైన, శక్తివంతమైన భావములు

గొని = స్వీకరించి

భవనాశస్థితులు = పుట్టుట, పెరుగుట, నశించుట

లేనిపద్ధతి = లేకుండాపోవు విధానము

వినినన్ = వుపదేశము పొందిన మీదట

తిరిగి రాని పద్ధతి = భ్రాంతి రహిత విధానము ద్వారా మరల జన్మకర్మలకు రాకుండు విధానము

గనినన్ = దృఢపరచుకొన్న మీదట

భువిలో = ఈ ప్రపంచంలో

వానిసాటి బోల్వ = వానితో సరిసమానమైన పోలిక గలవారు

ఎవరూ లేరు = ఇతరులెవరూ ఉండబోరు

అవిరాళభక్తి = సర్వార్పణ భావము తో తన్నుతాను సమర్పించుకొనగల్గు ఆత్మ నివేదనా రూపమైన భక్తి

నీవా రీతినుండేవు = నీవట్టి ఆదర్శమును, విధానమును పాటించి యుండుము.

# తాత్పర్యము

మానవ శరీర నిర్మాణమందు మన:ప్రాణవాక్కులతో కూడిన అంత:కరణ చాలా శక్తివంతమైనది. పనినిబట్టి ఇదే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అని పిలువ బడుచున్నది. మనము చేయుపనులు, వాటిఫలితములు వాసనామయమై ఈ అంత:కరణయందు చేరిఉండును. ఈ దోషములను వేదాంత పరిభాషలో ఆవరణ, మల, విక్షేపములుగా చెప్పబడుచున్నవి. వీటిని రద్దుపరచుకొని పరిశుద్ధాంత:కరణ కలిగిన గాని గురూపదేశము ఫలప్రదము కాదు. కేవలము గురూపదిష్ట మాత్రముచే విన్న ప్రబోధ బుద్ధినిశ్చయముగా మాత్రమే మిగిలిపోవును. ఆరూఢ జ్ఞానంసిద్ధించదు. మంత్రోపదేశ కాలములో ఈ దోష నివారణార్థము ఆత్మశౌచము కొరకు పరంపరా ప్రోక్తంగా సంక్రమించు మంత్రము, ప్రాణశుద్ధి కొరకు అభిమంత్రించిన తీర్థము, మన:శుద్ధి కొరకు పృధ్వీభూత సంబంధమై కఠినాంశము కలిగిన ప్రసాదము దీక్షా కాలములో గురువుచే శిష్యునకు సంక్రమించుచున్నది. వీటిని ఉపదేశపద్ధతి యందలి విధి విధానం పాటింపచేయుట ద్వారా అంత:కరణ శుద్ధత్వమును కలిగించి, పైదోషములనుండి పరిహరింపబడి గురుర్వాక్యము విన్నది విన్నట్లుగా అనుభూతం కావించుకోగల్గు శక్తిని అంత:కరణకు కలిగించి "బ్రహ్మైవాహమస్మి అహంపదార్థ రహిత: " అను లక్ష్యమును చేరుటకు ప్రబోధించును. సాంప్రదాయ పద్ధతియందు ఇది అత్యంత రహస్యమై యున్నది. ఇంతకన్నా విపుల పరచుట సాధ్యపడదు. పరిపూర్ణబోధ అనగా పరిపూర్ణమెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను మూడు అంశములను కూడా త్రివిధ ప్రసాధములుగా చెప్పబడుచున్నవి. ఇవిగాక కొన్నిసాంప్రదాయములందు ద్వాదశి, షోడశి, పంచదశి వాక్యములు ఉపదేశకాలములో చెప్పబడుచున్నవి. వీటినికూడా త్రివిధ ప్రసాదములుగా చెప్పబడుచున్నవి. ఈ క్రమంలో త్రివిధప్రసాదములు స్వీకరించి పరిశుద్ధాంత: కరణపరుడై వస్తునిశ్చయపూర్వకముగా గురుసూచన ద్వారా

పరిపూర్ణము, ఎరుకలనెరిగి తదుపరి ఎరుకను విడచి జనన మరణ భ్రాంతి రహిత స్థితిని గాంచిన శిష్యునితో పోల్చుటకు ఇతరులు ఉండజాలరు. పరిపూర్ణమును పోల్చుటకు ఎట్లువీలుకాదో అట్టి స్థితిని పొందినవారిని పోల్చుట కూడా పొసగదు. "ఉత్తపరిపూర్ణమే వారు, వారే ఉత్తపరిపూర్ణము" అనిసిద్ధాంత కర్త అయిన దీక్షితులవారు అట్టి వారినిగూర్చి పేర్కొన్నారు. పరిపూర్ణత దనరుట అనగా ఇట్టిదే. ఇట్టిస్థితి పొందవలెనన్నచో శిష్యుడు సర్వార్పణబుద్ధితో తన్నుతానుగా గురువుకి, గురుధర్మానికి అర్పణ గావించుకొని గురుర్వాక్యం యధాతధాగా జీవింప గలిగినచో అట్టి ఆరూఢత పొందగలగ వచ్చును. ఇట్టి వారిని ఇతరులతో పోల్చతగదు.

**కం॥ ఉపనయనముగానిదెతా। నుపనయనము మీదిచదువు**
**నూహను గొనిన్। విపరీతమగునుదానను। చపలుడుబ్రాహ్మ**
**ణుడు గాడు। చర్చించిచూడా। శూద్రుడువాన్ని యర్చించరేడా।**
**వుప మూచె బోధట్ల ఊహించినిక్కేటి। కపటా చిత్తుడు సాధు**
**గణమూ తొసమమౌనె। చర్చించిచూడా। శూద్రుడు వాన్ని।**
**యర్చించరేడా॥ 187**

## ప్రతిపదార్థము

ఉప + నయనము = సమీపముగా నున్న నేత్రము (జ్ఞాన నేత్రము)
కానిదే = జరగనిదే
ఉపనయనము మీది చదువు = ఉపనయన సంస్కారము జరిగినమీదట చదువ వలసిన చదువు (వేదజ్ఞానము)
ఊహను గొనినన్ = ఊహచేత పొందినచో
విపరీతమగును = యదార్థ జ్ఞానము కలుగక విపరీత జ్ఞానము కలుగును
దానను = అటువంటి
చపలుడు = బుద్ధీంద్రియము స్థిరపడనివాడు
బ్రాహ్మణుడు కాడు = బ్రహ్మ విద్యా సంపన్నుడు కాడు
చర్చించి చూడా = బాగుగా పరిశీలించి చెప్పినమాట

శూద్రుడు = వాసనా స్వరూపమైన అవిద్యచే కప్పబడినవాడు

వానిని = అట్టివానిని

అర్చించలేడా = పూజించుట తగునా

ఉపమూచే = ఊహచే

బోధ = పరిపూర్ణమెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను విధానము

అట్లు ఊహించి నిక్కేటి = ఆరూఢత చెందకుండా తనకు తోచిన విధంగా ప్రచారం చేస్తూ గొప్పవాడుగా ప్రచారమయ్యేవాడు

కపటచిత్తుడు = చెడు వాసనా స్వభావం కలవాడు

సాధు గణముతో సమమౌనె = సక్రమమైన మార్గంలో సాంప్రదాయ పద్ధతి యందుగల విధివిధానమును ఆరూఢ పరచుకొన్నవారితో సమానము కాగలడా?

## తాత్పర్యము

శాస్త్రములందు జీవుని పరిశుద్ధుని గావించుటకు షోడశ సంస్కారములు నిర్దేశింపబడినవి. అవి గర్భాదానము, పుంసవనము (చలిమిడిపెట్టి పంపడము) సీమంతము, జ్యాతకర్మము, నామకరణము, అన్నప్రాసన, చౌలం, ఉపనయనము, ప్రాజాపత్యము (తల్లి భిక్ష పెట్టుట) సౌమ్యం, ఆగ్నేయం, వైశ్య దేవనం, గోదానం, సమావర్తనం, వివాహం, అంత్యకర్మ. వీటియందు ఉపనయన సంస్కారం చాలావిశిష్టమై ఉన్నది. పుడుతూనే శుభాశుభ వాసనలతో మిశ్రమరూపమైఉన్న దానిని శూద్రత్వముగాను ఉపనయన సంస్కారముచేత ద్విజత్వముగాను, వేదాధ్యయన సంస్కారము విప్రత్వముగాను, బ్రహ్మజ్ఞానప్రాప్తి బ్రాహ్మణత్వముగాను చెప్పబడుచున్నది. జన్మాంతర వాసనలు రద్దయి, పరిశుద్ధాంత:కరణ పరుడై బుద్ధి ప్రచోదింపబడి (వికసింపబడి) ధారణాశక్తి (ఏకాగ్రత) స్ఫురణ శక్తి, ఉచ్ఛారణశక్తి వీటిని సిద్ధింప చేసుకొనినగాని, శాస్త్రమందు చెప్పబడిన అత్యంత సూక్ష్మముగానున్న బ్రహ్మపదార్థమునుగూర్చి శ్రవణ, మనన, నిధిధ్యాసలు చేయగలుగు బుద్ధికుశలత (సూక్ష్మ ప్రజ్ఞ) ఈ ఉపనయన సంస్కారం చేతగాని కలుగదు.

కావున ఈ సంస్కారమును కల్గించి, ఏతత్ఫలాన్ని పొందింపజేసినగాని, వేదాధ్యయనాధికారము సంక్రమించదు. దీనికిగుర్తుగా యజ్ఞోపవీతధారణ, గాయత్రీమంత్రోపదేశము, త్రికాల సంధ్యావందనము. ఉపాంగములుగా నిర్దేశింపబడినవి. బ్రహ్మచర్యావ్రతములో త్రికాల సంధ్యావంతుడై నిరంతర గాయత్రి మంత్రోచ్చారణాపరుడై ఉండుట ఉపనయన సంస్కారంయొక్క లక్ష్యంగా నిర్దేశింపబడినది. మనుష్యప్రజ్ఞ, జీవప్రజ్ఞలు విస్తరించి దైవప్రజ్ఞగామారి మంత్రరాశియందు నిక్షిప్తమైయున్న వాస్తవజ్ఞానము అర్థముతోసహా బుద్ధిప్రచోదనతో కలుగును. ఇట్టి అధికారముతో వేదాధ్యయనము జరిపినయెడల బ్రహ్మజ్ఞానమందలి వాస్తవము గ్రహించగల్గును. "బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి" అనుసూత్రాను సారముగా బ్రాహ్మణత్వం సిద్ధించును. ఈ ప్రక్రియ పాటించకుండా అనగా అంత:కరణ పరిశుద్ధత్వం, ఏకాగ్రతలేకుండా వేదాధ్యయనము చేసినయెడల అసంభావన, విపరీతభావన అనుదోషములచే విపరీతార్థము గ్రహించును. తద్వారా వేదశాస్త్రమునే శంకించ వీలగును. అట్టివారు పూజనీయతను పొందలేరు. ఈవిధంగానే సాంప్రదాయ పద్ధతియందు పరంపరా ప్రోక్తంగా సంప్రాప్తమయ్యే ఉపదేశక్రమం (అనుష్టానము, ఆచరణ, విచారణ) వస్తునిశ్చయజ్ఞానము, మంత్ర, మంత్రార్థ, మంత్రరహస్యములు పాటించవలసినవి పాటిస్తూ వినవలసినవి వింటూ, పొందవలసినవి పొందుచూ బ్రహ్మైవాహమస్మి, అహంపదార్థ రహిత: అనుక్రమంలో బోధను అరూఢపరచుకొనక, పీఠగ్రంథములు, వ్యాసములు, ఉపన్యాసములు చదివి, విని, సిద్ధాంతమందలి మౌలికాంశములైన పరిపూర్ణము, ఎరుక, ఎరుకను విడచుట అను వాటియందు స్వంత అభిప్రాయములు కలిగించుకొని, ఆ గ్రహించిన అసమగ్రవిధానం సాంప్రదాయం పేరుతో ప్రచారంచేస్తూ ధన, కీర్తి, ప్రతిష్టలకై ప్రయత్నించువాడు నిర్దుష్ట విధానముగా కృషిసలిపి ఆరూఢత చెందిన మహాత్మునితో సమానముకాడు.

కం॥ మంత్రముచేనంతెట్లగు। తంత్రములేకన్నకాదు తంత్రముచేతన్। మంత్రములేకనువడుగిల। మంత్రము తంత్రబు రెండు। మరిగూడుకోనీకార్యములన్ని। జరిగించు వూనీ। మంత్ర తంత్రములాలో మర్మాముగురుడెరుగు మంత్రతంత్రము లాలో మరుగెరుగు గురునీచే। మరిగూడు కోనీ కార్యములన్ని। జరిగించువూనీ॥ 188

## ప్రతిపదార్థము

సంతు = సంతానము

మంత్రము + తంత్రము=ఆగమ శాస్త్రము నందు పుట్టినది మొదలు మరణానంతరం వరకు ప్రతి జీవికి జరపవలసిన విధి విధానమును తెలియపరచు శాస్త్రమునకు మంత్ర శాస్త్రము, తంత్ర శాస్త్రము అని చెప్పబడును.

ఇల = ఈ ప్రపంచములో

వొడుగు = వేదాధ్యయనమునకు ముందుగా చేయవలసిన గాయత్రి మంత్రోపదేశము, యజ్ఞోపవీత ధారణము, సంధ్యోపాసన

మంత్రము, తంత్రము మరి గూడుకొని = మంత్రము, తంత్రము అను రెండు క్రియలు ఒకదాని కొకటి అనుబంధముగా నిర్ధేశింపబడినవి పాటిస్తు

కార్యము లన్ని = పనులన్ని క్రమం తప్పకుండా

జరిగించు పూని = శ్రద్ధా భక్తులతో రెండు ప్రక్రియలు కలిపి పాటించుము

మంత్ర తంత్రములలో మర్మము గురుడెరుగు = పైరెంటి క్రియలందలి రహస్యము ప్రయోజనము సద్గురుమూర్తికి స్పష్టమైన అవగాహన కలిగి వున్నది.

మంత్ర తంత్రములలో మరుగెరుగు గురునీచె = మంత్ర తంత్రములలో రహస్యము, గురుమూర్తి ద్వారా తెలుసుకొనుము

## తాత్పర్యము

పై కందార్ధమునందు ఉపనయన సంస్కారముగూర్చి వివరింపబడిఉన్నది. అట్టి ప్రక్రియకు శాస్త్రములందు మంత్రము, తంత్రము అను రెండువిధానములు నిర్ధేశింపబడుచున్నవి. ఉపనయన కాలంలో

మంత్రశాస్త్రానుగుణ్యంగా మంత్రముపదేశించి, తంత్రశాస్త్రానుగుణ్యంగా యజ్ఞోపవీతధారణ కల్గించి, సంధ్యావందనమను ప్రక్రియ ద్వారా ఈ రెంటినీ పాటించులాగున శాస్త్రమునందు ఏర్పాటుచేయడమైనది. ఈ పైరెండు ప్రక్రియలు ఒకదానికొకటి ముడిపడి పాటించవలసినవేగాని, విడి విడిగాపోషించిన పూర్ణఫలము సిద్ధించదు. రెండింటిని ఒకటిగాచేసి పాటించు విధానము ఉపదేశకాలమందు గురువుచే స్పష్టముగా వివరింపబడి పాటించులాగున నిర్ధేశించెను. అందలి రహస్యములన్నియు ఉపదేశించు గురువునకు స్పష్టమైన అవగాహన కలిగిఉండును. కావున ఉపదేశికుడు (పొందినవాడు) గురువుద్వారా అట్టి విధివిధానము స్పష్టముగా తెలిసి పాటించవలసి ఉండును.

ఈకందార్ధములోని విశేషార్ధము వివరించుటలో పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను సిద్ధాంత క్రమము వివరించుటలో ద్వాదశి మంత్రార్ధముద్వారా అచల పరిపూర్ణ దర్శనమును, షోడశి మంత్రార్ధముద్వారా ఎరుకను విడచు విధానము వివరించబడినది. వీటిని వస్తునిశ్చయ పూర్వకముగా మంత్ర, మంత్రార్ధ, మంత్రరహస్యములను గురుముఖత: మాత్రమే దృఢపరచుకొని వాటివిలువలు తెలుసుకొని, అందుకు తగిన విధంగా జీవన విధానము గడుపుట చాలా అవసరమై యున్నది. మంత్రము (ద్వాదశి, షోడశి) తంత్రము వాటి విడచువిధానము ఈ రెండూ క్రమంలో ఒకదానికొకటి సంబంధపడి రహస్యమై వున్నవి. సిద్ధాంతమందు పరిపూర్ణ దర్శనము ఎంతముఖ్యమో, ఎరుకను విడచుట కూడా అంతే ముఖ్యము. అంతేకాక పైవివరణతో ఆరూఢతచెంది, అందుకనువుగా జీవించడం కూడాచాలాముఖ్యమై వున్నది. సాంప్రదాయమునందు ఈప్రక్రియలు అత్యంత రహస్యమై గురుముఖత: మాత్రమే వాటి మర్మ ధర్మములు దృఢపరచుకొనవసిఉన్నది. ఇందుకు భిన్నంగా మంత్రము విడచి తంత్రముగాని, తంత్రముండి మంత్రము లేక గాని బోధగ్రహించినచో ఇది అసమగ్రమైన, అసాంప్రదాయకమైన బోధగా చెప్పవచ్చును.

కం॥ సకలజనుల సమ్మతిగా। నొకరైననునడువలేరు। నుర్వీస్థలిపై।
మకరాంకజననిజనకా। ద్యకళంకులలోను నేనీ వననేమిగణనా।
బోధందితర। జనులేమి గణనా। వికలామాన సుడావై
వెతనొందబోకునీ। వకుటీలభక్తుడవని తెల్పితీబోధ। ననే
మిగణనా। బోధంది తర। జనులేమిగణనా॥ 189

## ప్రతిపదార్థము

నుర్వీస్థలిపై = ఈ భూమండలమందు
సకలజనుల సమ్మతిగా = అందరకు నచ్చినట్లుగా, ఆమోదించినట్లుగా, సంతృప్తి చెందినట్లుగా
ఒకరైనను = ఏ ఒక్క మానవుడైనను
నడువలేరు = ప్రవర్తించలేరు
మకరాంకుడు = మొసలి వాహనముగా కల మన్మధుడు
జననీ జనకులు = లక్ష్మీ నారాయణులు
ఆద్యకళంకులలోన = దేవేంద్రాది మున్నగు దేవతలతో సహా
నే + నీవు అననేమిగణన = వారికంటే నీవు నేను గొప్పవారమౌతామా?
బోధందు = జన్మరహితమునకు మార్గమైన పరిపూర్ణ భావమునందు
జనులేమి గణనా=ఇతరులు ఏవిధముగా మాట్లాడినా (అనుకూలంగా, వ్యతిరేకంగా)
వికలామానసుడవై = కలతచెందిన మనసు గలవాడవై
వెతనొంద బోకుము = అశాంతికి గురై సమస్యలకు లోనుకాకు
నీవుఅకుటిల భక్తుడవని = నిష్కళమైన, పరిశుద్ధమైన భక్తిగలవాడవని
తెల్పితీబోధ = ఈ పరిపూర్ణ బోధను నీకు ఉపదేశించినాను

## తాత్పర్యము

ఈప్రపంచమందు అందరూ మెచ్చుకునేలా, ఆమోదించేలా నడవడిక కల్గి యుండటం చాలా కష్టతరమైన పని. 84 లక్షలజీవులకు పోషణకర్త, వైకుంఠాధిపతియైన విష్ణుమూర్తి, ఆయన సహధర్మచారిణీ, ఐశ్వర్యాధిష్టాన దేవతయైన మహాలక్ష్మి, లోకపాలకులైన ఇంద్రాది దేవతలకే

వశము కాకుండా ఉన్నది అట్టిస్థితియందు గృహస్థధర్మములో వుండి భుక్తి, ముక్తి క్రియలు రెండింటికి బాధ్యత వహించి జన్మరాహిత్యమునకై పరిపూర్ణబోధ కృషిచేయునీవు, నేను ప్రవర్తించు విధానము అందరికీ అనుకూలముగా వుండక పోవచ్చు, సాధ్యము కాకపోవచ్చు. పూర్వ పుణ్యవిశేషముచే నిష్కళంకమైన భక్తితో ఈ ధర్మము నాశ్రయించుటచేత నీయందు ఎట్టి సందేహము లేక అపూర్వమైన ఈ భావమును నీకు ఉపదేశించినాను. గురువాక్యం యధాతధంగా జీవించు జీవన విధానంలో నీప్రవర్తనను గూర్చి అనుకూలంగా గాని, వ్యతిరేకంగా గానీ ప్రపంచంలో వారు ఎవరు మాట్లాడినా నీవు మనస్తాపమును చెందకు. గురుధర్మ నిర్వహణలో ఎట్టి సందేహమునకు, అలసత్వమునకు చోటివ్వకు.

**కం॥ బలధనవిద్యలు దుష్టుల। కిలగల్గిననొరులనొంతు రీర్ష్యమునన్।**
**బలధనవిద్యలుశిష్టుల। కిలగలిగిన నొరుల బ్రోతు। రెంతోమో**
**దమునా। నీవీరెంటి। నెరిగివెూదమునా। కలలోననైన**
**దుష్టులచెంత జేరాకు। మెలిమిశిష్టులచెంత। కలనైనవదలాకు।**
**యెంతోమోదమునా। నీవీ రెంటి నెరిగీ మోదమునా॥ 190**

## ప్రతిపదార్థము

బలధన విద్యలు = బలము, ధనము, విద్య
దుష్టులకు=అసూయా పరులకు, దుర్మార్గ పరవృత్తి కలవారికి, స్వార్థము కలవారికి
ఇల కల్గిన = జీవిత విధానములో పూర్వజన్మసుకృతముచే సంక్రమించిన
ఒరులు = ఇతరులు
ఒంతురీర్ష్యమునన్ = అసూయా లక్షణముచేత అపకారము చేయుదురు
బల ధన విద్యలు శిష్టులకిల కలిగిన = బలము, ధనము, విద్య సత్పురుషులకు సంక్రమించిన ఎడల
నొరుల బ్రోతురు = ఇతరులకు సహాయపడుదురు
ఎంతో మోదమున = అత్యంత ప్రేమతో, సంతోషముతో
నీవీరెంటినెరిగి మోదమున = పైరెంటి విషయాన్ని నీవు శ్రద్ధగా పరిశీలించి

కలలోనైన దుష్టుల చెంతచేరకు = స్వప్నావస్థలో కూడా దుర్మార్గవృత్తి కలవారి వద్దకు చేరకు
మెలిమి శిష్టుల చెంత కలనైనా వదలకు = సత్పురుషుల సహవాసము ఏమాత్రము విడచిపెట్టకు.

## తాత్పర్యము

కర్మ సిద్ధాంతం ప్రకారం పూర్వజన్మార్జితమైన పాప పుణ్యములు, సుఖ దు:ఖములు సంక్రమించుననని చెప్పబడుచున్నది. అందు పుణ్య సంస్కారప్రభావముచే శరీరబలము, ధనము, విద్య అనునవి దైవదత్తముగా ఫలప్రదమై వచ్చును. అంత:కరణ మందలి సంస్కార ప్రభావంచే మంచి, చెడు స్వభావములు ఏర్పడును. దైవదత్తముగా పూర్వజన్మార్జిత పుణ్యఫలముచే తనకు సంక్రమించిన బలము, ధనము, విద్యలను తను ఉపయోగించుకొని, తోటివారికి కూడా వాటిని ఉపయోగ పడేలా సత్పురుషులు వినియోగింతురు. వాటి సార్థకత్వమును పొందును. స్వార్థ పరత్వముతో, ఈర్ష్యాద్వేషములతో అసూయాగ్రస్తుడైనవాడు తనకు సంక్రమించిన పై సంపదలచే ఇతరులకు హానిని, అపకారమును, కష్టమును కలిగించి ఆనందింతురు. ఈ రెండు అంశములు శ్రద్ధగా పరిశీలించి స్వప్నావస్థలో కలిగే ఊహలోకూడా దుష్టుల చెంత చేరకు, శిష్టులతో స్నేహము విడచి వుండకు అని భావము.

కం॥ అందమగుస్వాతివర్షపు। బిందువులెందెందుబడునొ పృధివిని త।
ద్బిందువు లుపాధివశమున। జెందును తగునామ రూప। చేష్టా
దికమునూ। అట్లనేనీవు। జెందెవిన్నియునూ మందీ తొజతగూడి
మాట్లాడినంతాలో। అందూకె సహవాస మరయూము తగుదాన్ని।
చేష్టాదికమునూ। అట్లనె నీవు జెందె విన్నియునూ॥ 191

## ప్రతిపదార్థము

అందమగు = ప్రకృతి సిద్ధముగా
స్వాతి వర్షపు బిందువులు = స్వాతి కార్తెలో పడు వర్షపు చినుకులు

ఎందెందు పడునో పృథ్విని = భూమిమీద ఎక్కడెక్కడ పడునో
తద్బిందువులు = ఆవిధముగా పృథ్వీమీద పడిన నీటిబిందువులు
ఉపాధి వశమున = చినుకు పడిన ప్రదేశమును, పాత్రను బట్టి
చెందును తగునామరూప చేష్టాధికమును = ఆయా పాత్రలనుబట్టి నామరూపభేదములు ఏర్పడును
అట్లనే = ఆవిధంగానే
నీవు చెందే విన్నియును = నీవును అనేక ఉపాధులు పొందుదువు
మందితో జతగూడి మాట్లాడినంతలో = సమాజములో నున్న వ్యక్తులతో కలిసి జీవించి వ్యవహరించుట చేత
అందుకే = ఈకారణము చేతనే
సహవాసము = కలసి మెలసి జీవించే విధానములో
అరయుము తగుదాన్ని = నీకు నచ్చిన విధానమును పాటించుము

## తాత్పర్యము

ప్రకృతి యందు కాల చక్రమును అనుసరించి ఋతు ధర్మములు ఏర్పడుచున్నవి. అందు స్వాతికార్తె చాలా విశిష్టమైనది. ఆవర్షపు చినుకుల కొరకు ప్రకృతి చాలా ఆసక్తిగా ఎదురు చూస్తుంది. క్రమ ప్రకారము మేఘమండలమందలి ద్రవము వాయువు ప్రేరణచే ద్రవాంశము చెంది చినుకుగా మారి భూమిమీద పడును. ఆచినుకు పడిన ప్రదేశము పాత్ర ఉపాదులను బట్టి ఆ వర్షపు చినుకులకు నామరూపములు సిద్ధించును. ఒక్క ముత్యపు చిప్పలో పడిన చినుకు మాత్రమే స్వాతి ముత్యంగా మారును. ఈపద్ధతిగానే నీవుపాధి కూడా ఏర్పడి యున్నది. వర్షపు చినుకు పడిన పాత్రత ప్రదేశమును బట్టి వాటి విలువలు ఎట్లు మారుచున్నవో అట్లే సహవాసమనగా కలిసి జీవించుటచేత శీలము (సుగుణ సంపత్తి) సంస్కారము ఏర్పడుచున్నవి. కావున కలలో కూడా నీవు దుష్టులచెంత చేరకు. శిష్టులతో కలిసి జీవించుటకు సందేహించకు అనిభావము.

**కం॥ జారులకులోకులందరు। జారులవలెతోచబడుట సహజగుణం బౌ। చోరులకుసకలజనములు। చోరకులని మదికిదోచుయునికీ సహజమురా। అట్లనె। దుష్టాత్మునికీ। సహజమురా సారములేని సం। సారాబ్ధిదాటించు వారిని తమవంటివారిగ గనుటట్టి। వునికీ సహజమురా అట్లనె దుష్టాత్మునికి సహజమురా॥ 192**

## ప్రతిపదార్థము

జారులు = వ్యభిచారులు, తిరిగే లక్షణంకలవారు
లోకులు = ప్రాపంచికులు, ప్రపంచమునందున్నవారు
జారులవలె తోచబడుట = వారివలె ఇతరులు తోచబడుట
సహజ గుణంబౌ = అంత:కరణ ప్రభావముచే సహజమగును
చోరులు = దొంగ తనమే వృత్తిగాకలవారు
సకల జనములు = ఇతర మానవులందరూ
చోరకులని = దొంగలని
మదికి తోచు = మనసుకి తోచుట
ఉనికి సహజమురా = సహజముగా కలిగే గుణము
అట్లనే = ఆవిధంగానే
దుష్టాత్మునికి = పూర్వపుణ్యవిశేషము లేనివానికి
సహజము = స్వభావము
సారములేని = అంతములేని
సంసారాబ్ధి = జనన మరణములనే సముద్రమును
దాటించు వారిని = రద్దు పరచు వారిని (పరిపూర్ణ గురువులు)
తమవంటి వారిగ = తమవలె సామాన్యమైన వ్యక్తులుగ
గనుట = గుర్తించుట

## తాత్పర్యము

మానవ స్వభావము చాలా విచిత్రమైన పద్ధతిగా వ్యవహరించును. సత్వగుణ, రజోగుణ,తమోగుణములచే అంత:కరణయు ప్రభావితము చెంది

సంస్కారమేర్పడును. దానిప్రభావములకు లోనై వ్యక్తి యొక్క శీలసంపత్తి ఏర్పడును. ఆవిధంగా, ప్రవర్తన, జీవితము ఆలోచన ఏర్పడును. వ్యభిచారమే ప్రవృత్తిగా కలవారికి తమకు ఇతరమైన వారి అందరియందు ఆలక్షణమే ప్రకటమై వారినికూడా తనవలనే అంచనా వేయును. దొంగతనమే ప్రవృత్తిగా కలవారు ఇతరులందరినీ తమవలెనే దొంగలుగా గుర్తించుదురు. ఇవి వారి వారి అంత:కరణ సహజలక్షణము. ఈవిధంగానే పూర్వజన్మార్జిత గుణదోషములచే దుర్మార్గవృత్తి కలిగిన మానవులు తమవలెనే మిగిలినవారందరూ తన స్వభావమునే కలిగి యున్నారని తలంచుదురు. అంతములేని జనన మరణ ప్రవాహరూపమైన మహాసముద్రమును పరిపూర్ణబోధచే దాటించగల్గు సద్గురు మూర్తిని తమవంటివారిగా ఈ సమాజము గుర్తించుట సహజమని తెలుసుకొనుము.

కం॥ గురుడు నరుడనుచుదలచిన। గురుమంత్రము మరచియున్న
గురుపుత్రులనా। దరణయొనర్చక యుండిన। గురువును విడనాడి
రెండో। గురునిజేరిననూ। సద్గురుబోధ। నెరిగీ దూరిననూ। యెరుక
మహాత్యాము నెరిగీనయిటు వంటి నరునాకు దప్పా దునరకాము।
నిజమింకో। గురునీజేరిననూ। సద్గురుబోధ। నెరిగీ దూరిననూ॥193

## ప్రతిపదార్థము

గురుడు = పరిపూర్ణబోధ నెరిగించే గురువు

నరుడనుచు = తనలాటి మానవుడేనని

తలచిన = భావించిన

గురుమంత్రము = జన్మరహిత విధానమునకు ఉపదేశింపబడిన ద్వాదశి, షోడశి మంత్రములు

మరచివున్న = నిర్లక్ష్యముచే విడిచి పెట్టిన

గురుపుత్రులను=తనతో సమానముగా బోధయందు కృషిచేయు సహాధ్యాయులు

ఆదరణ ఒనర్చక యుండిన = గౌరవింపక చులకనగా చూసినా

గురుని విడనాడి రెండో గురుని జేరిన = సర్వభ్రాంతి రహిత స్థితి కలిగించు

కొనుటకు పరిపూర్ణ బోధగురువు నాశ్రయించి, ఇతర ప్రలోభములకు లోనై ఈతనిని విడచి వేరొక మత సాంప్రదాయ గురువుల నాశ్రయించిన సద్గురు బోధ ఎరిగి దూరినను = పరిపూర్ణ బోధ యొక్క నిర్మిత విధానము గొప్పతనము, విలువలు తెలిసి కూడా ఇతరమార్గములలోకి వెళ్ళుట ఎరుక మహాత్యము నెరిగీన = ఎరుక గొప్పతనాన్ని గుర్తించిన ఇటువంటి నరునకు = పైన పేర్కొన్న లక్షణములు కలిగిన మానవునకు తప్పదు నరకము = నరకమనే ద్వారము వారికి లభించును

## తాత్పర్యము

ఈ కందార్థమునందు గురువు శిష్యునికి గురుధర్మము ఎడల వుండకూడని లక్షణములు వివరింపబడుచున్నవి. పరిపూర్ణ భావము ఒక్క గురుకృపా ప్రసాద సిద్ధి వలనే దృఢపడునని తెలియవలెను. కావున ఈ సాంప్రదాయము నందు గురుభక్తి, గురూపాసన చాలా ప్రముఖముగా చెప్పబడుచున్నవి.ఉండకూడని లక్షణములలో

1) గురుడు నరుడని భావము ఉండకూడదు. ఏలననగా గురుర్వాక్యంయధాతధంగా జీవించుట చాలా అవసరం. అందుచే గురుడు నరుడు కాదు పరుడే అను భావము బలముగా వున్నగాని, గురుర్వాక్యం దృఢపడదు. గురుర్వాక్యం చేతనే పరిపూర్ణబోధయందు ( పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను ) గ్రహింప బడుటకు గురుసాక్షాత్ పరంబ్రహ్మ అను భావము తప్ప ఇతరమైన భావములన్నియుపోవలసినదే. ప్రతి నిత్యము ఉపదేశ గురువునకు నమామి, వదామి, స్మరామి, భజామి అన్నట్లుగా శిష్యులకు గురువు ఎడల అచంచలమైన విశ్వాసము వున్న మీదటనే ఇట్టి ఆరూఢత సిద్ధించగలదు.

2) గురుమంత్రము మరచియున్న:-అచల ఋషి సాంప్రదాయ మందు సిద్ధాంత పద్ధతిని వివరిస్తు రెండు ముఖ్యమైన లక్ష్యములు చెప్పబడు చున్నవి. 1. బ్రహ్మైవాహమస్మి 2. అహంపదార్థరహిత: ఈలక్ష్యమును

చేరుటకు ఉపదేశకాలమందు బ్రహ్మైవాహమస్మి అను లక్ష్యమును చేరుటకు గురుమాలా మంత్రమును, అహం పదార్ధ రహిత: అనులక్ష్యమును చేరుటకు ద్వాదశి,షోడశి మంత్రములు ఉపదేశింపబడుచున్నవి. ఏస్థాయికి సరిపడా ప్రయత్నం ఆయా మంత్రములను అనుష్టించుట ద్వారా పొంది ఆయాలక్ష్యములందు ఆరూఢత చెందవలసి వున్నది. మంత్రమనగా మననము చేయునదని, లక్ష్యమును చేరుటకు ప్రయాణ సాధనమని, జీవించినంత కాలము పాటింప బడు తగినదనిచెప్పవలసి వచ్చెను. ఈ అంశములు సంధర్భమును బట్టి వాటి అర్ధములు వస్తునిశ్చయ జ్ఞానము ద్వారా గురు ముఖత: గుర్తించి ఆరూఢ పరచుకొని, అట్టి నిష్టయందు జీవించ వలసి వున్నది. కావున మంత్రముల ఎడల ఎట్టి అలక్ష్యం లేకుండా ఉపదేశ పద్ధతి యందు చేయవలసిన క్రమం ప్రకారము అనుష్టించ వలసి యున్నది.

3) గురుపుత్రులను ఆదరణ యొనర్చ కుండిన:- జన్మరహిత విధానమునకు సాంప్రదాయ పద్ధతి కలిగిన గురువును ఆశ్రయించి, ఒకేలక్ష్యముతో కలసి, మెలసిజీవిస్తూ కొన్ని ఆదర్శములకు ప్రతినిధులుగా చెప్పబడు సహాధ్యాయుల ఎడల ఎట్టి నిర్లక్ష్యభావము ఉండకూడదు. వయోవృద్ధులు, జ్ఞాన వృద్ధులు అని రెండు తరగతులుగా పెద్దలను పేర్కొనుచున్నారు. ఆశయము, లక్ష్యము ఒకటై గురుని వద్దకు చేరిన సోదరులు సాక్షాత్ గురుస్వరూపులు గానే చెప్పబడుచున్నారు. ఇతర అంశాల్లో ఏమాత్రం భేదములున్నా ఈ ఒక్క అంశముచే ఏక భావన కలిగి నందున, ఒకరి ఎడల ఒకరు ఏకాత్మ భావముతో కూడిన పూజ్యభావమును కలిగి యుండవలెను. ఇందులకు సాందీపుని శిష్యులగు కృష్ణుడు, కుచేలుడే ఆదర్శముగా నిలిచి యున్నారు.

4) గురుని విడనాడి రెండో గురుని చేరిన:- బ్రహ్మవిద్య గురు పరంపరా ప్రోక్తమై సాంప్రదాయ బద్ధమై గురుశిష్య న్యాయంలో ప్రకాశించుచున్నది. గు, రు అను రెండక్షరములతో కూడిన ఒక అలౌకిక తత్వము. అట్టి

దీనిని "బృహి" అనగా అత్యంత పెద్ద వస్తువు (బ్రహ్మము) గా చెప్పబడు చున్నది. ఇట్టి పరబ్రహ్మ జ్ఞానము అనుభూతము కావించుకొని దానికి వేరు కాకుండా ఒకటిగా నిలిచి వ్యక్తి నిష్టము కాకుండా, ఇట్టి తత్వనిష్టతో కూడి జీవించే వారిని కూడా గురువు అనే శబ్దముచే పిలువ బడుచున్నారు. అచల ఋషి సాంప్రదాయ మందు సాంప్రదాయ గురువు శ్రీ బ్రహ్మ విద్యా గురువు మొదలు వ్యక్తి నిష్టముగా తనకు మంత్రోపదేశము చేసిన గురువు దాకా ఏకైక స్వరూపముగా వున్నది ఒక్క గురు స్వరూపమే. ఇక్కడ వ్యక్తి కంటె తత్వము గొప్పది. జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు ఒక సాంప్రదాయ బద్ధమైన గురువు ద్వారా ఉపదేశము పొంది, అందలి కృషి విధానమందు కొంత పాటుపడి పూర్వ జన్మ సంస్కార ప్రభావముచే ఇందుకు భిన్నమైన వేరే గురు భిన్న సాంప్రదాయ మును, గురువును ఆశ్రయించుట దోషమని చెప్పబడు చున్నది.

5)సద్గురు బోధ ఎరిగి దూరిన, ఎరుక మహాత్యమెరిగిన :- సర్వ భ్రాంతి రహిత స్థితే జీవిత లక్ష్యముగా ఎంచి, అందుకు యోగ్యుడైన గురువును, గురుసాంప్రదాయము నందు ప్రవేశించి కొంతమేరకు కృషిసలిపి, మరల భ్రాంతి సహిత బోధనా పద్ధతులు కలిగిన ఇతర మతములు, వాటిని ప్రబోధించు మతగురువులను ఆశ్రయించుట కూడా దోషమని చెప్పబడుచున్నది. పైలక్షణములు సాంప్రదాయ పద్ధతి యందు కృషిచేయు లక్షణయుతమైన శిష్యునకు కూడనివిగా ఈ కందార్థమునందు చెప్పబడుచున్నవి.

కం॥ మలయాద్రి చెంతచెంచుల। కిలచందన। భూరుహములె
యింధనమట మిక్కిలి గలుగబట్టి యట్లనె। చులకన సుమి
యింట గలుగు సూరి భూషణుడూ। బహుమాన్యుడు। దూరస్తు
డెపుడూ। తెలయానివారీకి తెలిసేది కఠినాము। తెలివీచెదెలసీతె
తెలియజేసునుబోధ। సూరిభూషణుడూ। బహుమాన్యాడు।
దూరస్తుడెపుడూ॥ 194

## ప్రతిపదార్థము

ఇల = ఈ ప్రపంచంలో

మలయాద్రి చెంత చెంచులకు=మలయ పర్వత పరిసర ప్రాంతము లందు నివసించు ప్రజలకు

చందన భూరుహములె ఇందనములట = మంచిగంధపుచెట్లనే వంట చెరకుగా ఉపయోగించెదరట

మిక్కిలి కలుగ బట్టి = ఏలననగా అవి ఎక్కువగా వారి కందుబాటులో నుండుట చేత

అట్లనే = ఆవిధంగానే

సూరి భూషణుడు = శ్రేష్టమైన, విలువైన గుణములు ఆభరణములుగా కలవాడు పరిపూర్ణ బోధయందు ఆరూఢతచెంది, అందుకనువుగా జీవితమును ఆదర్శప్రాయముగా గడిపేవాడు

చులకనసుమీ ఇంటగలుగు = గృహస్థాశ్రమము నందుండి, భుక్తి, ముక్తి క్రియలు రెంటి యందు సమన్వయ బుద్ధితో, రాజయోగధర్మము పూని, అందుబాటులోనున్నవాడు

బహుమాన్యుడు, దూరస్తు డెపుడు=చాలా విలువైనవాడు, దూరమైన వాడు

తెలియని వారికి తెలిసేది కఠినము = పైరెండు విలువలు స్పష్టముగా తెలియనివారికి, వారి వునికిని గూర్చి తెలియుట కష్టము

తెలివీచే తెలిసీతె=వారి నడవడికను, జీవనవిధానాన్ని ప్రత్యేకంగా పరిశీలించిన మీదట

తెలియ జేసును బోధ = నిగూఢముగా (రహస్యముగా) వారికి సంక్రమించిన పరిపూర్ణబోధను తెలియపరచగలరు

## తాత్పర్యము

ఈ ప్రపంచంలో మలయ పర్వతమందలి పరిసర ప్రాంతములలో నివసించు ప్రజలకు మంచి గంధపు చెట్లను వంట చెఱకుగా వినియోగింతురు. ఏలననగా మంచిగంధము విలువైనదైనా అందుబాటులో నుండి సమృద్ధిగా లభించుటచేత వారు వంటచెరకుగా వాడుచున్నారు. ఈ

విధంగానే పరిపూర్ణ బోధ యందు ఆరూఢత చెంది, భుక్తి, ముక్తి క్రియలు రెండింటియందు సమన్వయముపూని ఆదర్శ వంతముగా (రాజయోగ ధర్మము నందు) గృహస్థ ధర్మము నందు జీవితము వినియోగిస్తూ, విలువ తెలిసిన వారికి దానిని ఉపదేశిస్తు జనన మరణ భ్రాంతి రహిత విధానము దృఢ పరచ గల్గు సామర్ధ్యము గల పరిపూర్ణ భావజ్ఞులు సమాజంలో అందరికీ అందు బాటులోనున్నా వారి విలువను తెలియ లేక సామాన్య వ్యక్తిగా భావించి లౌకిక ప్రయోజనముల కొరకు వారితో కలిసి మెలసి జీవించెదరు. సర్వసంగ పరిత్యాగులై సన్యాసిగా నుండి దూరము నుండి వచ్చిన వారిని గౌర వింతురు. పరిపూర్ణభావమందు ఆరూఢత గాంచిన వారిని వేష భాషలందు కాక ఒక్క నడక యందు మాత్రమే తెలియ వలసి వుండును.అట్టి ఆరూఢత కలవారు మాత్రమే వారిని గుర్తించగలరు. సామాన్యులకిది దుస్సాధ్యము. ఒకపై గుర్తించగలిగి ఆశ్రయించిన వారికి మాత్రమే వారు గ్రహించిన ఆరూఢతను పొందింపచేయగలరు. అంతే తప్ప తమ ఉనికిని, ప్రభావమును వారంతట వారుగా వ్యక్త పరచుకొనరు. ఇట్టి వారిని ఈ కందార్ధము నందు మంచిగంధపు చెక్కతో పోల్చ బడినది. విలువ, అందుబాటు అను అంశములు ఈ కందార్ధము నందు ప్రముఖ మైనవి. పరిపూర్ణ భావజ్ఞుని యొక్క ఉనికి, విలువ ఇందుప్రముఖముగా తెలియ వలసి వున్నది.

**కం॥ చూసిమదిదెలసి శిష్యుని। యాశయముకుతగిన బోధ నతనికి
దెలియన్। జేసిముదమొందజేసెటి। దేశికుడే ముఖ్యుడనుచు।
తెలుసు కోవోయీ। కనియతగాణ్ని కలుసు కోవోయీ। చేసేను
దయతో నీయాశసంపూర్తిట్లు। వ్రాసైతె వేసుకొచూచేవు తార్కాన।
తెలుసుకోవోయీ। కనియతగాణ్ని। కలుసుకోవోయీ॥ 195**

## ప్రతిపదార్థము

చూచి=తనయొద్దకు మోక్షాపేక్ష కోరి వచ్చిన శిష్యుని ప్రవర్తనను నిశితముగా పరిశీలించి మదితెలిసి=అతని మనస్సును, అభిప్రాయమును, లక్ష్యమును కూడా గమనించి

శిష్యుని ఆశయమునకు=శిష్యుని ఆలోచనను, లక్ష్యమును దృష్టిలో వుంచుకొని
తగినబోధను = అతనికి సరిపడు బోధనా విధానమును
అతనికి తెలియజేసి = వానికి ప్రబోధించి
ముదమందజేసేటి = సంతోషమును కలిగింప జేసేటి
దేశికుడే = సద్గురుమూర్తియే
ముఖ్యుడనుచు = చాలాగొప్పవాడని
తెలుసుకోవోయి = అతని సామర్థ్యమును బాగుగా గుర్తించుము
కని = బాగా విచారించి
అతగాడ్ని = అట్టి మహాత్ముని
కలుసుకోవోయి = నీకు ఎంత దూరంలోవున్నా వెతికి వెతికి ఆశ్రయించుము
చేసేను దయతో = నీ ఆశయమును, లక్ష్యమును గమనించి నీయందు అనుగ్రహముతో నీలక్ష్యమును నెరవేర్చగలడు
నీఆశ సంపూర్తి=ఈ విధముగా అతని నాశ్రయించుటచేత నీలక్ష్యము నెరవేర్చును
ఇట్లు వ్రాసితి = ఈ అనుభవముతో మనసులో దృఢపరచుకొని
అయితే వేసుకో = నీకంగీకారమైతే పాటించు
చూసేవు తార్కాణం = భవిష్యత్తులో నీకీవిషయం అనుభవంలోకి రాగలదు

## తాత్పర్యము

పరిపూర్ణబోధ యందు ఆరూఢత చెంది గురువాజ్ఞాను సారంగా ఆదర్శప్రాయుడై తాను గ్రహించిన ధర్మమును లోక కల్యాణము కొరకు ప్రబోధించు ఉనికి కలిగిన మహాత్ములు తమను ఆశ్రయించిన వారి శారీరక, మానసిక లక్షణములు, ఆశయము, జీవిత లక్ష్యము మొదలైన విషయములు నిశితముగా పరిశీలించి, అతని యోగ్యత పాత్రత దృష్టిలోవుంచుకొని అతను సంతోషపడేలా తనకు తెలిసిన ప్రబోధను వారికుపదేశించ గలిగే సద్గురువే ప్రముఖముగా చెప్పుకోతగినవాడు అనగా మోక్షాపేక్షకోరి భిన్న భిన్న మార్గములలో అనగా కర్మ, భక్తి, యోగ, జ్ఞాన మార్గములలో ప్రేమ కలిగి అందుకు అనుగుణ్యముగా ఈ పరిపూర్ణ భావమును గ్రహించవలెనని

వారాశించుటలో వారాశించిన విధమునకు సరిపడా బోధింపగలుగు గురువే సమర్థుడు అనిగ్రహించు. అతను ఎంత దూరంలో వున్నా అన్వేషించి అతని నాశ్రయించి వారి అనుగ్రహం పొందగలిగినచో వారి జీవితములు ధన్యములగును. ఇది అత్యంత అనుభవ నీయమైన అంశము. "తద్విద్ధి ప్రణిపాతేన" అను శ్లోకము ద్వారా భగవద్గీత యందు ఈ అంశమును అర్జునునకు శ్రీకృష్ణుడు ఉపదేశించి యున్నాడు. కావున ఇవన్నియు జాగ్రత్తగా దృష్టిలో వుంచుకొని, అందలి విధి విధానమును అనుభవములోనికి తెచ్చుకో వలసి వున్నదని గ్రహించుము అని భావము.

కం॥ తనభార్య రూపురేఖలు। తనపుత్రుల సద్గుణములు
తనసంపదయున్। తన పెరటి మందు చెట్లులు। తనగ్రామపు
సాధు జనులు। తనకూ మెప్పొనా। యీ యిల లోయెం। తటి
వారికైనా। వినలేదెనీ వాహల్యనుజూచి మోహించె।
ఘనవాహనుండు చక్కని భార్యగలిగుండి। తనకూమెప్పొనా।
యీ యిల లోయెం। తటి వారికైనా॥ 196

## ప్రతిపదార్థము

తనభార్య రూపు రేఖలు = తన భార్య అందచందములు
తనపుత్రుల సద్గుణములు=తన కుమారుల ఆదర్శవంతమైన గుణగణములు
తనసంపదయున్ = తనవద్ద నిల్వవున్న ఐశ్వర్యము
తన పెరటిమందుచెట్లు = తనింటియందు చుట్టూవున్న స్థలములో వేయబడిన ఓషధశక్తి కలిగించు వృక్షములు
తన గ్రామపు సాధుజనులు = తను నివసించే గ్రామమందు నివసించు ఆధ్యాత్మిక వేత్తలు, మహాత్ములు
తనకు మెప్పొనా ఇలలో ఎంతటి వారికైనా = ఈ భూమి మీద నివసించువారు ఎంతటి వారైనా సంతృప్తి కలిగి వుంటారా?
వినలేదే = ఎందుకనగా

ఘనవాహనుండు = గొప్పదైన తెల్ల ఏనుగును వాహనముగా కలదేవేంద్రుడు
అహల్యను జూచిమోహించె = గౌతమ మహర్షి భార్య అయిన మహాపతివ్రత అగు అహల్యను కోరియుండెను
చక్కని భార్య కలిగుండీ=మహా సౌందర్యవతియైన శచీదేవిని భార్యగా పొందియుండికూడా

## తాత్పర్యము

మానవ స్వభావము విలక్షణమైన ప్రవృత్తులు కలిగి వుండును. తనకు సంక్రమించిన వస్తువులు, వ్యక్తులతో సంతుష్టి చెందక అత్యాశకు లోనై ఆనందమైన జీవిత విధానమును కోరికలచే దు:ఖమయము గావించు కొనును. ఈశ్వర సృష్టిలో శాంతి, ఆనందములు జీవిత లక్ష్యములుగా చెప్పబడుచున్నవి. అందిన దానితో తృప్తి కలిగి జీవించుట చేత మాత్రమే అవి పొంద గలము . ఈ కందార్థమునందు ఈ మానసిక ప్రవృత్తిని వివరిస్తూ సౌందర్యవతి యైన భార్య, సద్గుణ సంపన్నులైన కుమారులు, అనుభవించుటకు వీలుగా ఐశ్వర్యము, తను నివసించు పరిసర ప్రాంతమందలి ఓషధ గుణములు కల్గిన వృక్షములు, తన కందుబాటులో మహనీయులు వున్నా సంతృప్తి చెందక ఆశతో, ప్రయత్నముతో అశాంతిని దు:ఖమును కల్గించు కొంటారు కొందరు. పురాణ సాహిత్యమందు అష్టదిక్పాలకులకు యజమానియై, స్వర్గ సంపదలతో తుల తూగుచు, మహాసౌందర్యవతియైన శచీదేవిని భార్యగా పొంది యుండి, అతి పెద్దదైన ఐరావతమను పేరుగల ఏనుగును వాహనముగా కలిగుండి కూడా, గౌతమముని పత్నియైన పతివ్రత అయినఅహల్యను పొందగోరి శాపగ్రస్తుడై అనేక దు:ఖములు పొందిన ఇంద్రుని విధానము చెప్పబడుచున్నది.

కం॥ విననేర్చి చెప్పనేర్చిన। మనుజులకే దీనిలోని మర్మము దెలసున్।
విన జెప్ప నేరకుండిన మనుజులు ఈ బోధలోని మర్మమెరిగేరా
దీనందుండె ధర్మామెరిగేరా। జనులె కొబ్బరి కాయతిననేర్పు
గలవారు। తిననేర్చునా కోతి। తనకాకాయబ్బీన। మర్మమెరిగేరా।
దీనందుండే। ధర్మామెరిగెరా॥ 197

## ప్రతిపదార్థము

విననేర్చి చెప్పనేర్చిన=వినుటయందు, చెప్పుటయందు ప్రావీణ్యము కల్గియుండుట
మనుజులకే = యోగ్యత కల్గిన వారికే
దీనిలోని మర్మము దెలుసున్=ఈ గ్రంథమందలి రహస్యము తెలిసికొనగలరు
వినజెప్ప నేరకుండిన మనుజులు = వినుటయందు, చెప్పుటయందు అట్టినేర్పరితనము లేనివారు
ఈ బోధలోని మర్మమెరిగేరా=పరిపూర్ణ భావమందలి రహస్యము గుర్తింపగలరా?
దీనందుండే ధర్మమెరిగేరా = ఈ ధర్మము యొక్క గొప్పతనము, జీవన విధానము గుర్తింపగలరా?
జనులె కొబ్బరికాయను తిననేర్పు కలవారు = కొబ్బరికాయ, అందలి భాగములు వాటి విలువలు, ఉపయోగించు విధానము జ్ఞానము ఎక్కువగా ప్రకాశించు మానవులకే సాధ్యము
తిననేర్చునా కోతి తనకా కాయబ్చీన = కొబ్బరికాయ కోతికి లభించినా దాన్ని సమగ్రంగా అనుభవించు విధానము దానికి తెలియదు.

## తాత్పర్యము

జనన మరణ రహిత విధానమునకు పరిపూర్ణ బోధ ఉన్నతమైన మార్గంగా సూచింపబడు చున్నది. బోధ అనగా మెలకువ అని అర్థము. కలయందు వుండి కలదృశ్యములతో కలవరించువానిని మెలకువలో గలవాడు తట్టి లేపినచో మెలకువ స్థితి చెంది, కల అందలిదృశ్యములు నిజముకావని, భ్రాంతి జన్యములని ఎట్లు దృఢపరచుకోగల్గునో ఆవిధంగానే బోధ చేతనే భ్రాంతి రహిత విధానమును పెంపొందించుకొనుటను సద్యోముక్తి అను పేరచెప్పబడుచున్నది. అందుచేత వినడమే తరించడం. అపుడె వారలెప్పుడుగంటె అనికూడా చెప్పబడు చున్నది. మనస్సును ఏకాగ్రత చేసినగాని విన్న విషయము అనుభూతము కాదు. ప్రాథమికదశ, మాధ్యమిక దశ, ఉన్నత దశల్లో ఉన్నజ్ఞానము విస్తరింప చేసి వస్తు నిశ్చయ జ్ఞానము

ద్వారా శబ్దము, శబ్దార్థమును వెంటనే గుర్తించ గలిగేలా చేయుట బోధనా విధానమందలి ప్రత్యేక లక్షణము. విన్నది గుర్తించి, గుర్తించిన దానిని వెంటనే చెప్ప గల్గుట అనునది అనుభవనీయము. అనగ అనగ రాగమతిశయిల్లుచు నుండు అన్నట్లుగా చెప్పగా చెప్పగా బోధయందు గట్టిదనము కలిగి సందేహ నివృత్తి కల్గించుకున్నట్లు ఆరూఢపరచుకొనుటలో స్థితియందు సహజత్వము కలిగి విన్నది విన్నట్లుగా చెప్పగల్గుచు గుర్తించిన దానిని తన భావనలో స్థిరపరచుకొని, తాను లేకపోవు విధానమునందు సహజత్వము కలిగి అందుకు తగిన విధముగా నడవగలుగు నేర్పరి తనము కూడా సహజముగా సిద్ధించును. ఇది అంతయు గురువు అనుగ్రహము ద్వారా వస్తు నిశ్చయ ప్రబోధమునందు మాత్రమే కలుగ గలదు. తన తెలివి తేటలతో మర్మమును గ్రహింప గలుగ వచ్చును. కాని ధర్మమనునది జీవన విధానము నందు మాత్రమే సిద్ధింపగలదు. ఇందు ఉదాహరణగా ఈ కందార్థమునందు కొబ్బరికాయను (నారికేళము) ప్రమాణముగా గైకొని ప్రజ్ఞావంతుడైన మనిషికి ఆకాయ లభించినపుడు అందలి ప్రతి భాగమును తన తెలివి తేటలచే ఉపయోగ పడులాగున మలచు కొనును.ఎట్లనగా కొబ్బరి, పెంకు, పీచు, కొబ్బరిఫలము, అందలి నీరు వేటికవి ఉపయోగ పడేలాగున చేసుకొనును. అదే కాయ చిన్న మనసు కలిగిన కోతికి లభించినపుడు అన్ని ఫలములవలె దానిని నోటితో కొరికి ఫలమును ఆస్వాదించలేక విడిచి పెట్టును. అందుచేత మర్మము, ధర్మము రెండూ కలిపి గురు వాక్యాను సారముగా పాటించి పోషించ గలిగి నపుడే ఈ గ్రంధమందలి రహస్యము దృఢపడ గలదని తెలియ వలెను.

కం॥ నేనెంతలెస్సజదివిన। దీనినితెలియంగగలరెదేశిక వర్యున్।
పూని సేవించకుండిన। మానవులదియెట్లనన్న। మరివినవోయీ।
నామాటందుమనసుంచవోయీ। నానాకాలములోని
వర్షాముఏకబిందు। వైనమిట్టనునిల్వ దదినిశ్చయమెకద। మరి
వినవోయీ। నామాటందు। మనసుంచవోయీ॥ 198

## ప్రతిపదార్ధము

నేనెంత లెస్స చదివిన = దుర్లభమైన పరిపూర్ణ భావమును ఈగ్రంథ రచన ద్వారా నేనెంత ఎక్కువగా చేసి చెప్పగలిగినను

దీనిని తెలియంగ గలరే = దీనియందు ఆరూఢత పొందగలరా?

దేశికవర్యున్ = అచల పరిపూర్ణ సద్గురుని

పూని = ఆశ్రయించి

సేవించకుండిన = ఆయన నిర్దేశించిన జీవన విధానం పాటించకుండా

మానవులు = మనసనే పదార్థం విశేషంగా కలవారు

అది ఎట్లనన్న = అది ఎలాగున సాధ్యంకాదో

మరి వినవోయి = చక్కగా వివరించి చెపుతాను గ్రహించ వలసినది

నామాటందు మనసుంచవోయి = నేను వివరించి చెపుతున్నవిధానమందు చక్కటి అవగాహన కలిగించు కొనుము

వానాకాలంలో = వర్షాకాలంలో

వర్షము = నీటి ప్రవాహము

ఒక బిందువైన మిట్టను నిలువదు = కొండపైన ఒకబిందువైన నిలబడక జారిపోవును

నిశ్చయమె కదా = దీనియందు ఎట్టి సందేహము లేదు కదా!

## తాత్పర్యము

జన్మరహిత విధానమునకు పరిపూర్ణ బోధయేసరైనమార్గమని గుర్తించి నేను అట్టి భావమును అందరికీ అందుబాటు లోకి తీసుకు వచ్చుటకై ఈ కందార్థరచన గావించినాను. ఇందు ఈ ధర్మమును గూర్చి, వాటి స్వరూప స్వభావముల గూర్చి విపుల పరుస్తూ అందు కనువుగా పలు దృష్టాంతములు ద్రాష్టాంతములు పేర్కొంటూ ఈ భావమును విడమరచి రచించి యున్నాను. ఏలననగా ఇందు ప్రతిపాదింపబడిన అంశములు మనో వాక్కుల కందనివై కేవలం గురుకృపచే మాత్రమే అవగాహన కలిగించు కొనవలసి వున్నది. గ్రంథ పరిశీలనలో విషయ

నిరూపణకాగలదు. ఆపై గురువును ఆశ్రయించి చతుర్విధ శుశ్రూషల ద్వారా గురువును మెప్పించి వారి అనుగ్రహము ద్వారా మాత్రమే అరూఢత చెందవలసి వున్నది. ఇట్టి విధానము రహస్యమై ఉపదేశ విధానమందు మాత్రమే గురు శిష్యన్యాయముగాసాధ్యమగుచున్నది. అట్లు గాక కేవలం గ్రంథ శ్రవణ పరిశీలన ద్వారా మాత్రమే ఈ గ్రంథ ఫలము సిద్ధింపదు. ఎట్లనగా మేఘ మండల మందున్న జలధారలు వర్షరూపంగా బిందు రూపంలో ఎత్తైనకొండ శిఖరంపై మాత్రమే పడినను, అందు నిలుచుటకు తావులేక నదీ నదములై జారి వచ్చి మరల సముద్ర గర్భమున చేరును. ఈ ఉపమానమందు ఇమిడ్చిన రహస్యమేమనగా అహంకారముతో కూడిన వ్యక్తి మనస్సు కొండ శిఖరము తోను, గురుప్రబోధను వర్షము తోనూ పోల్చ బడినది. అహంకార రాహిత్యమే పరిపూర్ణభావము లక్ష్యము అని తెలియ వలెను.

**కం॥ రతికొరకుగాదెసతిపతి। కతిహితముగ సేవజేయు నటు వలె బోధ। స్థితినీకుకుదురుటకుస। మ్మతితో గురుసేవ జేయుమా। నీతివంతా। అభిమానాము। పోనినీదంతా। అతనీకి దయ వస్తే అరనిమషమునబోద। స్థితి నీకు కుదిరించు సిగ్గు। విడచి కొల్వుమా। నీతివంతా అభిమానము। పోనినీ దంతా॥ 199**

## ప్రతిపదార్థము

నీతివంతా = చక్కటి జీవనవిధానము విచక్షణా జ్ఞానము కలవాడు
సతి = అగ్ని సాక్షిగా వివాహమాడిన భార్య
పతికి = దైవ స్వరూపుడైన తన భర్తకు
అతిహితముగా = అత్యంత శ్రద్ధ, ప్రేమ, భక్తులతో
సేవచేయు = సపర్యలు చేయుచుండును
రతికొరకు గాదె = కేవలం సంతానాపేక్షతో మాత్రమె, వంశాభివృద్ధికై
అటువలె = ఆవిధంగానే
బోధ = పరిపూర్ణబోధ
స్థితినీకు కుదురుటకు = పరిపూర్ణమెరిగి ఎరుకనెరిగి ఎరుకను మానుట

అనుస్థితి కుదురుటకు
సమ్మతితో = అత్యంత భక్తి శ్రద్ధలతో, అర్పణ భావముతో
గురుసేవ చేయుము = గురువాజ్ఞాను ప్రకారము నాలుగు శుశ్రూషలు పాటించువాడు
అభిమానము పోనీ నీదంతా = ఎట్టి స్వాభిమానమునకు లోనుకాకుండా సర్వార్పణ బుద్ధితో సేవించిన ఎడల
అతనికి దయవస్తే = నీ సేవలకు ప్రసన్నుడైతె
అరనిమషముననే = చాలా స్వల్ప కాలములోనే
బోధస్థితి నీకు కుదిరించు = పరిపూర్ణ స్థితి నీకు కలిగించ గలడు
సిగ్గు విడచి కొలువుమా = ఎట్టి అభిమానమునకు లోనుకాకుండా గురువును సేవించుము

## తాత్పర్యము

పరమాత్మ సృష్టి యందు పరిణామ క్రమమందు సృష్టిరచన కొరకు స్త్రీ పురుష ఉపాదులు నిర్మింపబడినవి. సప్తధాతు మయమైన శరీరముచే అన్నరూపమైన శక్తి ద్వారా ఈ స్త్రీ పురుషులు పరిణామ క్రమమునకు కారణమగుచున్నారు. ఇందు స్త్రీ ఉపాధి చాలా విలక్షణమైనది. మాతృత్వము చెందడమే ఆ ఉపాధి లక్ష్యమై యున్నది. ఇది పురుషుని యందలి శక్తిచేతనే సాధ్యము. ధర్మ శాస్త్రప్రకారము వివాహ సంస్కారము ద్వారా ఈ స్త్రీ పురుషులు భార్యాభర్తలుగా మారి సంతాన వంతులు కావలసి యున్నది. వీరు సంతాన వంతులైన పిమ్మటనే ఆ ఉపాధులు సార్ధకము కాగలవు. ఇట్టి ప్రయోజనము కోరి భార్య తన పతివ్రతా ధర్మము చే భర్తనే ఆశ్రయించి ఉండి, అతని ప్రేమ, వాత్సల్యముల ద్వారా సంతానవతి కాగలుగుటకు ఏఏ ప్రయత్నములు చేయుచుండునో, అందుకు అవసరమగు విధి విధానము నెట్లు పాటించునో, ఆవిధంగానే పరిపూర్ణ బోధ అత్యంత రహస్యమై గురుశిష్య న్యాయ మందు గురుకృప ద్వారా మాత్రమే సాధించ వలసి వున్నది. అందులకై శిష్యుడు సర్వార్పణ భావంతో

గురువు నాశ్రయించి, అతని అనుగ్రహము ద్వారా మాత్రమే ఇట్టి స్థితి పొందగలుగును. అట్టి గురువు అనుగ్రహముచే తక్కువ కాలంలోనే అత్యంత కష్టమైన పరిపూర్ణ స్థితి పొందగలుగను. ఇందుల కెట్టి సందేహము లేదు. కావున ఎట్టి స్వాభిమానమునకు లోనుగాక సర్వాత్మ సమర్పణ భావముతో గురుర్వాక్యం యధాతధంగా జీవించుట చేత మాత్రమే ఇట్టి స్థితి పొందుట సాధ్యమగునని తెలియ వలెను.

**కం॥ పెత్తనమునయేనుంగిల। చెత్తనుదినవలసె చీమ చిన్న తనమునన్। హత్తుకొనితినును చక్కెర। యిత్తరియీరెంట్లో నీకు। యిష్టామేదైతే। చేకొను మదె। సృష్టామిదైతే పెత్తనమున చేటె పెంపొందుచుండూను। చిత్తాము లోదెలియ। చిన్న తనమె మేలు। యిష్టామేదైతే। చేకొను మదె। సృష్టామిదైతే॥ 200**

## ప్రతిపదార్థము

పెత్తనమున = పెద్దరికముచే
ఇల = ఈభూమిలో
ఏనుగు = జంతు జాలములో అత్యంత బలమైన శక్తి కలిగినది
చెత్తను తినవలసె = చెఱుకు గడలను ఆహారముగా స్వీకరించెను
చీమ = క్రిములలో అత్యంత సూక్ష్మమై తెలివి కలిగినది
చిన్నతనమునే = పుట్టుకతోనే
హత్తుకొని తినును చక్కెర=చెఱుకు గడయందు గల శ్రేష్టమైన మధుర పదార్థమును
ఇత్తరి = ఈ విధముగా
ఈరెంట్లో = పైన పేర్కొన్న రెండు పదార్థాలలో
నీ కిష్ట మేదైతే = నీకు ఏది నచ్చునో
చేకొనుము = స్వీకరించుము లేక అనుసరించుము
అదే స్పష్టమైతే = స్పష్టమైన మార్గమును నిర్దేశించు కొనుము
పెత్తనమున చేటె పెంపొందుచుండును = పెద్దరికము చేత అనేక కష్ట నష్టములు కలుగును

చిత్తములో తెలియ = బాగా ఆలోచించగా
చిన్నతనమె మేలు = వినయ విధేయతలతో నిరహంకారముగా ఉండుటయే మేలైన విషయమని గ్రహించుము

## తాత్పర్యము

అడవిలో జీవించు జంతుజాలములో అత్యంత పెద్ద ఉపాధి కలది ఏనుగు. ఇతర జీవుల కంటె శరీర నిర్మాణములో, బలంలో అత్యంత పెద్దజంతువుగా చెప్పబడుచున్నది. అది రోజువారీగా తీసుకొను ఆహారము చెఱకు గడలు. అవి నమలి అందలి రస మాధుర్యమును గ్రహించును. క్రిములలో అత్యంత సూక్ష్మమైనది, బలహీనమైనది చీమ. ఇది పంచదార యందలి పంచదార కణమును హత్తుకొని అందలి మాధుర్యమును సరా సరిగా అనుభవించును. ఈ రెండు అంశములయందు గల విశేషమును చక్కగా విచారించి ఒక స్పష్టమైన మార్గమును నిర్దేశించు కొనుము. పెద్దతనము, బలము కలిగి ఉండి కూడా శ్రేష్టమైన ఆహారమును అనుభవించు విధానమును, అత్యంత చిన్నఉపాధి కలిగి శ్రేష్టమైన ఆహారమును గ్రహించు విధానమును గమనించినచో పెద్దరికముచే అనేక కష్ట నష్టములు కలుగుటయు, చిన్నతనముచే (నిరహంకారముచే) ఎట్టి శ్రమ లేక సరాసరి శ్రేష్టమగు పదార్థము స్వీకరిచుటయు తెలియు చున్నది. అహంకార అభిమానములతో కూడినది పెద్దరికము. వినయ విధేయతలతో నిరహంకారమైనది చిన్నతనము. పరిపూర్ణ బోధయందు ఆదర్శ వంతమైన జీవితమును గడుపు వారు నిరహంకారులై జీవించెదరు. అందుకు జగద్గురువగు శ్రీకృష్ణ భగవానుడే ఆదర్శమని తెలియ వలెను.

కం॥ ఇవి వినుమనినను సుజనులు। చెవియొగ్గెదరివియు స్పష్టజేసి
కృతికిబల్। చవిబుట్టింతురదెట్లన। శివుడు కళానిధిని చక్క।
జేసేనలేదా। నీమదిశంక। బాసేనలేదా। అవనిలో
శ్రీరాముడవగుణి నాహల్య। నెవరేమీయున। కుండ।
సవరించిసుగుణీగ। జేసేన లేదా। నీమదిశంక। బాసేనలేదా॥201

## ప్రతిపదార్థము

ఇవి = జన్మ రహిత విధానమునకు పరిపూర్ణ భావమును మార్గంగా సూచిస్తూ వ్రాయబడిన కందార్థముల గ్రంథము
వినుమని నను = దీని అవసరం ప్రయోజనాన్ని గుర్తింప జేసి
సుజనులు = చక్కటి భావన జీవనం కలవారు (సత్పురుషులు)
చెవియొగ్గెదరు = నా ప్రార్థనను మన్నించి శ్రద్ధతో ఈ గ్రంథము నందలి విషయ నిరూపణ గ్రహించెదరు
ఇవియు = ఈ గ్రంథమును
సృష్టు జేసి = చక్కగా అవగాహన కలిగించుటకు
కృతికి = ఈ గ్రంథమునకు
బల్ చవి బుట్టింతురు = మెరుగులు దిద్ది ఈ గ్రంథమున కింకనూ విలువనూ ప్రచారాన్ని పెంపొందిస్తారు.
అది ఎట్లన = ఆ విధానము ఎట్లనగా
శివుడు కళానిధిని చక్కచేసెనా లేదా = పరమేశ్వరుడు శాపగ్రస్తుడైన చంద్రుని తన శిరస్సున ధరించినట్లుగా
నీమది శంక బాసెనా లేదా = ఈ ఉదాహరణ ద్వారా నీమనసుకు కలిగిన సందేహం విడిచిపెట్టు
అవనిలో = ఈ భూమండలంలో
శ్రీ రాముడు = అవతార పురుషుడైన శ్రీరాముడు
అవగుణి నహల్యను = భర్త శాపముచే రాయిగా మారిన అహల్యను
ఎవరేమీ అనకుండా = ప్రపంచంలో ఆక్షేపించుటకు వీలులేకుండా
సవరించి = శాప విముక్తి గావించి
సుగుణిగా జేసెనా లేదా = మహా పతివ్రతగా తీర్చి దిద్ద బడినట్లుగా

## తాత్పర్యము

జన్మ రాహిత్యమునకు పరిపూర్ణ బోధ ఒక్కటియే సరియైన మార్గము. ఇట్టి భావము అందరికీ అవసరమని భావించి ఈ కందార్థ

రచన యందు ఆ విధి విధానం నిర్దేశిస్తూ ఈ గ్రంధం వ్రాయబడినది. ఈ గ్రంథమును సత్పురుషులకు పరిశీలించవ లసినదిగా ఇవ్వబడినచో ఈ గ్రంథమును చక్కగా పరిశీలించి, ఇంకనూ సొగసులు కల్పించి, ఇందలి భావములకు ఇంకనూ మెరుగులు దిద్ది రసవత్తరము చేసి సమాజంలో దీని అవసరాన్ని, ప్రయోజనాన్ని అందరూ గుర్తించ గలిగేలా చేస్తారు. ఎట్లనగా షోడశ కళా ప్రపూర్ణుడై, ఓషధీ స్వరూపుడైన చంద్రుడు శాపగ్రస్తుడై కుష్టువ్యాధి తో బాధ పడుతూ కళావిహీనుడై నప్పుడు దేవాది దేవుడైన పరమేశ్వరుడు వానిని శాపవిముక్తుని గావించి తన శిరస్సు నందు ఆభరణముగా ధరించి చంద్రకళాధరుడై తనతోపా టుగా చంద్రునికి కూడా పూజనీయత కల్పించి యున్నాడు. ఇందులో ఎవరికీ ఎట్టి సందేహము లేదు కదా! ఆ విధంగానే గౌతమ మహర్షి భార్య దేవేంద్రునిచే పరాభవింపబడి, భర్త యొక్క శాపమునకు గురై శిలగా పడియున్నపుడు అవతార పురుషుడైన శ్రీ రాముడు తన పాదధూళిచే రాతిని నాతిగా మార్చి మహా పతివ్రతలలో అహల్యను గూడా ఒకత్తిగా గుర్తింప గలిగేలా శాపవిమోచనం గావించారు.

**కం॥ పుట్టింటబిడ్డబహుగా। దిట్టైయుండినను యెవరు। దిట్టరు భువిలో। పుట్టింటివారుకోడలు। దిట్టైనను అత్తవారు। దిట్టేరు సుమ్మీ॥ చేతుల కొద్ది। గొట్టేరుసుమ్మీ॥ అట్టుంబలెనె బహుదిట్టైన శిష్యాని। తిట్టాడు గురుమూర్తి। వట్టీవారు జూస్తె తిట్టేరుసుమ్మీ॥ చేతులకొద్దీ। గొట్టేరుసుమ్మీ॥ 202**

## ప్రతిపదార్థము

పుట్టింటి బిడ్డ = పుట్టింటి యందుండు ఆడపిల్ల

బహుగాదిట్టైయుండినను = అత్యంత చురుకుదనము సామర్థ్యము కలిగి యుండినను

ఎవరూ దిట్టరు భువిలో = ఈ సమాజంలో ఆమె నెవరూ ఆక్షేపించరు

పుట్టింటివారు = తల్లితండ్రులు

కోడలుదిట్టైనను = కోడలుగా సామర్ధ్యములన్ని కలిగి, కోడలుగా అత్తవారింటికి వెళ్ళినపుడు

అత్తవారు = అత్తగారు, ఆడపడుచులు

తిట్టేరుసుమీ = తక్కువగా అంచనావేసి తప్పులెంచుతూ వుంటారు

చేతులకొద్దీ కొట్టేరు సుమీ=సందర్భాన్నిబట్టి శారీరకంగా బాధించడంకూడా చేస్తారు

అట్టుంబలెనే = ఆవిధంగానే

బహుదిట్టైన శిష్యుని = బోధను బాగాదృఢపరచుకొని, అందుకు సరిపడా జీవితం గడుపు నేర్పరితనం సంపాదించిన శిష్యుని

తిట్టడు గురుమూర్తి = అట్టి శిష్యుని ప్రవర్తనయందు ఎట్టి లోపమున్నను గురుమూర్తి ఎంచడు

వట్టివారు చూస్తే = ప్రాపంచిక జ్ఞానము కలవారుచూస్తే

తిట్టేరుసుమ్మీ, కొట్టేరు సుమ్మీ = వారి నడతను విమర్శిస్తారు, నిందిస్తారు

## తాత్పర్యము

సృష్టి విధానమందు స్త్రీ ఉపాది చాలా విలువైనది. క్షేత్రముగా చెప్పబడి వంశాభివృద్ధికి కారణంగా వున్నది. కావున సంతానాభిలాషచే బ్రహ్మ చర్యవ్రతమందున్న పురుషునికి కన్యాదాన రూపంలో ఆడపిల్ల తల్లి తండ్రులు వరునికి దానంగా ఇచ్చి, ఆ అమ్మాయిపైనున్న హక్కును ఒదులుకొని అల్లునికిసమర్పించెదరు. తమ పెంపకంలో పిల్లను అన్నివిషయాలలో ప్రావీణ్యత సంపాదించేలా చేసినా, ప్రవర్తనలో చిన్న చిన్న లోపాలు గమనించిన తల్లి తండ్రులు మనసులో అట్టి లోపాలు సరిపెట్టు కుంటారు. అత్తగారింటికి వెళ్ళినపుడు, అక్కడ అమ్మాయి ఎంత ప్రజ్ఞా పాటవాలతో ప్రవర్తించినా మాటలో, నడతలో ఏదోలోపం ఎంచి హింసిస్తారు. ఇచ్చట అత్తవారిల్లు, పుట్టిల్లు అను స్థాన భేదముచే పిల్లసామర్ధ్యము సరిపెట్టు కొనుట, సరిపెట్టు కొనకపోవుట ఏర్పడుచున్నది. ఈ విధంగానే పరిపూర్ణ బోధయందు శిష్యుడు గురువు చెంతకు చేరి నాలుగు శుశ్రూషలచే అతనిని మెప్పించి ఉపదేశ పద్ధతి యందు గురువు అనుగ్రహం

ద్వారా పరిపూర్ణబోధ యందు ఆరూఢత చెంది తన ప్రవర్తన ద్వారా గురువునే కాక సమాజంలోని వారందరి చేత మెప్పు పొందేలా జీవిస్తాడు. "మమాత్మా సర్వభూతాంత రాత్మ" అను దృష్టిబూని భుక్తి ముక్తి క్రియలయందు పరిపూర్ణత్వం సాధించి, అంటీ అంటని రీతిలో అశరీరుడై ఆదర్శ ప్రాయంగా సమాజంలో నడయాడు చుండును. ఇట్టి ప్రవర్తన యందు ప్రాపంచీకమందు ఏదైనా లోటు పాట్లు జరిగిన, అవి గురుధర్మమునకు, గురువుకు అప్రతిష్ట తెచ్చులాగున ఉన్నా కూడా గురుమూర్తి వానియందు తప్పెంచడు. అట్టి ఆరూఢత అవగాహన లేనివారు అట్టి శిష్యుని ప్రవర్తన యందు లోపము లెంచుచూ నిందిస్తూ ఉంటారు.

**కం॥ అందముగఘనులు మెచ్చెద। రెందుకు మెచ్చెదరు దీన్ని యితర జనంబుల్। చందురుడుదయంబందిన। సింధువుచెల రేగినట్లు। చెలగూనె చెర్లూ। కోనేర్లునూ। తులుబావు లేర్లూ। మంద యానల పొందు మగవారెనుతిజేతు। రెందూకు నుతిజేతు రిలషండ పురుషూలు। చెలగూనెచెర్లూ। కోనేర్లూనూ। తులు బావులేర్లూ॥ 203**

## ప్రతిపదార్థము

ఘనులు = గొప్పవారు, పరిపూర్ణ బోధయందు ఆరూఢత చెందినవారు
అందముగా = సంతోషముతో
దీన్నిమెచ్చెదరు = ఈ గ్రంధము యొక్క గొప్పతనం గుర్తిస్తారు
యితర జనంబుల్ = సామాన్య దృష్టి కలిగిన ప్రాపంచీకులు
ఎందుకు మెచ్చరు = దీనిని ప్రమాణంగా ఎందుకు స్వీకరించరు?
చందురుడుదయం బొందిన = చంద్రుడుదయించగానే
సింధువు = సముద్రుడు
చెలరేగినట్లు = ఉప్పొంగినట్లు
చెలగునె = ఉప్పొంగవు
చెర్లు = చెరువులు

కోనేర్లు = సరస్సులు
నూతులు = భూ గర్భమందు గల జలములు
బావులేర్లు = చిన్నచిన్న నదీ నదములు
మందయానల = అత్యంత సౌంధర్యవంతులైన స్త్రీ మూర్తుల
పొందు = సమాగమము
మగవారె నుతి జేతురు = పురుషులే గుర్తించెదరు
ఎందుకు నుతి చేయరు? = ఎందుకు వారిని సంతోష పరచలేరు?
ఇల = ఈ భూమండలంలో
షండ పురుషులు = అనగా నపుంసకులు

## తాత్పర్యము

జన్మ రహితము నకు మార్గముగా చెప్పబడుచున్న పరిపూర్ణ సిద్ధాంతము ఈ గ్రంథరచన ద్వారా చెప్పబడుచున్నది. సత్పురుషులైన వారు సహృదయముతో దీనిని చదివి, ఇందలి భావములు గుర్తించి, గ్రంథమును ఆదర్శవంతముగా ఉన్నదని పేర్కొందురు. అల్పమనస్కులు ఈ గ్రంథమునందలి లోపములనే ఎత్తి చూపిస్తారు. షోడశ కళా ప్రపూర్ణుడై, ఓషధ స్వరూపుడై, అమృత బిందువులను చిందించు చంద్రోదయమును జూచి. జలనిధులకు స్థానమైన ఒక్క సముద్రుడు మాత్రమె ఉప్పొంగు చుండును. జలాశ్రయములైన నూతులు, చెరువులు, బావులు, కోనేర్లు నదులు ఉప్పొంగవు. అవియు గాక సౌందర్య వంతులైన స్త్రీలతో పురుషులైనవారు మాత్రమే సుఖ జీవనం పొందగలరు. కాని నపుంసకులు పొందలేరు అనితెలియ వలెను.

కం॥ కాకంబులు సంపూర్ణ। తటాకస్థజలంబులెట్లు త్రాగక తృషచే।
గైకొనునో కుంభ జలము। ట్లీ కలియుగమందు। దుష్టులింపుమీ
రగనూ। నిల్వరుబోధ। కంపూబారిననూ। మీకూ దీనికె లంకె
మాకేలయిట్టి చీకాకు కొక్కోకమైతె గైకొందు మందూరు।
యింపూమీరగనూ। నిల్వరు బోధ। కంపూబారి ననూ। 204

## ప్రతిపదార్థము

కాకంబులు = కాకులు
తృషచే = దాహార్తిచే
సంపూర్ణ తటాకస్థజలంబులు = సమృద్ధిగా, పరిశుద్ధంగా నిండి యున్న చెరువు (నది) నీరు
ఎట్లు = ఏ విధంగా
త్రాగక = పానము చేయక, స్వీకరించక
ఎట్లు గైకొనునో కుంభ జలములు = కుండలో నిల్వయుండిన మురికి నీటిని ఎట్లు త్రాగునో
అట్లు = ఆవిధంగా
కలియుగమందు = ఈకలికాలమందు
దుష్టులు = ఈషణ వాసనలకు లోనై పారమార్థిక చింతన లేనివారు
యింపు మీరగను = ఎంతో సంతోషముతో
నిల్వరు బోధ = జన్మ రాహిత్యమునకు మార్గంగా చెప్పబడుచున్న పరిపూర్ణభావం అందుబాటులో ఉండగా
కంపు బారినను = వినుటకు ఇష్టపడక దూరముగా తొలగి పోవుదురు
మీకూ దీనికి లంకె = పనిపాటలు లేని సోమరులకి, వయసు మళ్ళిన వారికి దీని అవసరముగాని
మాకేల ఇట్టి చికాకు=సుఖాభిలాషతో కూడిన మాకు భ్రాంతి రహిత మార్గమెందుకు?
కొక్కోకమైతే గైకొందు మందురు = సుఖాభిలాష కలిగించే శరీర సంబంధమైన శృంగార శాస్త్రమైతే చెప్పడం, వినడం దానియందు ఆసక్తి చూపిస్తాము.

## తాత్పర్యము

కాకులు తమ దాహమును తీర్చుకొనుటకు పరిశుద్ధ జలములు నదులు, చెఱువుల రూపంలో అందుబాటులో ఉన్నను వాటిని స్వీకరించక ఏవిధంగా పాచిపట్టి, దుర్వాసనతో నిండియున్న కుండలో నిల్వయున్న

మురికి నీటిని స్వీకరించునో ఆవిధంగానే ఈ కలియుగము నందు కేవలం ప్రాపంచిక దృష్టితో భార్య, ధనము, సంసార వ్యామోహములోనున్నవారు పరమ పురుషార్థమై జన్మరాహిత్య విధానమునకు మార్గమును సూచించే లక్షణము కల పరిపూర్ణబోధ ఈ గ్రంథరూపంలో అందుబాటులోనున్నా దానిని స్వీకరించరు. ఇట్టి రచనను ఆసక్తి కలవారు చర్చించుకుంటుండగా ఆస్థానంలో వున్నవీరు దూరంగా పనికల్పించుకుని వెళ్ళి పోతారు. వినుటకు ఆసక్తి చూపించరు. ఇది గాక శరీర సంబంధమైన సుఖములను కలిగించే శృంగార శాస్త్రము అందలి విషయము లందు చర్చించుటకు వినుటకు ఆసక్తి చూపించెదరు.

కం॥ కుచ్చితమతియగుపురుషుని। చెచ్చెరవినుమనుచు జదువశిష్టులవలెతా।
ముచ్చటపాటుగవినడివి। కుచ్చుల కుళ్ళాయికుక్క। కూనాకెందు కురా।
పిడుదుకు దుగ్ధ। పానామెందూ కురా। హెచ్చైనముత్యాలపచ్చాల
పతకాము గ్రుచ్చి పేరుగజేసి తెచ్చీవేసితె కోతి। కూనాకెందుకురా।
పిడుదుకు దుగ్ధపానా మెందుకురా॥ 205

## ప్రతిపదార్థము

కుచ్చిత మతి యగు పురుషుని = కేవలం ప్రాపంచిక దృష్టి కలిగిన వాడు
చెచ్చెర విను మనుచు చదువ = శ్రద్ధ కలిగి వినుమని ఈ గ్రంథమును వాని కిచ్చుట
శిష్టులవలె = మంచి స్వభావము, మోక్షాపేక్ష కలవారి వలె
తా ముచ్చట పాటుగ వినడివి = శ్రద్ధ చూపించి, చదువుటకు వినుటకు ఇష్ట పడడు
కుచ్చుల కుళాయి = కుచ్చులతో కుట్టిన టోపి
కుక్క కూనా కెందుకురా = కుక్క పిల్లకు ఎందుకురా?
పిడుదుకు = ఒకానొక క్రిమికి
దుగ్ధ పానా మెందుకురా = పాలు త్రాగుట ఎందుకు?
హెచ్చైన = విలువైన

ముత్యాలు పచ్చల పతకము = ముత్యములతో , పచ్చలతో తయారుకాబడిన పతకము
గ్రుచ్చి = ఒకటిగా చేసి
పేరుగ జేసి = హారముగా చేసి
తెచ్చి వేసితె కోతి కూనా కెందుకురా = కోతి పిల్ల మెడలో వేసిన దాని విలువనది తెలుసు కుటుందా?

## తాత్పర్యము

ప్రాపంచిక బుద్ధితో లౌకిక ప్రయోజన మాశించిన వారిని ఈగ్రంథము వినుమని, చదవమని ఇచ్చిన సత్పురుషుల వలె ఆసక్తి కనపరచి వినుటకు, చదువుటకు ఇష్టపడరు. ఎట్లనగా కుచ్చులతో టోపీని తయారు చేసి కుక్క పిల్ల తలకు వేసిన అది ఎట్లునిలుపుకోదో, పశువు యొక్క పొదుగు యందు సారవంతమైన పాలు స్రవించుచుండగా అవిస్వీకరించక పిడుదు (ఒకా నొక క్రిమి) రక్త నాళమును తన తొండము ద్వారా రంధ్రము చేసి రక్తమును పీల్చును. ఇది గాక ముత్యాలు, పచ్చలు ఏరి హారముగా చేసి కోతి పిల్ల మెడలో వేసిన ఎట్టి ప్రయోజన ముండునో అట్లే ఈగ్రంథరచన సామాన్యులకు అందుబాటులో నుండదు.

కం॥ అక్షయబోధస్థితిగల। లక్షణవేత్తలకు మెప్పులైన కృతులలో।
కక్షకుంతవ్వులు కుమతి। పరీక్షింపుచునుండు నెన్నో।
రీతూలవినుమీ। తద్భావమీ। రీతిదికనుమీ। మక్షీక మెప్పాడు
మానిసు గంధాదు। లీక్షించుప్రణము। ప్రత్యక్షమెకద। యెన్నోరీ
తూలవినుమీ। తద్భావ। మీరీతిది గనుమీ॥ 206

## ప్రతిపదార్థము

అక్షయ = క్షయము కాని
బోధ = పరిపూర్ణబోధ
స్థితి గల = ఆరూఢత చెందిన
లక్షణవేత్తలకు = పరిపూర్ణ భావజ్ఞులకు

మెప్పులైన కృతులలో = ఇష్టపడి అభిమానించె గ్రంథములో
కక్షకు = ఇష్ట పడని
కుమతి = దురాలోచన పరుడు
తప్పులు పరీక్షించు చునుండు = దోషములు వెతుకుచునుండు
ఎన్నో రీతుల = ఎన్నో విధములుగా
వినుమీ = జాగ్రత్త పడుమీ
తద్భావమీ = అతనికి కలిగిన భావమును
ఈ రీతిది కనుమీ = ఈ విధముగా తెలుసు కొనుము
మక్షీకము = ఈగ
ఎప్పుడు = ఎల్ల వేళలా
మాని సుగంధాదులను = పరిమళ సుగంధ వాసనలు కలిగిన ద్రవ్యమును విడిచి పెట్టి
వీక్షించు వ్రణము = పుండును ఆశ్రయించుకొని వుండును
ప్రత్యక్షమె కదా = అనుభవములోని విషయమె కదా

## తాత్పర్యము

శాశ్వత జనన మరణ రాహిత్యము ప్రతిపాదించే లక్షణము కలిగిన పరిపూర్ణ బోధకు మూలమైన ఈ కందార్థ గ్రంథమును అట్టి బోధయందు ఆరూఢత చెందిన మహాత్ములు చదువుటకు, వివరించుటకు ఎంతో ఇష్టపడుదురు. దుర్మార్గ వృత్తి కలవారు ఇష్ట పడకపోగ ఈ గ్రంథము లోని దోషములను ఎత్తి చూపించి, గ్రంథము యొక్క విలువనూ ప్రయోజనాన్ని దిగజార్చుటకు ప్రయత్నించెదరు. ఇందుకు అనుభవ సిద్ధముగా విచారించినచో పరిమళ సువాసనలు వెదజల్లె స్థానమును విడిచిపెట్టి దుర్వాసన మయమై యున్న (చీము, నెత్తురు ఓడుతున్న) పుండును ఆ శ్రయించుకొని ఈగ వుండును. అనుభవంలో ఇది స్పష్టంగా తెలియు చున్నది కదా!

కం॥ రమ్మనిపిలువనిదేవ। ద్యమ్ములు జదువంగవచ్చి యతి
నిందించున్ సమ్మతిగాక కుమతివిని। యిమ్మహియది యెట్లనన్న।
నిట్లానేవినుమీ వానిబుద్ధినట్లానెకనుమీ। బొమ్మలాటలో దిచ్చు
బొమ్మతానొకటి ఛీ పొమ్మానియనినా హాస్యమ్మొనర్చ దెపోక నిట్లానె
వినుమీ వానిబుద్ధిన। ట్లానేకనుమీ॥ 207

## ప్రతిపదార్థము

రమ్మని పిలవనిదె = ప్రత్యేకముగా ఆహ్వానము లేనిదె

పద్యములు చదువంగ వచ్చి=ఈ కందార్థములు చదువు సందర్భములో వచ్చి

యతి నిందించున్ = ఎక్కువగా నిందారోపణ చేస్తాడు

సమ్మతిగాక = ఇష్టపడక

కుమతి = దుష్ట ప్రవృత్తి కలిగినవాడు

అది ఎట్లనన్న = ఈ విధము ఎట్లున్నదనగా

ఇమ్మహి = ఈ ప్రపంచములో

నిట్లానే వినుమీ = ఈ విధంగానే గమనించుము

వానిబుధ్యట్లానే కనుమీ=అట్టివాని బుద్ధి, ఆలోచన ఎట్లు వుంటాయో గమనించు

బొమ్మలాటలో = తోలుబొమ్మలాటలో

దిచ్చు బొమ్మ = దిష్టి బొమ్మ, హాస్యమును కలిగించుబొమ్మ

తానొకటి = తనకు తానుగా

ఛీ పొమ్మని యన్నా = ఒద్దు ఒద్దని ఎంత వాదించినా

హాస్యమొనర్చదె పోక = కొంతసేపు విచిత్రమైన మాటలతో, చేతలతో తనకు తానుగా ఎట్లు లేకపోవునో

## తాత్పర్యము

ఈ గ్రంథ పరిశీలనకు ఎట్టి ఆహ్వానము ఎవరి చేతను లేకనే తనకు తానుగా వచ్చి గ్రంథమును పరిశీలించు సందర్భములో ఇందలి లోపములను ఎత్తి చూపిస్తు దుర్మార్గ స్వభావముతో కొందరు దీనిని దూషించు చుందురు. ఇట్టి దుష్ట స్వభావము వారికి సహజ లక్షణము.

వారు స్వభావమును మార్చు కొనుట కంగీకరించరు. ఇందు ఉదాహరణ ఎట్లున్న దనగా పూర్వము భారత భాగవత రామాయణ గాథలను పామర జనులకు సులభముగా అవగాహన కలిగించుటకు తోలుబొమ్మలాట రూపంలో అందు ప్రావీణ్యం గలవారు ప్రదర్శించే వారు. ఇందు వినోదంతో పాటు, విజ్ఞానం కూడా కలిగెడిది. ఆటమధ్యలో వినోదార్థం హాస్యగాడి వేషంలో (జోకర్) తనకు తానుగానే ప్రవేశించి విచిత్రమైన వేషధారణతో మాటలతో, చేష్టలతో ఆహూతులను ఆనంద పరచి తనకు తానుగానే చివరకు లేకపోవును.

కం॥ వటియించనచన్నులుగల। కుటిలాలకి నిందజేయు గుత్తపురవికెన్।
యెటువలెతనతప్పెరుగక। నటువలె గంథమును మెచ్చు।
డతిదుర్జనుండూ లేనిదెతప్పు। వెతుకూచు నుండు యిటు వంటి
బోధనే నెరిగెదెట్లనుకోక। కటువాక్యములు బల్కి ఘనుల గాసిల
జేయు। నతిదుర్జ నుండూ। లేనిదెతప్పువెతు కూచునుండూ॥ 208

## ప్రతిపదార్థము

వటియించిన = శుష్కించిన

చన్నులుగల = శరీరము గల

కుటిలాలు = దురాలోచన కలిగిన స్త్రీ

నింద జేయుగుత్తపు రవికన్ = తనుధరించిన వస్త్రమును నిందించును

యెటువలె = ఏవిధంగా

తన తప్పెరుగక = తన శరీరము శుష్కించిన సంగతి గుర్తించక

నటువలె = ఆవిధంగానే

దుర్జనుండు = దురాలోచన కలవాడు

గ్రంథమును మెచ్చడు = ఈ గ్రంథము నందు పేర్కొన్న గొప్పదైన విషయమును గుర్తించడు

లేనిదె తప్పు వెతుకుచు నుండు = రచన యందు ఎట్టి దోషము లేకపోయినా తన అర్హతను దాచి పెట్టి గ్రంథములో లోపము లెంచుచుండును.

యిటువంటి బోధను=జన్మ కర్మలు రద్దు పరచ గలుగు శ్రేష్టమైన ఇట్టి భావమును
నే నెరిగేదెట్లను కోక = నేనెట్లు దృఢ పరచుకోగలను అని ఆలోచించకుండా
కటువాక్యములు బల్కి = నిందలు పల్కుచు
ఘనులు = గొప్పవారిని
గాసిల జేయు = కష్ట నిష్టూరములకు లోను చేయును.

## తాత్పర్యము

కుంచిత స్వభావము గలిగిన స్త్రీ తను ధరించిన వస్త్రములు ఒదులుగా వున్నవని, సరిపడ లేవని బట్టలను నిందించును. వాస్తవమునకు తన శరీరము శుష్కించుట చేత తాను ధరించిన వస్త్రములు వదులైనవి అన్న వాస్తవము తెలియక పోవుటయె. ఈ విధంగానే దుర్మార్గ స్వభావం కలవారు తమకు గల అయోగ్యతను, అనర్హతను గుర్తించక జనన మరణ రాహిత్య విధానమును ప్రతిపాదించు లక్షణము కలిగిన ఈ గ్రంథమును చదివి అందలి దోషములను ఎంచి చూపిస్తారు. అనేక జన్మల పుణ్య సంస్కారముచేలభ్యము కాగలిగిన బోధనా విధానం తెలుసుకోగలుగు చున్నాము అని సంతోషించక, కష్టమైన మాటలతో, విమర్శలతో సత్పురుషులను ఆక్షేపించి వారిని కష్ట పెట్టుటకు ప్రయత్నింతురు.

కం॥ అపరోక్షమౌనె మనుజులు కుపరోక్షంబైన బయలు గురుకృపలేకన్।
అవరోక్షవౌను మనుజులకు పరోక్షంబైన బయలు।
గురుకృపగలుగా। కీలిదెలేని। యెరుకాతా తొలుగా। విపరీతమౌబుద్ధి
విడిచి నీవెప్పుడు। ఉపచారములు జేయు చుండూమా గురునీకి।
గురుకృపగలుగా। కీలిదె లేని। యెరుకా తాతొలుగా॥ 209

అపరోక్షము= స్వత:సిద్ధమైయున్నవిధానము
మనుజులకు = మనస్సు అనే పదార్థము విశేషముగా కలవారికి
పరోక్షంబైన = గుర్తెరిగే తెలివికి వేరైయున్న
బయలు = పరిపూర్ణము
గురుకృప లేకన్ = గురుకృప లేకుండా

అపరోక్షమగును =ఉన్నది ఉన్నట్లుగా దృఢపడును
పరోక్షంబైన బయలు = గుర్తెరిగే తెలివికి అందరానిదై యున్నపరిపూర్ణము
గురుకృప కలుగ = గురుకృప సిద్ధించిన మీదట
కీలిదె = అత్యంత రహస్యమైన అంశమిదియె
లేని ఎరుక తా తొలుగ = లేనిది ఉన్నట్లుగా తోచబడు ఎరుక లేకపోవుట
విపరీతమౌ బుద్ధి విడచి=స్వప్రయత్నము చేత సాధిద్దాము అనే ఆలోచన విరమించి
నీ వెప్పుడూ = శిష్యుడవైన నీవు ఈవిధంగా
ఉపచారములు చేయుచుండూము గురునికి = నాలుగు శుశ్రూషలు ఏమరుపాటులేక గురుమూర్తికి చేయకల్గినపుడు
గురుకృప కలుగ = గురుకృప సిద్ధించును

## తాత్పర్యము

ఈ కందార్ధము నందు గురుకృప అవసరమును, ప్రయోజనమును, సిద్ధించు విధానమును విపుల పరచ బడుచున్నవి. మనోవాక్కుల కందక కేవలత్వము కలిగిన పరిపూర్ణమును సాక్షాత్తుగా ఎవరునూ అనుభూతము గావించుకొనలేరు. జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత అను అంత:త్రిపుటిని మీరి స్వత:సిద్ధమై యున్నది. స్వ ప్రయత్నముచేగాక గురుప్రబోధ ద్వారా మాత్రమె దృఢ పరచుకొన వలసి వున్నది. దీనికి ముందుగా తెలివిచేత తెలియ బడే దంతయు ఒకటిగా చేసుకుని, అట్టి స్థితియందు తాను నిలిచి తనకు వేరై యున్నవిధానము, తాను లేకపోవు విధానము గట్టిగ దృఢ పరచుకో వలసి వున్నది. ఇది అంతయు అత్యంత రహస్యమై ఉపదేశ పద్ధతిచే గురుశిష్య న్యాయముగా మాత్రమే గ్రహింపనగును.

అక్షము అనగా ఇంద్రియము అని అర్థము. జ్ఞానేంద్రియములైదు మనస్సు కలసి మనోమయ కోశముగా చెప్పబడుచున్నది. దీనిచేతనే బ్రహ్మాండమందలి పంచతన్మాత్రలను గ్రహింపబడుచున్నవి. జ్ఞానేంద్రియములనుండి మనస్సును వేరుచేసి నిరీంద్రియము

గావించినపుడు గురు ప్రబోధ ద్వారా విన్నఎరుక యొక్క వస్తు నిశ్చయ జ్ఞానములో స్వరూపనిర్ణయములో మనస్సును వ్యాపకత్వం చేసినపుడు ఎరుక యొక్క సమగ్ర రూపము విన్నది విన్నట్లుగా మనస్సుజ్ఞానముగా మారి దానిపై జ్ఞేయముగా తన ఉనికిని గుర్తింప గల్గును. అప్పుడు తనకు వేరుగానున్న ఆత్మ తత్వము లేక ఎరుక అపరోక్ష మగును. పిండ దృష్టితో వస్తునిశ్చయ జ్ఞానము విన్న మీదట పరోక్షము అనగా తనకు వేరై వున్నది. వస్తునిశ్చయ జ్ఞానము ద్వారా తనకు ఎదురుగా నున్నది ప్రత్యక్షము. ధ్యాన పద్ధతిలో మనస్సును నిరీంద్రియము చేసినచో కలుగు అనుభూతి అపరోక్షము. ఆత్మదర్శనము నందు దీనిని ఈ విధముగా గ్రహింపనగును. పరిపూర్ణ సిద్ధాంతరీత్యా ఉన్నవి రెండే వస్తువులు. 1. ఎరుక 2. పరిపూర్ణము తాను అఖండ స్వరూపుడుగా నున్నపుడు తనకు వేరై వున్నది పరిపూర్ణము (పరోక్షము) గురుసూచనద్వారా దానిని ఉండజూసుకొన్నపుడు అది ప్రత్యక్షమగును. బోధనా పద్ధతిచే పరిపూర్ణము వున్నదని, అందు గుర్తెరిగే తాను లేనని దృఢ పరచుకొని, గురువాక్యముచే తాను లేకపోవుట అపరోక్షము. ఇది అంతయు పరిపూర్ణ దర్శనమునకు సంబంధించిన బోధనా క్రమము రహస్యమై యున్నది. మాటలచే ఇంతకన్నా తర్జుమా చేయుటకు వీలుపడదు. ఈ కందార్థము నందు గురుకృప యొక్క అవసరం, ప్రయోజనం ఈ విధానము కొరకైచెప్పబడినది. గురుకృప చేతనే ఉన్న పరిపూర్ణము ప్రత్యక్షమగుట, లేనిఎరుక లేకపోవుట అను విధానము కలుగును. కావున గురుకృప పొందుటకు చేయవలసిన ప్రయత్నమును తెలిసి ఎట్టి సందేహము లేకుండా త్వరితముగా అట్టి విధానమును పాటించుము అని ఇందు పేర్కొనబడు చున్నది. అవి ఏమనగా స్థాన శుశ్రూష, అంగశుశ్రూష, ఆత్మ శుశ్రూష, భావ శుశ్రూష

1.స్థాన శుశ్రూష :- గురు స్థానమందుండి బోధవినుట.

2.అంగ శుశ్రూష:- గురువు నిర్దేశించిన విధముగా జీవన విధానమును మార్పు చేసుకొని జీవించగల్గుట.

3.ఆత్మ శుశ్రూష :- తనప్రవర్తనచే గురువును మెప్పింప గల్గుట.

4.భావ శుశ్రూష :- గురువు సూచించిన భావమునందే మనసు నిల్పి ఇతర అంశములు విసర్జించుట. ఇట్టి ఉపచారములు చేయుటచేత ఉపదేశగురువు యొక్క అనుగ్రహము పొంది పరిపూర్ణబోధయందు ఆరూఢత సిద్ధించును. దీనికితోడుగా గురూపదిష్ట మార్గములో అనుష్టానపద్ధతిని పాటించినచో జన్మాంతర వాసనలు (పరిపూర్ణబోధ ఆరూఢమగుటకు అవరోధముగా నున్నవి) అవి రద్దై ఈశ్వరానుగ్రహముచే (గురువు అనుగ్రహముచే) పరిపూర్ణము ఎరిగి, ఎరుకను ఎరిగి, ఎరుకను మాను అను సూత్రము వాస్తవ రూపముగా మారును అని పిండితార్థము.

**కం॥ ఎరుగననేటిది యెరుకే। యెరుగుదునని తనను పరుల నెరిగే
దెరుకే। యెరుగ నెరుంగుదు ననుదా। న్నెరుగుచు నుండేటి
దెరుకే। నిరుపామ బుద్ధీ। నీవెరుగిది నిగమ ప్రసిద్ధీ। గురు
మంత్రమని యేటి గృద్దాలి తోటియీా। యెరుకా కూకుడు వేరు।
నెరిగిత్రవ్వితెచాలు। నిరుపామ బుద్ధీ। నీవెరుగిది। నిగమ ప్రసిద్ధి॥ 210**

## ప్రతిపదార్థము

నిరుపమ బుద్ధి = శ్రేష్టమైన, సాటిలేని బుద్ధి కలవాడు

నీవెరుగుము = నీవు స్పష్టముగా గుర్తించుము

ఇది నిగమ ప్రసిద్ధి = ఈ విచారణ అంతయు జ్ఞాన కాండగా చెప్పబడుచున్న ఉపనిషత్తులచే పేర్కొనబడుచున్నది.

ఎరుగననేటిది ఎరుకే = తెలివికి ఏమాత్రము గోచరించనిది అను నిర్ణయము గుర్తుదే

ఎరుగుదు ననిన = సమస్తమునకు తెలియబడుచున్నది అను మాట కూడా

తనను పరుల నెరిగే దెరుకే = పిండాండమందు ప్రత్యగాత్మగాను, బ్రహ్మాండమందు పరమాత్మగాను గుర్తించునది కూడా ఎరుకే

ఎరుక నెరుంగుదును = అన్నింటికీ మూలము, ఆధారమైన గుర్తు కూడా నే ఎరుగుదును

అనుదాన్ని = ఆవిధంగా భావించుదానిని
ఎరుగుచునుండేది = గుర్తించ గలిగే లక్షణం కలిగినది
ఎరుకే = ఒకే గుర్తైరిగే శరీరమే సుమా!
గురుమంత్ర మనియేటి గృద్ధాలి తోటి = మూలములేని గుర్తైరిగే శరీరము అను షోడశి వాక్యమనే గొడ్డలితోటి
ఎరుకా కూకుడు వేరు = గుర్తైరిగే ఎరుకకు అత్యంత మూలము, ఆధారము అయిన దానిని
ఎరిగి = వస్తునిశ్చయ పూర్వకముగా గుర్తైరిగి
తవ్వితే చాలు= లేదని దృఢ పరచుకొంటే చాలు

## తాత్పర్యము

జ్ఞానేంద్రియముల ద్వారా పంచ తన్మాత్రలను తెలుసు కొనునది, పిండ బ్రహ్మాండములుగా, జీవేశ్వరులుగా, వ్యష్టి సమిష్టులుగా భేదజ్ఞానము కలిగించునది, సృష్టికి పూర్వము తానుతానే అఖండ జ్ఞానరూపముగా ప్రకాశించునది ఒకే తెలివిగా చెప్పబడుచున్నది. ఇది అంతయు వేదములందు జ్ఞానకాండగా చెప్పబడుచున్న ఉపనిషత్తులయందు దీనినిగూర్చి చాలా స్పష్టముగా ప్రతిపాదించబడినది. ఏ ఒక్క జ్ఞానము పొందినమీదట సమస్తజ్ఞానము సిద్ధించునో, అట్టి అఖండ జ్ఞానము (అఖండ ఎరుక) గా దీనిని వస్తునిశ్చయ పూర్వకముగా స్పష్టముగా గుర్తించుము. స్వతఃసిద్ధమైన పరిపూర్ణము నందు ఈ గుర్తుకు మూలము గాని స్థానము గాని లేదని గురువాక్యము చేత (ద్వాదశి) దృఢపరచుకొని షోడశి వాక్యముద్వారా విడచి యుండుము.

కం॥ ఎరుకేకోశములైదెరు। కేభూతముల నెరుగు నెరుగును సర్వం।
బెరుకేయెరుకనెరుంగును। యెరుకను గుర్తెరుగవేరె।
యెరుకావున్నాదా। వున్నదంటె। నరకామెకాదా। నిరతాము
గురుసేవపర తంత్రులగుచుత। త్కరుణాకుపాత్రులై। యెరుక
మాలినవారి। కెరుకా వున్నాదా। వున్నదంటే। నరకామె కాదా॥211

## ప్రతిపదార్థము

ఎరుకే కోశము లైదు = అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ ఐదు కోశములుగా ఒకేగుర్తు మార్పుచెందినది.
ఎరుకే భూతముల నెరుగు = పృధ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము లను గుర్తెరుగునది ఆత్మ రూపముగా వున్న ఎరుకే
నెరుగును సర్వము = అభేద జ్ఞానమును కలిగించునది కూడా ఈ గుర్తే
ఎరుకే ఎరుక నెరుంగును = ఒక జ్ఞానమే తనకు అనుభంధముగా వున్న జ్ఞేయమును తనకు తానుగా గుర్తించును
ఎరుకను గుర్తెరుగ వేరే ఎరుక వున్నదా = ఇట్టి అఖండాత్మరూపమైన తెలివికి మూలము, ఆధారము మరొక తెలివి వుండదు.
వున్నాదంటె నరకమె కదా = అలా పలకడం (నిర్ణయించడం) దోషమౌతుంది
నిరతాము = నిరంతరము అనన్యచింతనతో
గురుసేవా పరతంత్రులగుచు = గురుధర్మమును, గురువాజ్ఞను నిర్వర్తించుటలో తమ స్వంత వ్యవహారములను కూడా మరచిపోయి గురునిష్టయందున్న వారు.
తత్ కరుణకు పాత్రులై = ఈవిధమైన భక్తిచేత గురుకృపను పొంది
ఎరుక మాలిన వారికి ఎరుక వున్నదా = పరిపూర్ణ బోధను గురువాక్యముచే (షోడశి) విడిచిన వారికి భ్రాంతులకు కారణమైన గుర్తు ఇంకా మిగిలి వుంటుందా?

## తాత్పర్యము

అన్నమయాది పంచకోశములుగాను, పృధ్వ్యాది పంచ భూతములుగాను మార్పు చెందియున్న ఈ సమస్త మును ఒకే తెలివి ప్రకాశింప చేయుచున్నది. ఇతరమునే కాక, తనకు తానుగా తన ఉనికిని, మూలమును గుర్తించే లక్షణము కూడా కలిగి వున్నది. ఇట్టి అఖండాత్మ దృష్టి యందు వేరుగా గుర్తించుటకు ఇతర మేమీ మిగలదు. గురుముఖత: ఎరుక యొక్క వస్తు నిశ్చయ జ్ఞానము పొందిన వారికి ఇది

అనుభవనీయము. అన్నిటికీ మూలమైన తనకు వేరే మూలము , ఆధారము లేదు. ఉన్నదంటే వారికి జనన మరణ ప్రవాహమైన నరకము తప్పదు. ఇట్టిఆరూఢత గురుకృప చేత గాని సాధ్యపడదు. పరిపూర్ణగురువు ధర్మ నిర్వహణలో తమ స్వంత వ్యవహారములు కూడా మరచి గురుధర్మమును సేవించి, గురుకృపకు పాత్రులై పరిపూర్ణము నెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను గురువాక్యము యధాతధాగా శేషజీవితమును గడుపుచున్నవారికి భ్రాంతులకు కారణమైన ఎరుక వుండదు. ఉన్నదంటే అది జనన మరణ రూపమైన నరకమునకే కారణమగును.

**కం॥ గురుమంత్రముచేనిలువని। యెరుకను పరిపూర్ణ మనుచు**
**నెరిగినిరతమున్। యెరుకై యుండినవారల। తెరువిక నీకేల।**
**వట్టిదీజోలిమానూ। యెరుకలేని। యాజోలి బూనూ। గురునీచె**
**పరిపూర్ణ మరసియా తెలసీన। యెరుక నెన్నటికీనీవెరుగా**
**కుమిదివట్టి। దీజోలిమానూ। యెరుక లేనియా జోలిబూనూ॥212**

## ప్రతిపదార్థము

గురుమంత్రముచే నిలువని ఎరుకను = "ఈ ఉత్త బట్టబయలు ఏమీలేదు" అను ద్వాదశి వాక్యము ద్వారా లేకపోవుచున్న గుర్తును
పరిపూర్ణమనుచు ఎరిగి = స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణముగా భావించి
నిరతాము = నిరంతరము
ఎరుకై యుండిన = గుర్తుతో కూడుకున్నవారు
వారల = వారియొక్క, అటువంటివారియొక్క
తెరవు = భావము, మార్గము, విధానము
నీకేల = నీకు పనికిరాదు
వట్టిది = నిజముకానిది, భ్రాంతి రహితవిధానమునకు సరిపడనిది
ఆజోలిమాను = అట్టివిధానమును విడిచి యుండుము
యెరుకలేని = గుర్తు రహితమైన
ఈజోలి = ఈవిధానమును, ఈ మార్గమును
పూను = పాటించుము

గురునిచే పరిపూర్ణ మరసి = పరిపూర్ణ గురువుచే అచలము, బయలు, పరిపూర్ణము అనుసూచనలచే దాని ఉనికిని వస్తు నిశ్చయ పూర్వకముగా దృఢపరచుకొని

యీ తెలిసిన ఎరుకను = ఉన్నది అని దృఢపరచుకొన్న తెలివిని

ఎన్నటికి = ఎప్పటికి

నీవెర్మగాకు = సత్యమైనదని భావించకు

ఇది వట్టిది = గురువాక్యముచే (షోడశి) అదిలేనిదగుచున్నది

ఈ జోలిమాను = దానితో సంబంధమును విడిచి పెట్టు (షోడశి)ద్వారా

## తాత్పర్యము

పరిపూర్ణ గురువు ద్వారా వస్తునిశ్చయ పూర్వకముగా ( అచలము, బయలు, పరిపూర్ణము) అను సూచనల ద్వారా స్వత:సిద్ధమైన యున్న పరిపూర్ణము యొక్క ఉనికిని దృఢపరచుకొని దానియందు ఎరుకకు మూలముగాని, స్థానముగాని లేదని గుర్తించివిడిచియుండువిధానము సాంప్రదాయ పద్ధతియందు నిర్దుష్టముగా ఉపదేశ పద్ధతిగా మాత్రమే తెలియబడుచున్నది. ఇందుకు భిన్నముగా ఎరుకయొక్క పూర్వపుస్థితిని ( సృష్టికి పూర్వము తాను తానుగా యున్న స్థితిని) అచలపరిపూర్ణమని భావించి, ఎరుక స్థితియందే ఉనికి కలిగినవారి విధానము, మార్గములతో నీకు పనిలేదు. దాని వలన జనన మరణ భ్రాంతి రహిత స్థితి కలుగదు. గురుకృప ద్వారా వస్తునిశ్చయ పూర్వకముగా పరిపూర్ణము, ఎరుకలను ఏర్పాటుగా గుర్తించి, ఎరుక విడచు విధానము గట్టిగ దృఢపరచుకొను మార్గము ఈ గ్రంథముద్వారా తెలుసుకొని పాటించుము అని తెలియవలెను.

కం॥ గురుతను కలలోనారీ। నరులూరికెవచ్చిపొంది నయముగసుతులన్।
వరకన్నియులను గాంచియు। గురువరుచే మేలుకొంటె।
గురుతుండదన్నా। ఆపైమాట నెరిగెదేదన్నా। యెరుకొక్కటుంటెనే
యేర్పాటులుండును। యెరుకొక్కటే గీతె యేర్పాటు జేసేటి।
గురుతుండదన్నా। ఆపైమాట। నెరిగేదేదన్నా॥ 213

## ప్రతిపదార్థము

అన్నా = నాయనా
గురుతను కలలో = ఎరుక అనే కలలో
నారీ నరులు = స్త్రీ పురుషులు
ఊరికే వచ్చి = తమకు తాముగా తోచి
పొంది = సంసారజీవితం గడిపి
నయముగా = స్పష్టముగా
సుతులన్ = కుమారులు
వరకన్నియలన్ = శ్రేష్టమైన కుమార్తెలు
గాంచియు = పొంది, సంపాదించి, సుఖదు:ఖముల ననుభవించి
గురువరుచే మేలుకొంటే = పరిపూర్ణభావజ్ఞుని అనుగ్రహముచే మూలము లేని గుర్తెరిగే శరీరము ఏమీ లేదని దృఢపరచుకొంటే
గురుతుండదన్నా = జన్మకర్మల భ్రాంతికి మూలమైన గుర్తు ఇక మిగలదు.
ఆపైమాట = ఆపైన కలిగిన అనుభవము లేక వస్తువుయొక్క జాడ
నెరిగేదేదన్నా = గుర్తించేది లేదు
ఎరుకొక్కటుంటేనే ఏర్పాటు లుండును = ఒక్కగుర్తుచేత నానాత్వమంతా సిద్ధించును
ఎరుకొక్కటేగితే = ఇట్టిగుర్తు గురువాక్యముచేత లేకపోతే
యేర్పాటు చేసేటి గురుతుండదన్నా = ఉన్నది లేనిది అనే గుర్తు మిగలదు

## తాత్పర్యము

పరిపూర్ణమునందు లేక తోచిన ఎరుక యందు పరిణామ క్రమములో బ్రహ్మాండము పిండాండముగా మార్పుచెంది, 84లక్షల జీవరాశుల క్రమములో ఉన్నతమైన మానవోపాధి యందు, సృష్టి విధానము కొరకు స్త్రీ పురుషులుగా ఏర్పడి, దాంపత్యజీవితములో సుఖానుభూతి కొరకు కుమార్తెలను, కుమారులను సంపాదించి, వారిద్వారా కష్టసుఖములను అనుభవించుచూ, పూర్వజన్మ సుకృతముచేత తీవ్రమోక్షాపేక్ష కలిగి,

పరిపూర్ణగురువు నాశ్రయించి, పరిపూర్ణముద్వారా సమస్తసృష్టికి మూలకారణమైన అఖండ ఎరుకకు స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు మూలముగాని, స్థానముగాని లేదని, గుర్తెరిగే ఎరుక కలవంటిదని, దృఢపరచుకొన్నమీదట, గుర్తు దానిపరిణామము అందులోకలుగు సుఖదు:ఖములు నిజము కాదని దృఢపడును. గుర్తెరిగే శరీరమున్నంతవరకు జన్మ పరంపరలు, సుఖదు:ఖములు తప్పవు. పరిపూర్ణబోధచే షోడశి వాక్యముద్వారా (మూలములేని గుర్తెరిగే శరీరము) లేనిదని దృఢపరచుకొన్నప్పుడు గుర్తులేని స్థితి సహజమగును.

**కం॥ నినునను నివుకలగాంతువు। నినుననుకలలోన। గాంతు**
**నేనొకవేళ్ళన్। నినునను నివునేననునిను। గనుగొనగాగలమె।**
**మేలు కనినామీదటనూ। గురుబోధట్లు। వినినామీదటనూ।**
**మునువు గలిగిన యెరుకమొదటికె నిలువాదు। నిను నన్ను**
**నేనన్ను నిను నీవెరుగుటమెట్లు। కనినా మీదటనూ। గురు**
**బోధట్లు। వినినా మీదటనూ॥** **214**

## ప్రతిపదార్థము

నిను నను = విచారణచేసే మన ఇరువురము
నీవు కల గాంతువు = గుర్తెరిగే నీకల యందు తోచబడుచున్నది
నిను నను = వినే నీవు, చెప్పే నేను
కలలోన గాంతువు = గుర్తెరిగే తెలివి యందు తోచబడు చున్నాము
నేనొకవేళన్ = ఒకానొక సందర్భములో
నిను, నను, నీవు = వినడం, చెప్పడం అనే కలలో వున్ననీవు
నే,నను నిను = వినమని చెప్పునేను, వినే నీవు
కను గొనగా = విచారించి చూచినచో
గలమె = ఉనికి కలిగి వుంటామా?
మేలుకని నామీదటను = పరిపూర్ణము వున్నది, దానియందు ఎరుకలేనిది అని గురువాక్యము చేత దృఢపరచుకొన్న మీదట

మునుపు గలిగిన ఎరుక = అంతకు పూర్వము గుర్తెరిగే తెలివి
మొదటికే నిలువాదు = ఏమాత్రము ఉనికి కలిగి యుండదు
నిను నన్ను = నీవు, నేను
నేనన్ను నిను = నేననే నేను,నీవు
నీవెరుగుట మెట్లు? = ఈ విధంగా దృఢపరచు కొన్నమీదట
కనినా మీదటను = విచారించిన మీదట

## తాత్పర్యము

విచారణచేయు సంధర్భములో గురు శిష్యులు ఒకరి నొకరు చెప్పుట, వినుట అను ప్రక్రియలో కలలో తోచబడుచుండును. అట్టి కలనుండి మెలకువపొందిన పిమ్మట చెప్పుట, వినుట అను శిష్యుని కల వినుట చెప్పుట అను గురుని కల లేక పోవుచున్నది. ఆ విధంగానే పరిపూర్ణ బోధచే పరిపూర్ణము వున్నది, దానియందు ఎరుక లేనిది అని ద్వాదశి, షోడశి మంత్రముల ద్వారా దృఢ పరచుకొన్న మీదట సర్వ భ్రాంతులకు మూలమైన గుర్తు లేని దగుచున్నది. కనుక వినుట, చెప్పుట, చెప్పుట వినుట అను గుర్తు లేనిదగుచున్నది అని భావము.

**కం॥ -లేదులేదనుచు యెందరు। వాదించినలేకపోదు పరిపూర్ణముదా।**
**పోదుపోదనుచునిల్పిన। పోదనియనుకోకు। యెరుక**
**పోనెపోతుందీ। గట్టి గలేచి। పోనెపోతుందీ। వాద భేదము**
**లేని వారీ చెయెరుకాది। పాదుపెకలించేటి పద్ధాతినెరిగీతె।**
**పోనెపోతుందీ। గట్టిగలేచి। పోనెపోతుందీ॥** **215**

## ప్రతిపదార్థము

పరిపూర్ణము = స్వత:సిద్ధమైన వస్తువు
లేదు లేదనుచు = తమ తెలివికి అందుబాటు లోకి రాలేదని
ఎందరు వాదించిన = ఎంత మంది తర్కించిన
లేకపోదు = దాని ఉనికికి ఏమాత్రము భంగముకాదు
యెరుక = గుర్తెరిగే శరీరము

పోదు పోదనుచు = శాశ్వతమైనది, స్వచ్ఛమైనది అని ఎంతమంది వర్ణించిన
పోదని యనుకోకు = స్థిరముగా వుంటుందని అనుకోకు
పోనే పోతుంది = శాశ్వతముగా ఉండుటకు వీలులేదు
గట్టిగా లేచి పోనె పోతుంది = గురువాక్యముచేత (ద్వాదశి, షోడశి) ఏ స్థానమందు ఉనికి లేక రద్దవుతుంది
వాద భేదము లేని వారీచె = శాస్త్రజ్ఞానము, మతభేదము మొదలైనవి లేనివారిచే (రద్దు పరచుకొన్నవారిచే)
ఎరుకాది పాదు = గుర్తెరిగే తెలివికి మూలము, ఆధారము
పెకలించేటి పద్ధతి నెరిగితే = రద్దు పరచుకొను విధానము దృఢపరచుకొంటే

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణము తమ గుర్తుకు అందుబాటు లోకి రాలేదని, దాని ఉనికిని లేదు అను శబ్ధముచేత ఎంతమంది చర్చించినా లేకపోదు. అది స్థిరముగాను, శాశ్వతముగాను ఉండును. ఆ విధంగానే గుర్తెరిగే ఎరుక శాశ్వతమని, సత్యమైనదని ఎంతమంది తమకున్న శాస్త్రజ్ఞానముచే వాదింపబూనినను లేకనే పోవుచున్నది. పరిపూర్ణబోధయందు గురువాక్యముచేత రద్దుకాగలిగే లక్షణముకలిగి ఉన్నది. మతభేదము, శాస్త్రజ్ఞానము మున్నగునవి అన్నియు విడిచిపెట్టి గురు అనుగ్రహము చేతమాత్రమే ఈ గుర్తెరిగే తెలివికి మూలము, ఆధారము గుర్తింపబడి నశింపచేయు పద్ధతి దృఢపరచుకొనిన యెడల జనన, మరణ భ్రాంతి కారణమైన గుర్తెరిగే శరీరము లేకపోవుచున్నది అని భావము.

కం॥ మేనెరుకలరెంట్లొనొక। దానినియెడబాసిచేయుతరమా। పనులన్।
మేనికియెరుకకు గావునమేనన యెరుకెరుక యనినమే నానియెరుగూ।
యూరెంట్ని। నీవు నేనానియెరుగూ। యెరిగి వీట్లతో
బయలునెరిగీమేనెరుకాల। తిరిగి చూడకు చూస్తే। గురుని పాదములాన।
మేనానియెరుగూ। యూరెంట్ని। నీవు నేనానియెరుగూ॥ 216

## ప్రతిపదార్థము

మేనెరుకల రెంట్లో = శరీరము, గుర్తెరిగే తెలివి అను రెండు వస్తువులలో
ఒకదానిని ఎడబాసి = ఒకదానిని ఒకటి విడిచియుండి
చేయతరమా పనులన్ = ఏపనులు జరుగుటకు సాధ్యముకాదు
మేనికి ఎరుకకు = శరీరానికి తెలివికి
కావున = అందువలన
మేనన ఎరుక = తెలివికి శరీరము
యెరుకయనిన = గుర్తెరిగే శరీరమనిన
మేనాని ఎరుగు = ఈ రెండూ ఒక్కటిగా వున్నాయని తెలుసుకో
ఈరెంట్ని నీవు నేనాని ఎరుగు = అనుభవములో వస్తునిశ్చయ పూర్వకముగా మేనెరుకలను నీవు నేనుగా గుర్తించు
యెరిగి = పైవిధముగా ఒకటిగా గుర్తించి
వీట్లతో బయలు నెరిగి=ఈ రెంటికీ వేరై వున్న పరిపూర్ణమును ఉండ చూసుకుని
మేనెరుకల తిరిగి చూడకు = పైరెండు వస్తులను (ద్వాదశి, షోడశి) గురువాక్యము చేత విడిచి వుండుము
చూస్తె = అది నిజమని, సత్యమని భావిస్తే
గురుని పాదములాన =గురువాజ్ఞను అతిక్రమించిన వాడవవుతావు

## తాత్పర్యము

శరీరము, ఎరుక అను రెండు వస్తువు లలో ఒక దానిని ఒకటి విడిచి యుండి ఏపనులు జరుపజాలము. అందుచే శరీరమునకు ఎరుక, ఎరుకకు శరీరము ఒకదాని కొకటి ఆధారముగా వుండి పనులు జరప బడుచున్నవి. అనుభవములో వస్తు నిశ్చయ పద్ధతిచే ఈ రెంటిని నీవు, నేనుగా గుర్తించుము (గురు శిష్యులుగా) వీటితో గురువాక్యము ద్వారా (ద్వాదశి) స్వతఃసిద్ధమైన పరిపూర్ణము ఉండజూచుకొని, గుర్తెరిగే తెలివిని గురువాక్యము ద్వారా (షోడశి) విడిచి యుండుము. ఇందులకు ఎట్టి సందేహము పడవద్దు. సందేహించిన ఎడల గురువాక్యము దాటను అని నీవు చేసిన ప్రమాణమునకు భంగము కలుగును.

 

కం॥ మరుపు సుషుప్తియుమూర్ఛయు। మరణంబు సమాధి యనుచు
మానవులెరుకన్। దొరిగిన వొరుని శరీరము। నెరిగెదరా నరుడు।
మేనునెరుగా డోయన్నా। తనసైనతా। నెరుగాడోయన్నా।
యెరుగాకుండి తెయేమితిరిగిపుట్టు చునుండు। తిరిగిపుట్టడు
వాడీ। గురుబోధగలిగితె। యెరుగ డోయన్నా। తననైనతా నెరుగా
డోయన్నా॥ 217

## ప్రతిపదార్థము

అన్నా = నాయనా
మరుపు = అజ్ఞానము
సుషుప్తి = తనను ఇతరులను మరుపు చెందిన స్థితి
మూర్ఛ = స్పృహ లేక పడియుండుట
మరణము = మన: ప్రాణములు శరీరమునుండి బయటకు వెడలుట
సమాధి = జాగ్రదావస్థ ద్వారా స్వస్వరూప జ్ఞానమును పొందుట
యనుచు = పైన పేర్కొన్న శబ్ధములచే సూచింప బడుచు
మానవులు = మనస్సు గొప్పగా వికసించినవారు
ఎరుకన్ దొరిగిన = పైన చెప్పబడిన అవస్థలు పొందు చున్నపుడు
వొరుని శరీరము = ఇతరుల శరీరమును గూర్చి
యెరిగెదరు = గుర్తించెదరు
ఆ నరుడు మేను నెరుగాడోయన్నా = పైన పేర్కొన్న అవస్థలలో ఉన్నవాడు ఏమీ తెలుసుకోలేడు
తననైన తానెరుగ డోయన్నా=ఇతరుల గురించి కూడా ఏమాత్రము తెలుసుకొనలేడు
యెరుగాకుండితె ఏమి = అవిధంగా తెలియనంత మాత్రముచేత
తిరిగి పుట్టుచునుండు = తిరిగి జన్మ పరంపరలకు లోనగుదురు
తిరిగి పుట్టడు వాడె గురుబోధ గలిగితె = పరిపూర్ణ బోధ పొందుట చేత జన్మ పరంపరలకు లోనుకాడు

## తాత్పర్యము

నాయనా! ఎరుక, మరుపు అనునవి రెండు రూపములుగా ఉన్న ఒకే ఎరుక యొక్క లక్షణము. తనకు తాను గుర్తెరుగునపుడు ఎరుకని, తనకు తాను మరచినపుడు మరుపు అని పిలువ బడుచున్నది. మరుపు స్థితియందు ఎరుక లక్షణము గర్భీకృతమైవున్నది. తాత్కాలికముగా మరుపు రూపము చెందినా మళ్ళీ ఎరుక రూపము వహించును.

<u>సుషుప్తి</u>:- గాఢమైన నిద్రావస్థ ఇందు గుర్తెరిగే తెలివి (మనః(ప్రాణములు) తాత్కాలికంగా వియోగము చెంది వున్నవి. మరల ఏకీకృతమై జాగ్రదావస్థ కలుగుచున్నది.

<u>మూర్ఛ స్థితి</u>:- జాగ్రదావస్థ యందు ప్రాణసత్తా బలహీనమై శరీరము పతనము చెందును. మరల ప్రాణసత్తా సంపాదించుకొని జాగ్రదావస్థను పొందును.

<u>మరణము</u>:- మనఃప్రాణముల సంయోగ వియోగములలో అవస్థలు ఏర్పడుచున్నవి. ప్రాణము మనస్సును తనతో కూడా తీసుకుని శరీరము నుండి బయటపడి మాతృస్థానమైన బ్రహ్మాండమును చేరును. అప్పుడు స్థూల శరీరము చేష్టలుడిగి శిథిలమగును. మరల వాసనా ప్రభావముచే మనః ప్రాణములలో నున్న గుర్తు మరల జన్మకు కారణమగుచున్నది.

<u>సమాధి</u>:- జాగ్రదావస్థ ద్వారా స్వస్వరూప జ్ఞానమును పొందు స్థితి. ఇది సవికల్పము నిర్వికల్పము. వ్యవహార కాలమంతయు తాను విన్నగురుప్రబోధచే తాను బ్రహ్మస్వరూపుడను అని భావించుకొనుట సవికల్పము. అట్టి భావన తీవ్రరూపమై, ఆరూఢమై అప్రయత్నముగా వ్యవహారము జరుపుచున్న పై భావమునందే మనస్సు నిలచియుండు అదియే నిర్వికల్ప సమాధి అని చెప్పబడును.

పైనపేర్కొన్న అవస్థలయందు గుర్తు తాత్కాలికముగా పనిచేయుచున్నది. అట్టి స్థితి పొందినవారు తమ శరీరము ను గురించిగాని, తనగురించి గాని ఏమాత్రమూ గుర్తులేకుండా ఉందురు. ఈ స్థితి యందు

లేనివారు మాత్రమే వారిని గుర్తించగలరు. ఇవి తాత్కాలిక స్థితులు మాత్రమే. మార్పులకు లోనై వుత్థాన దశయందు చేరుటకు వీలున్నది. ఎరిగినవారైనా ఎరగకున్నవారైనా జనన మరణ ప్రవాహములోనివారే అగుదురు. గురుమూర్తి అనుగ్రహముచే పరిపూర్ణ బోధ ద్వారా (ద్వాదశి, షోడశి) మంత్రముల వివరణ దృఢపరచుకొన్నవారు మాత్రమే భ్రాంతి రహిత విధానము పొందగలరు. వారికి మాత్రమే జనన మరణ రాహిత్య స్థితి కలుగును.

**కం॥ పరిపూర్ణ మెరుకలివియని। యెరుగనిబయలందు లేనియెరుక**
**తనకుదా। నరుదెంచిట గురుశిష్యుల। తెరగున మాట్లాడిరెంట్ని।**
**దెలసీతాజనునూ। ఆపైమాట। పలికెదేదికనూ। అరమారలేక**
**నేనెరిగించి నట్టియీ। గురుబోధ పాత్రులనెరు గాక। తెలిపేవు।**
**తెలసీతా జనునూ। ఆపైమాట పలికేదేదికనూ॥ 218**

## ప్రతిపదార్థము

పరిపూర్ణ మెరుకలివియని = ఇది పరిపూర్ణము, ఇది ఎరుక అని

యెరుగని బయలందు = రెంటిని గుర్తించని పరిపూర్ణము నందు

లేని ఎరుక = దానియందు లేక తోచు గుర్తు

తనకు తానరుదెంచి = తనకుతానుగానే తోచబడి

ఇటు = ఈ సందర్భములో

గురు శిష్యుల తెరగున మాట్లాడి=గురు శిష్యుల బోధనాపద్ధతిగా చర్చించుకొని

రెంట్ని తెలిసి=పరిపూర్ణము, ఎరుకలను వస్తునిశ్చయ పూర్వకముగా గుర్తించి

తాజనును = గుర్తించిన తాను లేకుండా పోవును

ఆపైమాట పలికేదేదికను = ఆపైవున్న పరిపూర్ణమును గుర్తించుటకు ఎవరూలేరు, ఉండరు.

అరమరలేక = ఎట్టిఅనుమానము లేక

నేనెరిగించినట్టి ఈ గురుబోధను = ప్రబోధించిన పరిపూర్ణబోధను

పాత్రుల నెరుగాక = యోగ్యతకలవారికి కాక

తెలిపేవు = చెప్పవద్దు సుమా

## తాత్పర్యము

ఇది పరిపూర్ణము, ఇది ఎరుక అని గుర్తించే గుర్తు ఏమాత్రము లేక స్వత:సిద్ధమైన అచల పరిపూర్ణమునందు మూలము గాని, స్థానముగాని లేకనే తనకు తానుగానే తోచబడి గురు శిష్యన్యాయముగా ప్రబోధచే ప్రకాశించబడి ఎరుక, పరిపూర్ణము లను వస్తునిశ్చయపూర్వకముగా దృఢపరచుకొని చివరకు తాను లేకపోవును. ఆపై వున్న అచల పరిపూర్ణమునుగూర్చి ఇట్టిది అని చెప్పువారు ఎవరూ వుండరు. ఇందులకు ఎట్టి అనుమానమునకు, సందేహమునకు లోనుకాక, నేను ప్రబోధించిన పరిపూర్ణభావమును యోగ్యతకలవారు అనగా త్రికరణశుద్ధి ప్రవర్తన, నాలుగు శుశ్రూషలయందు ఏమరపాటు లేనివారికి మాత్రమే తిరిగి చెప్పవలసినదిగా గ్రహించవలెను.

కం॥ స్థిరమగుపరిపూర్ణమున। స్థిరమగుయీ యెరుక నెరుక
దెలియుజగములన్। యెరిగినదెరుకేకద న। ద్గురుకృప
చేయెరుకబోతె। గురుశిష్యులేరీ। నోరెత్తాక। మరివినరోరి। గురుని
పాదములాన గురుతులేనటువంటి। పరిపూర్ణ మొకటుండు
పలుకరాదట్లుంటె। గురుశిష్యులేరి। నోరెత్తాక। మరి వినరోరీ॥ 219

## ప్రతిపదార్థము

స్థిరమగు పరిపూర్ణము = కదలనటువంటి స్వత:సిద్ధమైన వస్తువు

అస్థిరమగు ఎరుక=చలాచలా లక్షణములు కలిగి మార్పులకు లోనైన గుర్తు

ఈ ఎరుకన్ దెలియు జగములన్ = ఈ తెలివిచేత తెలియబడు ప్రపంచము

యెరిగినది ఎరుకే కదా=మొత్తమంతా గుర్తుచే తెలియ బడుచున్నదే కదా

సద్గురుకృపచే ఎరుక బోతే = గురు అనుగ్రహముచే, పరిపూర్ణబోధవలన పరిపూర్ణము వున్నది ఎరుక లేదు అని దృఢపరచుకొన్న మీదట

గురుశిష్యులేరీ = గుర్తుచే ప్రకాశించు గురువు, శిష్యుడు అను రెండు తత్వములు ఇక మిగిలి వుండరు

నోరెత్తాక మరి వినరోరి = ఈనిర్ణయ విధానమందు ఎట్టి సందేహములేక

దృఢపరచుకొనుటకు ప్రయత్నించుము
గురునిపాదములాన = గురుపాదముల సాక్షిగ
గురుతు లేనటువంటి = గుర్తెరిగే శరీరము ఏమాత్రము లేకుండా
పరిపూర్ణమొకటుండు = స్వత:సిద్ధమైన పరిపూర్ణము మాత్రము ఉండును.
పలుకరాదట్లుంటె=గుర్తించుటకు గుర్తు లేదు కనుక ఉన్నదని ఎట్లుచెప్పగలము

## తాత్పర్యము

కదలక, మార్పులేనటువంటి అచల పరిపూర్ణమును కదలిక మార్పులకు లోనై యున్నగుర్తెరిగే తెలివిని, దీనిచే తెలియబడునటువంటి ప్రపంచమును తెలియ జేయునటువంటిది, తెలుసుకొను నటువంటిది ఒక్క గుర్తే కదా! గురువు అనుగ్రహముచే పరిపూర్ణబోధ ద్వారా పరిపూర్ణము ఉన్నది, దానియందు ఎరుక లేదు అని దృఢపరచు కొన్నమీదట, విచారణచేయు గురుశిష్యులు ఇరువురు. గుర్తు విడచుటచేత లేకపోవుదురు. ఇట్టి నిర్ణయ విధానమునందు ఎట్టి సందేహములకు, అనుమానముకు లోనుకాక విన్నది విన్నట్లుగా దృఢ పరచుకొనుటకు ప్రయత్నించుము. సద్గురు పాదముల సాక్షిగా గుర్తెరిగే తెలివి లేనటువంటి పరిపూర్ణము మాత్రమే స్వత:సిద్ధమై యున్నది అని నిర్ణయించుటకు గుర్తు లేకుండును. కావున అనుభవము చెప్పుటకు వీలు కాదు.

## గురునిర్ణయము

గురువు అనగా మార్గదర్శకుడు. ఉపదేశికుడు, తరింపజేయువాడు అని సామాన్య అర్థము. బ్రహ్మ విద్యంతయు గురుశిష్య న్యాయముగా పరంపరాప్రోక్తమై ప్రకాశించుచున్నది. గురువులేని విద్య గుడ్డివిద్య. శాస్త్రం చెప్పలేనటువంటిది బ్రహ్మవిద్య. శాస్త్రమందు గురువులను 8 తరగతులుగా విభజించియున్నారు.

1. బోధకగురువు:- శాస్త్రమందలి శబ్ధములను, శబ్ధార్థములను బోధించువాడు.
2. వేదక గురువు:- తత్వమును దర్శింపజేయువాడు.

3. నిషిద్ధ గురువు:- కామ్యకర్మలచేత యిహపరములందు సుఖదు:ఖములను కల్గింపజేయువాడు.

4. కామ్యక గురువు:- యిహ పరములందు పుణ్యకర్మాచరణచే సుఖమును కల్గించువాడు.

5. సూచక గురువు:- శమాదిగుణముల కల్గజేయువాడు

6. వాచక గురువు:- ప్రపంచ విషయములందు విరక్తి కలిగించి బ్రహ్మజిజ్ఞాస కలిగించువాడు

7. కారణ గురువు :- తత్వమసి మహావాక్యార్థ జ్ఞానము ద్వారా బ్రహ్మజ్ఞానము కలిగించువాడు

8. విహిత గురువు :- నిత్యముక్తిని ఉపదేశించువాడు

ఈ 8 లక్షణములకు వేరై ఉన్నవాడు పరిపూర్ణబోధగురువు. ఇతడు పరంపరానుగతంగా గురువునాశ్రయించి, ఉపదేశ క్రమంలో పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాని సర్వభ్రాంతి స్థితిరహితమందు గురువాజ్ఞానుసారముగా జీవించువిధానములో బోధాధికారియై ఉన్నవాడు మాత్రమే పరిపూర్ణబోధను యితరులకు ఉపదేశించుటకుఅధికారిగా చెప్పబడుచున్నాడు.

కం॥ బయలెరుకలు శిష్యునకున్। దయతో గురుడెరుకజేసి తరువాతను
సం। దియమేమిలేకయెరుకన్ నయముగ విడిపించు గురుడు।
నయశాలిగాదా। నీమదికిది। నాటేన లేదా। భయభక్తి గురు
సార్వభౌమూనిసేవ। నిశ్చయమూ గజేసీతె। జయమందెదవు
గురుడు। నయ శాలిగాదా। నీమదికిది। నాటేనలేదా॥ 220

## ప్రతిపదార్థము

బయలెరుకలు = పరిపూర్ణము, ఎరుకలను

శిష్యునకున్ = తన్నాశ్రయించి, శిక్షణకు సిద్ధమై యున్నవాడు

దయతో = ప్రేమతో

గురుడెరుక జేసి = వస్తునిశ్చయ పూర్వకముగా పైరెంటిన్నిగూర్చి దృఢపరచి

తరువాత = ఆపైని
సందియ మేమీలేకను = సందేహమేమీ కలుగకుండా
నయముగా = సునాయాసంగా, తేలికగా
ఎరుకన్ విడిపించు గురుడు = జనన మరణ భ్రాంతికి కారణమైన గుర్తెరిగే శరీరము ఏమీలేదని దృఢపరచగలవాడు
నయశాలికాదా = ఎంతో శ్రేష్టమై వున్నవాడు
నీమదికి నాటెనా లేదా=పైన చెప్పిన అంశములన్ని నీకు బాగా దృఢమైవున్నవికదా!
భయ భక్తి = భయము, భక్తితో కూడిన త్రికరణ శుద్ధిప్రవర్తనచే
గురుసార్వభౌముని సేవ = సద్గురు మూర్తి చెప్పిన విధంగా
నిశ్చయముగా జేసితె = ఎట్టి అనుమానము లేకుండా పాటించగలిగితె
జయమందెదవు=పరిపూర్ణబోధ ఆరూఢమై సర్వభ్రాంతి రహితస్థితి పొందగలవు

## తాత్పర్యము

తననాశ్రయించిన శిష్యునికి పరిపూర్ణబోధ ఆరూఢమగుటకు కావలసిన శిక్షణనిచ్చి క్రమపద్ధతిలో సిద్ధాంతమందలి అంశము (పరిపూర్ణము, ఎరుకలనుగూర్చి) వస్తునిశ్చయ పూర్వకంగా ఉపదేశించి చివరి అంశమైన ఎరుక విడచు విధానము అత్యంత ప్రేమ వాత్సల్యములతో ప్రబోధించి, అత్యంత తేలికగా బోధ దృఢపరచగలుగు వాడు పరిపూర్ణ బోధయందు సమర్థుడైన గురువుగా భావించుము. ఈ క్రమమంతయు నీ మనస్సుచే స్పష్టముగా విచారించుము. భయ భక్తులు కలిగి, త్రికరణశుద్ధి ప్రవర్తనచే జీవించునట్టి శిష్యునికి ఎరుక తనకు తానుగానే లేకపోవుచున్నది. ఇట్టి ఆరూఢత గుర్వనుగ్రహము మాత్రముచేతనే కలుగ గలదు.

కం॥ పదిరెండక్షరములుగల। సదమలమంత్రార్థమెరిగి సద్గురు కృపచే।
పదియారక్షరములుగల। యది యెట్టిదొతెలసెనేని। యతడెసద్గురుడూ। యివిరెండెరుగ। నతడేటిగురుడూ। మొదటిది పరిపూర్ణమును దెల్పు నెరుకాను। తదనంతరపుది బోధనుజేయునివి దెలిసి। నతడెసద్గురుడూ। యివి రెండెరు గనతడేటి గురుడూ॥ 221

## ప్రతిపదార్థము

పదిరెండక్షరములు గల = 12 అక్షరములతో కూడిన (ద్వాదశి)
సదమల = అత్యంత శ్రేష్టమైన
మంత్రార్థము = స్వత:సిద్ధమైన పరిపూర్ణ పరబ్రహ్మము
ఎరిగి = గుర్తించి
సద్గురు కృపచే = గుర్వనుగ్రహముచే
పదహారక్షరములుగల = 16 అక్షరములతో కూడిన (షోడశి)
అదిఎట్టిదో = మూలము లేని గుర్తెరిగే శరీరము ఎటువంటిదో
తెలిసెనేని = గుర్తింప జేసినవాడు
అతడే సద్గురుడు = అట్టివానినే సద్గురువనే శబ్ధముచే చెప్పబడును.
యివి రెండెరుగ=ద్వాదశి, షోడశి మంత్రార్థ, మంత్ర రహస్యము నెరిగినవాడు
అతడేడీగురుడు=బాగాదృఢ పరచుకొన్న మీదట గురువను శబ్దమిక మిగిలి వుండదు
మొదటిది పరిపూర్ణము తెలుపు = మొదటి వాక్యము తాను లేకపోతూ వున్న పరిపూర్ణమును సూచించును
ఎరుకాను తదనంతరపుది బోధను చేయును = షోడశి వాక్యము ద్వారా ఎరుక లేక పోయిన విధానమును
యివి తెలిసి నతడె సద్గురుడు = పైక్రమమంతయు స్పష్టముగా దృఢపరచు కొన్నవాడె సద్గురువుగా చెప్పబడుచున్నాడు

## తాత్పర్యము

పరంపరగా వచ్చు క్రమంలో గురుముఖత: వస్తు నిశ్చయ పూర్వకముగా "ఈ ఉత్తబట్ట బయలేమీ లేదు" అను ద్వాదశి మంత్రమును "మూలము లేని గుర్తెరిగే శరీరం ఏమీ లేదు" అను 16 అక్షరములతో కూడిన షోడశి మంత్రముల యొక్క నిజాభిప్రాయములను అరూఢపరచుకున్న వాడే సద్గురువుగా చెప్పబడుచున్నాడు. వాక్యములు మాత్రమే ఉపదేశిస్తూ వాటి వస్తునిశ్చయ జ్ఞానము పొందనివాడు సాంప్రదాయపద్ధతిచే సద్గురువుగా చెప్పతగదు. మొదటివాక్యము

ఉన్నపరిపూర్ణమును సూచిస్తూ తాను లేకపోవుచున్నది. రెండవదియైన షోడశి తాను లేకపోవు విధానము దృఢపరచు చున్నది. ఈ రెండంశములు దృఢపడినమీదట గురుశబ్ధము మిగలదు అని తెలియ వలెను.

కం॥ పరిపూర్ణమిదుగొయిదుగో। యెరుకను చూపించిలేని। యెరుకను
లేందం। చెరిగించినగురుడేసరి। యెరుకనునిల్పేటి గురుడు।
యెందూకోయన్నా। తద్బోధ। నీకెందుకో యన్నా। శరణన్న
వారిమస్తకమందు చెయిబెట్టి। తిరమూగ యెరుకాను తీసి
వెయ్యనివాడు। యెందూకోయన్నా। తద్భోధనీ। కెందుకోయన్నా॥ 222

## ప్రతిపదార్థము

పరిపూర్ణము ఇదిగో ఎరుకను చూపించి = వస్తు నిశ్చయ పూర్వకముగా ఎరుక, పరిపూర్ణములను గుర్తింప జేసి
లేని ఎరుకను = వున్న పరిపూర్ణమునందు లేక తోచుచున్న గుర్తును
లేదంచెరిగించిన = షోడశి వాక్యము ద్వారా లేదని దృఢ పరచిన
గురుడే సరి=అట్టి నిర్ణయ విధానము కలవాడె పరిపూర్ణగురువుగా చెప్పబడుచున్నాడు
ఎరుకను నిల్పేటి గురుడెందుకోయన్నా = అధిష్టాన రూపమైన అఖండ ఎరుకనే మోక్షస్థానమని నమ్మించి భ్రమకు లోను చేయు గురువుతో పనిలేదు
తద్బోధ నీకెందు కోయన్నా=అట్టివారు బోధించే భ్రాంతి సహిత బోధతో నీకు పనిలేదు
శరణన్న వారి మస్తకమందు చెయిపెట్టి = తన్నాశ్రయించిన వారికి మంత్రదీక్ష ఇచ్చి
స్థిరముగ = శాశ్వతముగ
ఎరుకను తీసివెయ్యని = జన్మకర్మలకు కారణమైన గుర్తెరిగే తెలివిని రద్దు పరచని వాడు

## తాత్పర్యము

పరిపూర్ణబోధయందు ముఖ్యాంశములైన ఎరుక, పరిపూర్ణము అను వస్తువులను శబ్ధములతో పాటుగా వస్తువులను కూడా స్థాన, స్వరూప, స్వభావములతో శిష్యునిచే గుర్తింపజేసి చివరికి జన్మకర్మల భ్రాంతులకు కారణమైన ఎరుకను విడిపించి (లేనే లేదని దృఢ పరచి) పరిపూర్ణస్థితిని

కలిగించు సాంప్రదాయ బద్ధమైన పరిపూర్ణగురువే సార్ధక నామధేయుడై ఉన్నాడు. మంత్రములను (ద్వాదశి, షోడశి) మాత్రమే ఉపదేశించి, వాటి అర్ధము, రహస్యములను తనకు తోచిన విధంగా వ్యాఖ్యానించి ఎరుక భ్రాంతినుండి, పట్టునుండి తప్పించలేని గురుడు గాని, వారిప్రబోధతో గాని నీకు పనిలేదు. తన్నాశ్రయించిన వారికి సిద్ధాంత వాక్యములను మంత్రములుగా హస్త మస్త సంయోగము ద్వారా శిష్యునకుపదేశ మిచ్చి, వస్తునిశ్చయ జ్ఞానమును ప్రబోధించి, ఎరుక రహిత స్థితిని కలిగించని వానితోగాని, వాని బోధతో గాని నీకు పనిలేదు అని తెలియ వలెను.

**కం॥ యెరుకభ్రమగల్గు శిష్యుని। పరితాపముమాన్పి నట్టి పండితుడెతడో।
గురుడతడెకాని గురువులె। గురువులమని పొట్ట కొరకు
గొలిగేవారెల్లా। వారికీ బోధ। తెలియూటకల్లా పరిపూర్ణమును లేని
యెరుకానేర్పడదెల్పి। యెరుకాను విడిపించ నెరుగాక। గురువులై
గొలిగే వారెల్లా। వారికీబోధ। తెలియూట కల్లా॥ ।     223**

## ప్రతిపదార్థము

ఎరుక భ్రమకల్గు = అధిస్టాన రూపమైన ఎరుక పరిణామ రూపమగు జీవేశ్వరజగత్తు యందలి మార్పులు లేక పరిణామములు లేక సుఖ దుఃఖములు

శిష్యుని పరితాపము=తన్నాశ్రయించిన శిష్యుని సుఖదుఃఖములు లేక జన్మ పరంపరలు

పరితాపము = దుఃఖము, బాధ, కష్టము, సమస్య, ఆందోళన

మాన్పునట్టి = లేకుండా చేసినట్టి, రద్దుచేసినట్టి, పోగొట్టునట్టి

పండితుడెవడో = నిర్విద్యారూపమైన పరిపూర్ణమునందు స్థితి గలిగి యున్నవాడు ఎవడో

గురుడతడే గాని = అతడే పరిపూర్ణ భావము చెప్పగల సమర్థుడు గాని

గురువుల్, గురువులమని = గురుశబ్దము చే వేషధారణలో కనబడి, శిష్యులను సేకరించి, మేము కూడాసాంప్రదాయబద్ధులమే అని ప్రచారం చేసుకుంటూ

పొట్టకొరకు గొలిగే వారెల్లా = గురు ధర్మమును వారి ఆకలి భాధను తీర్చుకొనుటకు మాత్రమే ఒక మార్గముగా మలచుకొనేవారు

వారికీ బోధ తెలియుట కల్ల = సాంప్రదాయ మందున్న రహస్యమైయున్న వస్తు నిశ్చయ ప్రబోధ వారికే మాత్రము తెలియదు

పరిపూర్ణమును, లేని ఎరుకను ఏర్పడతెల్పి = స్వత:సిద్ధమైన పరిపూర్ణము, లేని ఎరుకలను వస్తు నిశ్చయ పూర్వకముగా వేరుచేసి చూపించి

ఎరుకను విడిపించనెరుగాక = మూలము లేని గుర్తెరిగే శరీరము ఏవిధముగా లేకపోవుచున్నదో తెలియపర్చక

గురువులై వున్నవారు = గురువులుగా చలామణి అవుతున్నవారు

## తాత్పర్యము

84 లక్షల జీవరాశులలో అత్యంత శ్రేష్టమైన మానవో పాధికి వచ్చి, పరమ పురుషార్థమైన మోక్ష ప్రాప్తి ఎట్లు కలుగునో జనన మరణ చక్రపరిభ్రమణము నుండి ఎట్లు బయట పడవలెనో అను తీవ్రమైన ఆవేదనతో తన్నాశ్రయించిన శిష్యునికి ఆశ్రయము కల్పించి, ఉపదేశపద్ధతిచే క్రమపద్ధతిలో పరిపూర్ణబోధను దృఢపరచి జనన మరణ భ్రాంతి రహిత విధానము (సర్వభ్రాంతి రహితస్థితిని) చేకూర్చగలిగి, శాంతిని కలిగింపజేసిన పరిపూర్ణబోధ గురువే గురుశబ్ధముచేత స్తుతింపబడుచున్నాడు. సాంప్రదాయ పద్ధతిగా గురుశిష్య న్యాయంతో ఉపదేశపద్ధతిచే సిద్ధాంత పద్ధతిని (పరిపూర్ణము ఎరిగి, ఎరుకనెరిగి, ఎరుకను మాను) క్రమంలో అధ్యయనము చేయక భుక్తిక్రియకు గురుపదమును ఒక మార్గముగా ఎంచుకొని, శిష్యులను సేకరించి ద్వాదశి, షోడశి వాక్యములు మాత్రం చెవిలో ఉపదేశం చేసి, శిష్యులిచ్చిన కట్నకానుకలు స్వీకరించి, భ్రాంతిరహిత విధానము అనగా ఎటువంటిదో తెలియ పరచక, అసంప్రదాయకులై లోకంలో ప్రచారం చేస్తున్న గురువులకు ఈక్రమ పద్ధతి తెలియదు. వస్తునిశ్చయ జ్ఞాన పద్ధతిగా పరిపూర్ణము, ఎరుకలను గుర్తింపజేసి, పైన ఎరుకను విడిపించుట ఎట్లో సమగ్రంగా తెలిసున్నవాడే “ గురు ” శబ్ధముచేత సూచింపబడుచున్నాడు.

## శుశ్రూష విధానము

పరిపూర్ణబోధ ఆరూఢమగుటకు గురుకృప అత్యంత అవసరము. గురుకృప పొందుటకు శుశ్రూషా విధానము ఒక మార్గముగా చెప్పబడుచున్నది. గురుర్వాక్యము యధా తధంగా అమలు పరుస్తూ ఈచతుర్విధ శుశ్రూషలు పాటించుటచేత గురుకృప పొందవచ్చును. (స్థాన, అంగ, ఆత్మ, భావ శుశ్రూషలు) శుశ్రూషవిధానముచే పరిపూర్ణబోధ గ్రహించుటకు కావలసిన పవిత్రత, పాత్రత సిద్ధించును. ఒక భక్తిచేతనే అందునా అనన్య భక్తిచేతనే పైన చెప్పిన యోగ్యతను పొంద వచ్చునని ఈ కందార్థము చెప్పబడుచున్నది. " జ్ఞాన వినాముక్తిపదం లభ్యతే గురుభక్తిత: " అని గురుగీత యందు పేర్కొనబడుచున్నది. ఆత్మయందు ప్రేమ, ప్రవర్తన యందు భీతి కలిగి ఉండుటయే భక్తి లక్షణం. త్రికరణ శుద్ధి ప్రవర్తన యందున పారమార్థిక త్రికరణశుద్ధి (ఆత్మ శుశ్రూష) భక్తుని కుండవలసిన లక్షణముగా చెప్పబడుచున్నది. భక్తి త్రయములో అనన్యభక్తిని ప్రముఖముగా చెప్పవచ్చును. ఇట్టి అధికారముతో పరిపూర్ణబోధ ఆరూఢపరచు కొనుటకు కావలసిన యోగ్యతను సంపాదించుకొన వచ్చును.

**కం॥ గురుశుశ్రూషనొనర్చుట। నెరిగించదనెట్లన యేర్పడ వినుమా।**
**నరులిష్టదైవములకున్। పరిచర్య యొనర్చునట్లుభ। క్తీతోడుతనూ।**
**గురుమూర్తిక। త్వ్యక్తితోడుతనూ। నిరతామర మరలేకనీవు**
**నల్పితివేని। గురుబోధమరుగు। సద్గురునీ। చెదెలిసేవు।**
**భక్తితోడుతనూ। గురుమూర్తిక త్వ్యక్తితోడు తనూ॥ 224**

## ప్రతిపదార్థము

గురుశుశ్రూష=గురుమూర్తికి చేయవలసినసేవా పద్ధతులు, అందలితరగతులు
ఒనర్చుట = చేయువలసిన క్రమమును
ఎరిగించెద = వివరించెద
ఎట్లనిన = ఏవిధంగా అనగా
ఏర్పడ వినుమా = స్పష్టముగా గుర్తించుము

నరులు = మానవులు
ఇష్ట దైవములకున్ = తమకు ప్రీతి కలిగిన దేవతలకు
పరిచర్యలు = భక్తితో ఆచరించు పూజా పునస్కారములు
యొనర్చునట్లు = చేయుచున్నట్లు
భక్తితోడుతను = త్రికరణ శుద్ధితో
గురుమూర్తికి = తనకు మంత్రదీక్షను ప్రసాదించిన గురుమూర్తికి
అత్యుక్తి తోడుతను = అత్యంతశ్రద్ధతో
నిరతము = ఎల్లప్పుడూ
అరమరలేక = ఎట్టి సందేహాలకు లోను కాకుండా
నీవు సలిపితి వేని = నీవు ఆచరించితి వేని
గురుబోధ మరుగు = పరిపూర్ణ బోధయందు గలరహస్యము
సద్గురుని చే తెలిసేవు = గురుముఖత: బోధనారూపంగా దృఢపరచుకొందువు

## తాత్పర్యము

గురు కృపకల్గుటకు శిష్యుడు గురుమూర్తికి చేయవలసిన సేవనా విధానము స్పష్టముగా విడమరచి యిందు వివరింప బడుచున్నది. ప్రపంచములో మానవుడు దేవతానుగ్రహమును కోరి ఇష్టదేవతకు భక్తి శ్రద్ధలతో, అన్యముకాని చింతనతో ఎట్లు పూజాధికములు నిరంతరము చేయుచూ ఆదేవతానుగ్రహమును పొందుటకు ఎట్లు ప్రయత్నింతురో ఆ విధంగానే తనకు మంత్రోపదేశం చేసిన గురుమూర్తికి అత్యంత భక్తి శ్రద్ధలతో అనుష్టానాదికములు, పూజాదికములు, సేవాదికములు చేసి గురుకృప పొందుట ద్వారా పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను క్రమములో ఆరూఢత చెందగలుగును అని తెలియ వలెను.

## గురు మంత్ర నిర్ణయము

గురుమంత్రమనగా గొప్ప మంత్రము అని సామాన్యార్థము. మంత్ర శాస్త్ర ప్రకారము మంత్రమునకు కొన్నిముఖ్యమైన లక్షణములు చెప్పబడుచున్నవి. బీజాక్షరములతో కూడినదై ఛందస్సు, నమ:, స్వాహా,

ఫట్, కీలకం అధిష్టాన దేవతతో కూడిన ప్రత్యేకమైన సాంకేతిక పరమైన శబ్ధముచే మహా మంత్రములు ఉపదేశింపబడుచున్నవి. మననము చేయగా చేయగా మంత్రమందు నిక్షిప్తమైన భావములు మనస్సు గ్రహించి శక్తి వంతము కాగలదు. ఏకాక్షరి, ద్వయాక్షరి, త్రయాక్షరి, చతురాక్షరి, పంచాక్షరి, షడాక్షరి, అష్టాక్షరి, నవాక్షరి, దశాక్షరి, ద్వాదశాక్షరి, పంచదశాక్షరి, షోడశాక్షరి, చతుర్వింశాక్షరి మొదలైనవి ప్రముఖమైన మంత్రములుగా చెప్పబడుచున్నవి. ఏ మంత్రమైనా అక్షర సముదాయముతో కూడి యుండును. ఈ మంత్రము లన్నియు పంచాషత్ అనగా 50 అక్షరముల క్రమములో ఏర్పడినవే. పరిపూర్ణ బోధయందు సిద్ధాంతపద్ధతిచే ఒక ముఖ్యమైన భావము శిష్యునికి ఉపదేశించు క్రమములో చెప్పబడిన సిద్ధాంత వాక్యములు (ద్వాదశి, షోడశి) మంత్రములుగా చెప్పబడుచున్నవి. వీటి వివరణ (పరిపూర్ణమునెరిగి, ఎరుకనెరిగి, ఎరుకను మాను అను క్రమములో) బోధ దృఢీకరణార్థము శిష్యునికి ఉపదేశించబడి, వాటియందలి అర్థము వస్తునిశ్చయ పూర్వకముగా దృఢపరచబడుచున్నది. ఇవి అత్యంత రహస్యమై, గురుగోప్యమై, గురుముఖత: మాత్రమే తెలియవలసిఉన్నది. ఈ శీర్షికలో అట్టి మంత్రములు, వాటి అర్థము, మనన విధానము, రహిత విధానము ఆరూఢపరచుకొను విధానము సమగ్రముగా వివరించబడుచున్నది.

**కం॥ మరుపుసుషుప్తి మరణముల్। పరిపూర్ణంబున కుసాటి పరచి**
**యెరుకకున్। మరియాదిమేల్కపుట్టవు। నిరుదెరగుల నెరిగి**
**యెరుక। నెగరాజిమ్మోయీ। ఆపైనుండె। దెరిగెదెట్లోయీ।**
**గురుమంత్రమి దెసుమ్మి మరువాకయే ప్రొద్దుస్మరణ జేసితివేని।**
**తిరిగి వుట్టవునీవి। ట్లెగరజివెమ్మోయీ। ఆపైనుండె।**
**దెరిగెదెట్లోయీ॥** **225**

## ప్రతిపదార్థము

మరుపు = అజ్ఞానము

సుషుప్తి = తనను, ఇతరులను గుర్తులేకుండా మరుపు చెందు స్థితి

మరణము = మనఃప్రాణములు శరీరమునుండి బయటకు వెడలుట

పరిపూర్ణమునకు సాటిపరచి = పరిపూర్ణము తోపోలిక చెపుతూ

ఎరుకకున్ = గుర్తెరిగే తెలివికి

మరి = తర్వాత

యాది = గుర్తు

మేలుక = జాగ్రదావస్థలోకి రావడం

పుట్టవు = తిరిగి జన్మించడం

నిరు తెరగుల ఎరిగి = పైరెండు విధములను స్పష్టముగా దృఢపరచుకొని

ఎరుక నెగరజిమ్మోయి = గుర్తెరిగే తెలివిని విడిచి యుండుము

ఆపైనుండేది = స్వతఃసిద్ధమైన పరిపూర్ణమును

ఎరిగే దెట్లోయి = ఉన్నపరిపూర్ణమును లేని గుర్తు ఎట్లు గ్రహించగలదు

గురుమంత్ర మిదెసుమ్మీ = ఇట్టి భావమును కల్గించగలుగు వాక్యమె

గురుమంత్రమని విశ్వసించుము

మరువక = ఎట్టి నిర్లక్ష్యము చేయక

ఏపొద్దు = త్రికాలముల యందు

స్మరణ చేసితివేని = మననము చేసితివేని

తిరిగి పుట్టవు = జనన మరణ భ్రాంతికి లోనుకావు

## తాత్పర్యము

మనోవాక్కుల కందనిది పరిపూర్ణము. శ్రుతి, యుక్తి, అనుభవముచేత మాత్రమే గురుమూర్తి శిష్యునికి దృఢపరచగల్గును. ఇందు యుక్తి విధానముచే ఎరుక, పరిపూర్ణములను గుర్తింపజేయుట జరుగుచున్నది. మరుపు, సుషుప్తి, మరణములను పరిపూర్ణముతోనూ గుర్తు, మెలకువ, పుట్టుట అనుశబ్ధములచే ఎరుకను పోల్చి వీటియందలి భేదమును గ్రహించుట ద్వారా ఎరుక పరిపూర్ణముల భిన్నత్వము తెలియ పరచుట జరుగు చున్నది. ఈ రెంటి భేదము పైన చెప్పబడిన యుక్తి ద్వారా స్పష్టముగా గుర్తించి, గుర్తించిన గుర్తును విడచి యుండవలెను.

అట్లు విడిచిన పిదప ఉన్నదానిని గూర్చి లేనిది నిర్ణయించుటకు వీలు కాదు. పరిపూర్ణము ఉన్నది అను అంశమును ద్వాదశి వాక్యము ద్వారాను, ఎరుక లేనిది అను అంశము షోడశి వాక్యముద్వారా చెప్పబడుచున్నవి. అందుచే వీటిని గురు మంత్రములుగా లేక వాక్యములుగా సాంప్రదాయమునందు ఉపదేశింప బడుచున్నవి. మంత్ర, మంత్రార్థ, మంత్ర రహస్యములు వస్తునిశ్చయ పూర్వకముగా గుర్తించి, భావన దృఢపడుటకు వీటిని ఎల్లవేళలా మననము చేయగా భ్రాంతి రహిత స్థితి విధానము దృఢము కాగలదు అని తెలియ వలెను.

**కం॥ ఆమంత్ర యుగముదెల్పెద। నేమముతోదలపుముత్తదీ బట్టబ యల్।**
**యేమీలేదని పల్కిన యీ మంత్రమె ద్వాదశాక్ష। రింకోటి వినుమీ।**
**యెప్పుడు నోట। యివి మరువకనుమీ। యీ మూలములేని**
**గుర్తెరిగె శరీరాము యేమీలేదని యంటెయి। దెషోడశాక్షరి।**
**యింకోటి వినుమీ। యెప్పుడునోట। యివి మరువకనుమీ॥ 226**

## ప్రతిపదార్థము

ఆ మంత్రయుగము = ఆపైన పేర్కొన బడిన రెండు మంత్రములు
తెల్పెద = వివరించెద
నేమముతో = అత్యంత శ్రద్ధతో
తలపుము = మననము చేయుము
ఉత్తదీ బట్ట బయల్ ఏమీ లేదని = ఈ ఉత్తబట్ట బయలు ఏమీలేదు
అని పల్కిన = పైవిధంగా చెప్పబడిన
ఈ మంత్రము = ఈ వాక్యము
ద్వాదశాక్షరి = 12 అక్షరములతో కూడి యున్నది
ఇంకోటి విను = ఇంకో మంత్రమును గూర్చి వివరించెదను
ఎప్పుడు = ఎల్లవేళలా
నోటయివి మరువకనుమీ = మరచిపోక మననము చేయుచుండుము
యీ మూలములేని గుర్తెరిగే శరీరము ఏమీలేదు = ఈ మూలములేని

గుర్తెరిగే శరీరము ఏమీలేదు

అని అంటె = ఆ విధంగా చెప్పబడుచున్నదేదో

ఇదెషోడశాక్షరి = ఇదే 16 అక్షరములతో కూడిన షోడశి మంత్రము

## తాత్పర్యము

సిద్ధాంతపరమైన ముఖ్యమైన అంశములను అనగా పరిపూర్ణము వున్నది, ఎరుక లేనిది అను అంశములు దృఢపరచుకొనుటకు మంత్రములుగా రెండు వాక్యములు ఉపదేశకాలములో శిష్యునికి రహస్యముగా చెప్పబడుచున్నవి. మంత్ర, మంత్రార్థ, మంత్రరహస్యములను వస్తునిశ్చయపూర్వకముగా ఉపదేశగురువుద్వారా మాత్రమే వివరణపొంది, నిరంతరము ఈవాక్యముల ద్వారా ఆ అర్థమును దృష్టిలో వుంచుకొని మననము చేసిన ఎడల బోధయందు ఆరూఢత సిద్ధించును. అవి ఏవి అనగా 12 అక్షరములతో కూడి ద్వాదశి వాక్యముగా చెప్పబడుచున్నవి. " ఈ ఉత్త బట్టబయలు ఏమీలేదు ". రెండవది మూలము లేని గుర్తెరిగే శరీరము ఏమీలేదు. అని 16 అక్షరములతో కూడినది షోడశి వాక్యముగాను లేక మంత్రముగాను చెప్పబడుచున్నది. వీటి మననము వలన వున్నది పరిపూర్ణమని లేనిది ఎరుకయని దృఢము కాగలదు.

## గురు మంత్రార్థము

**కం॥ తొలిమంత్రపర్థమెక్కడ। కలదోయని వెతుకనేల కల దంతట**
**యా। వలిమంత్రపర్థమెక్కడ। గలదో యనిచూడ నేల। కాదా**
**చూచేదీ। వినేది యనేది తినేది। అలతొలుతదాన్ని నీవవ**
**లోకనము జేసి। కలకాల మెరుకాలుగలదాన్ని విడువెరుక। గాదా**
**చూచేది। వినేదియనేది తినేది॥ 227**

## ప్రతిపదార్థము

తొలి మంత్రపర్థము = ద్వాదశి వాక్యము యొక్క వస్తునిశ్చయ జ్ఞానము

ఎక్కడ కలదోయని = ఎక్కడ వున్నది అని

వెతుక నేల = వెతుకుట ఎందుకు?

కలదంతట = స్వత:సిద్ధమై తానే అంతటా వ్యాపించి వున్నది.

ఆవలి మంత్రపర్థము = రెండో వాక్యమైన షోడశి మంత్రార్థ వస్తువు

ఎక్కడకలదో అని చూడనేల = ఎక్కడ వున్నది అని వెతుకుటెందుకు?

చూచేది, వినేది,యనేది, తినేది కాదా = పంచేంద్రియ జ్ఞానముచే పనిచేయునదేదో అదే

అల తొలుత దాన్ని=మొదటి వాక్యముద్వారా నిర్ధేశింపబడుచున్న పరిపూర్ణమును

నీవవలోకనము చేసి = గురువాక్యముచే గట్టిగ దృఢపరచుకొని

కలకాలము = ఎల్లవేళలా

ఎరుకాలు గలదాన్ని = గుర్తించే లక్షణము గలిగినదానిని

విడు = విడిచి వుండుము.

## తాత్పర్యము

మొదటి వాక్యమైన ద్వాదశి మంత్రార్థ వస్తువు ఎక్కడ వున్నది అని వెతక వలసిన పనిలేదు. ములుగ్రుచ్ఛ సంధిలేక అంతటా కలిగి యున్నది అని దృఢపరచుకొనుము. రెండవ వాక్యమైన షోడశి మంత్రార్థవస్తువు ఏది అని సందేహించక పంచేంద్రియ జ్ఞానముచే ప్రభావితమవుతున్న గుర్తుగా గ్రహించుము. మొదటి వాక్యముద్వారా పరిపూర్ణమును ఉన్నదని దృఢపరచుకొని, రెండవ వాక్యముద్వారా ఎరుక లేనిది యని ఎల్లవేళల ఈ భావమునకు వేరుకాక జీవించుము.

## గురు మంత్ర జపము

కం॥ రానిదిపోనిదిబయలని। లేనిదియీా యెరుక యనుచు లెస్సగ
దృఢమౌ। దానుకనీవీమంత్రము। మానక జపియింపు చుండు।
మా నీతిశాలి। లేనిదిలేదు। మరువకీజోలీ। లేనిదిలే దాని పూని
నిశ్చయమ్మైతె। తానొక్కటుండునుగాని యట్లన విను।
మానీతిశాలీ। లేనిది లేదు। మరువాకీ జోలీ॥ 228

## ప్రతిపదార్ధము

రానిది పోనిది బయలని=జనన మరణ ప్రవాహమునకు లోనుకానిది పరిపూర్ణమని
లేనిది ఎరుక యనుచు = జన్మకర్మలకు కారణమైన గుర్తు లేనిదని
లెస్సగా = స్పష్టంగా
దృఢమౌదానుక = ఆరూఢపడేవరకు
నీవు = నీవు
ఈమంత్రమును మానక జపియించు చుండుమా = ఎట్టి నిర్లక్ష్యము చేయక మనస్సుచే పైభావమును కలిగి యుండుము
నీతిశాలి = అత్యంత నేర్పరితనము కలవాడా
లేనిది లేదు=వున్నది వున్నట్లుగా దృఢమైన పిమ్మట లేనిది లేక పోవుచున్నది.
మరువకీ జోలి = ఈ రహస్యము ఎప్పుడు మరచి ఉండకుము
లేనిది లేదని = మూలము లేని గుర్తెరిగే శరీరము ఏమీలేదని
పూని నిశ్చయమైతే = గట్టిగా దృఢమైతే
తానొక్కటుండును = స్వత:సిద్ధమైన పరిపూర్ణము మాత్రముండును
కాని ఎట్లన = వున్నదానిని గుర్తించుటకు గుర్తు లేదుకదా!

## తాత్పర్యము

రాక పోకలతో కూడిన కదలిక లేనిది అచల పరిపూర్ణమని, రాకపోకలతో కూడి చలనాత్మకమై వున్నది గుర్తెరిగే ఎరుక యని స్పష్టముగా దృఢమగువరకు ద్వాదశి, షోడశి మంత్రములను వస్తునిశ్చయ పూర్వకముగా గుర్తించి మననము చేయు చుండుము. ఉన్నది ఉన్నదని దృఢమైన పిమ్మట లేనిది లేక పోవుచున్నది. ఇట్టి ఆరూఢత తీవ్రమైన భావనా బలంతో మాత్రమే సిద్ధించును. లేనిది లేదని షోడశి వాక్యముచే దృఢమైన పిమ్మట పరిపూర్ణము స్వత:సిద్ధమై వుండును. కాని ఉన్నదని గుర్తించుటకు గుర్తు మిగిలి వుండదు.

క౦॥ ఇదిదప్పయేమిలేదని। మొదటిదిమొరబెట్టుచుండు
ముదమునవినుమా। యిదియేమిలేదు। పొమ్మని। వదలక
రెండోదిలెస్స। వదరూచుండునురా। బయలెరుకాల నిదినిశ్చ

యమురా। అది గానని రెంటినరసి నీవిప్పుడు। విదితాము
గారెంట్ని। విడరా మంత్రములిట్లు। వదరూ చుండునురా।
బయలెరుకాల। నిదినిశ్చయమురా॥ 229

## ప్రతిపదార్థము

ముదమున వినుమా = సంతోషముతో వినుము
ఇదితప్ప ఏమిలేదని = స్వత:సిద్ధమైన పరిపూర్ణము తప్ప రెండోది లేదని
మొదటిది = ద్వాదశి
మొరపెట్టుచుండు = స్పష్టముగా తెలియ పరచును
ఇది ఏమీలేదు పొమ్మని = మూలము లేని గుర్తెరిగే శరీరము ఏమీలేదని
వదలక = ఎట్టి సందేహము లేక
రెండోది = షోడశి
లెస్స వదరుచుండునురా = స్పష్టముగా తెలియ పరచు చుండును
బయలెరుకాల = పరిపూర్ణము ఎరుకల
ఇది నిశ్చయమురా = ఈవిధముగా స్పష్టముగా దృఢపరచుకొని
అదిగాన = అందుచేత
ఈరెంట్ని = ఎరుక, పరిపూర్ణము రెంట్నీ
అరసి = చక్కగా విచారించి
నీవిప్పుడు = ఇట్టి దృఢపరచుకొన్నమీదట నీవు
విదితముగా = ఎట్టి సందేహం లేకుండా, స్పష్టంగా
రెంట్నీ విడరా = రెండు వాక్యములు విడిచి వుండుము.

## తాత్పర్యము

ఈపరిపూర్ణ భావమును అత్యంత శ్రద్ధతో, సంతోషముతో వినుము. మొదటివాక్యమగు ద్వాదశి ద్వారా స్వత:సిద్ధమైన పరిపూర్ణము మాత్రమే వున్నదని, దానియందు ఇతరమేమీ లేదని స్పష్టముగా తెలియబడుచున్నది. రెండవదైన షోడశి ద్వారా గుర్తెరిగే తెలివి ఏమీలేదని అంతే స్పష్టముగా

నిర్ధారించుచున్నది. ఈ విధముగా వున్నది పరిపూర్ణము లేనిది ఎరుకయని దృఢపరచు కొన్న మీదట పైరెండు వాక్యములను విడిచి యుండుము.

**కం॥ ఉన్నదిపరిపూర్ణములేం। దెన్నటికీ యెరుకయనుచు నిది దృఢమౌదా। కెన్నుమునేబోధించిన తిన్ననియీ బోధ। శిష్య తిలకా మరువకుమీ। సుజనులమ్రోల। పలుకా వెరువకుమీ। నిన్నుకుమ తులువచ్చి నీలోతడిగితెవారీ। కెన్నివిధములనీ। వెరిగింపకిదిశిష్య తిలకా మరువకుమీ। సుజనుల మ్రోల। పలుకా వెరువకుమీ॥ 230**

## ప్రతిపదార్థము

శిష్యతిలకా = శ్రేష్టమైన నడవడిక గలవాడు

వున్నది పరిపూర్ణము = స్వత:సిద్ధమై వున్నది పరిపూర్ణము

లేందెన్నటికీ ఎరుక యనుచు = దానియందు గుర్తే మాత్రములేనిదని

ఇది దృఢమౌదాక = ఇట్టి ఆరూఢత బాగా అనుభవంలోకి వచ్చేదాకా

తిన్నని ఈబోధ = శ్రేష్టమైన ఈ పరిపూర్ణ భావమును

నేబోధించిన = నేను దృఢ పరచినక్రమంలో

ఎన్నుము = చక్కగా గ్రహించుము

మరువకుమీ = వస్తు నిశ్చయ జ్ఞానంద్వారా ఈ అంశములు మరచివుండకు

సుజనులమ్రోల = దీనియందు ఆరూఢత కలిగిన మహాత్ముల ఎదుట

పలుక = నీ ఆరూఢత వివరించుపట్ల

వెరువకుమీ = ఏలాటి భయము పడకు

కుమతులు = పరిపూర్ణబోధయందు ఆరూఢత లేనివారు

వచ్చి = నిన్ను సమీపించి

నిన్ను నీలోతు అడిగితే = బోధ, నీ ఆరూఢతగురించి ప్రశ్నిస్తే

వారికి = అట్టి ఆస్వభావం కలవారికి

ఎన్ని విధముల = ఎన్ని రకాలుగా ప్రశ్నించినా

నీవెరిగింపకు = నీఆరూఢతను ఏమాత్రం వ్యక్తపరచుకు

## తాత్పర్యము

స్వత:సిద్ధమై యున్నది పరిపూర్ణమని, దానియందు గుర్తెరిగే శరీరము ఏమీ లేదని బాగా దృఢమయ్యేదాకా నే ప్రబోధించిన క్రమంలో ఈ బోధను ఏమాత్రము నిర్లక్ష్యము చేయకు. ఇట్టి ఆరూఢత కలిగిన మహాత్ముల ముందు నీకు కలిగిన సందేహమును వ్యక్తపరచుటకు సందేహించకు. గురువునాశ్రయించి క్రమ పద్ధతిలో వస్తునిశ్చయ పూర్వకముగా దృఢపరచుకొనక కేవలం సిద్ధాంత వాక్యమలైన ద్వాదశి, షోడశి వాక్యములు మాత్రమే తెలిసి నీ వద్దకువచ్చి, నీ ఆరూఢతను ప్రశ్నించే అల్పబోధ పరాయణులకు ఇందలి రహస్యములు ఏ మాత్రము తెలియ పరచవద్దు.

## ఫలనిర్ణయము

సాంప్రదాయ పద్ధతిగా పరిపూర్ణ భావమును వస్తునిశ్చయపూర్వక ముగా గురు శిష్య న్యాయములో తాను దృఢపరచుకొని, సర్వ భ్రాంతి రహితస్థితుడై, గుర్వాజ్ఞానుసారముగా గురుధర్మమును లోక కల్యాణము కొరకు ప్రచారము చేయడానికి గుర్వనుజ్ఞను తీసుకొని, శిష్య సేకరణ చేసి సాంప్రదాయ ధర్మమును అవిచ్ఛిన్నముగా ప్రకాశింపజేయ గల్గును. అట్లే క్రమము పాటించక వూహాపోహలచే, మిడి మిడిజ్ఞానముతో, తానుగ్రహించిన అసమగ్రమైన విచారణనే సాంప్రదాయం పేరుతో ప్రచారములోనున్న అల్పబోధ పరాయణుల వలన సమాజమునకు, అటు సాంప్రదాయమునకు ఎట్టి ప్రయోజనము వుండజాలదు. జనన మరణ భ్రాంతి రహిత విధానము కలుగ జాలదు.ఈ కందార్థ రచన యందు జనన మరణ భ్రాంతి రహిత విధానమే ముఖ్యమైన మార్గముగా ఉపదేశింప బడుచున్నది.అట్టి విధానమందు స్పష్టమైన ఆరూఢత గలవారిని ఆశ్రయించుట మాత్రము చేతనే భ్రాంతి రహిత విధానమున ఫలము పొందనగునని ఈ శీర్షిక ద్వారా చెప్పబడుచున్నది.

కం॥ పరిపూర్ణబోధనెరిగిన। గురువరుచేబోధగొన్న గొప్ప ఫలంబౌ।
పరిపూర్ణ బోధనెరుగని। గురువరుచే బోధగొన్న గొప్పా ఫలమౌనా।
అదియెట్లన్న కూడిరతిలోనా। పురుషుని చేనంతు
పొలతిబడయును బడయ। తరమౌనవారికె। తమ వంటి
వారిచె। గొప్పా ఫలమౌనా అదియెట్లన్న। కూడిరతిలోనా॥ 231

## ప్రతిపదార్థము

పరిపూర్ణ బోధ = పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మానుట

ఎరిగిన గురువరుచే = ఆరూఢ పరచుకొన్న గురువు ద్వారా మాత్రమే

బోధగొన్న = ఉపదేశక్రమంలో బోధపొందిన

గొప్పఫలంబౌ = జన్మసార్థకత సిద్ధించును

పరిపూర్ణబోధ నెరుగని గురువరుచే = ఇట్టి ఆరూఢత లేనిగురువు నాశ్రయించుటచే

బోధగొన్న = పరిపూర్ణ బోధను గ్రహించిన

గొప్పఫలమౌనా = జన్మ సార్థకత సిద్ధించునా?

అది ఎట్లన్న = ఈ క్రమము ఎట్లున్నదన్న

రతిలోన = సంసారజీవితములో

సంతు = సంతానమును

పురుషునిచే పొలతి కూడి = భార్యా భర్తలిద్దరూ కలిసి జీవించుట చేతనే

బడయును = పొందవచ్చును

బడయ తరమౌనా = పొందుట వీలగునా?

వారికే తమవంటి వారిచే = స్త్రీ + స్త్రీ, పురుషుడు + పురుషుడు అను ఈ క్రమంలో

## తాత్పర్యము

జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు పరిపూర్ణబోధైక ముఖ్యమైన మార్గముగా సూచించబడు చున్నది. సాంప్రదాయబద్ధమై పరంపరా ప్రోక్తమై, గురుశిష్యన్యాయముగా మాత్రమె ప్రబోధించుటకు వీలై వున్నది. పరిపూర్ణ మెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను క్రమములో వస్తునిశ్చయ జ్ఞానము ద్వారా మాత్రమె దృఢ పరచుకొన గలుగు బోధనా

క్రమము కలిగి యున్నది. అట్టి గురు పరంపరలో నున్న గురువును ఆశ్రయించిన మాత్రము చేతనే బోధయందు ఆరూఢత చెంది జన్మ సార్ధకత కలుగును. సాంప్రదాయము పేర ఇట్టి క్రమవిధానమందు ఆరూఢత చెందకనే, కేవలం సిద్ధాంత వాక్యములనే వల్లిస్తు, లౌకిక ప్రయోజనము మాత్రమె ఆశించి, ప్రబోధించు వారిని ఆశ్రయించుట చేత జన్మ సాఫల్యం చెందజాలరు. ఎట్లనగా సంతానాపేక్ష కొరకు స్త్రీ పురుష లిరువురూ ధర్మ పద్ధతిగా భార్యా భర్తలుగా మారి, సంసారజీవితముచే సంతానవంతులు కాగలుగుదురు. అట్లుగాక ఇద్దరు స్త్రీలు గాని, ఇద్దరు పురుషులుగాని సంసార జీవితముచే ఎట్లు సంతాన వంతులు కాలేరో, ఆవిధంగానే సాంప్రదాయ మందలి గురుశిష్య న్యాయము, బోధనా క్రమము చేత మాత్రమే జనన మరణ భ్రాంతి రహిత విధానము చేకూర గలదు అని తెలియ వలెను.

**కం॥ పరిపూర్ణబోధనెరుగని। గురుశిష్యులుబోధకొరకు కోర పనిబడున్।**
**గురువర్యునొకనిమరలను। హరువరమున బుట్టినట్టి। యా**
**శిఖండికినీ। భార్యైనట్టి। యబలతండ్రికినీ। వరుల నిద్దరిని**
**దేవలెనీ। యల్లుడునేను। వరియింతుమని చెప్పు। వనిత నంపిన**
**యట్లు। యా శిఖండికినీ। భార్యైనట్టి। యబలా తండ్రికినీ॥232**

## ప్రతిపదార్థము

పరిపూర్ణ బోధ ఎరుగని గురుశిష్యులు = పైన చెప్పిన విధంగా క్రమపద్ధతిలో విచారించని గురుశిష్యులు

బోధ కొరకు = భ్రాంతి రహిత విధానమునకు

కోర పనిబడున్=వీరి కోరిక సిద్ధించుటకు వేరొక గురువును ఆశ్రయించవలసి వున్నది

గురువర్యునొకని = సాంప్రదాయబద్ధమైన గురువును

మరలను = తిరిగి

హరు వరమున బుట్టినట్టి యా శిఖండికి = పరమేశ్వరుని వరప్రభావముచే స్త్రీగా పుట్టి పురుషునిగా మారిన శిఖండి

భార్యైనట్టి యబల = అట్టినపుంసకుని భర్తగా పొందిన స్త్రీ

తండ్రికి = తనకు జన్మ కారణమైన తండ్రి కి
వరుల నిద్దరిని తేవలె=ఇరువురి పెండ్లి కుమారులను ఎంచి తీసుకు రావలెను
నీఅల్లుడు నేను వరియింతుమని = నీఅల్లుడికి, నాకు వారితో వివాహము జరిపించుటకు
చెప్ప వనిత నంపిన యట్లు = పై సందేశమును తన సహాధ్యాయి ద్వారా తండ్రి కి చెప్పిన విధంగా

## తాత్పర్యము

పైన పేర్కొన్న విధంగా సాంప్రదాయమందు చెప్పబడిన క్రమంలో పరిపూర్ణబోధ నారూఢపరచుకొనక ఉన్నవారు మరల భ్రాంతి రహిత విధానము కొరకు యోగ్యత కల్గిన గురువు నాశ్రయించి బోధయందు యిరువురు ఆరూఢత చెందవలసివున్నది. అది ఎట్లనగా స్త్రీ గాపుట్టి ఈశ్వర వరప్రభావముచే పురుషునిగా మారివున్న నపుంసకుని భర్తగా పొందిన కాశీరాజు కుమార్తె తన భర్తను నపుంసకునిగా గుర్తించి, తన చెలికత్తె ద్వారా ఇద్దరు పెండ్లి కుమారులను ఎంచి తీసుకు వచ్చి, తన అల్లునికి, తనకు వివాహము జరిపించవలసినదిగా తన తండ్రికి వర్తమానము పంపించినట్లుగా, అసమగ్రమైన కృషిచే గురుశిష్యులైనవారు ఇరువురు కలసి సమగ్రమైన విచారణ తెలిసిన సాంప్రదాయక గురువు నాశ్రయించుట అవసరమై యున్నది అని తెలియ వలెను.

## గురు కృపా విశేషము

పరిపూర్ణబోధ దృఢపడుటకు గురుకృప అత్యంత అవసరమై యున్నది. గురుకృప అనగా ఉపదేశగురువు ద్వారా బోధనా పద్ధతిచే పొందవలసిన సమగ్రమైన జ్ఞానము అనగా పరిపూర్ణమెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను సూత్రముతో పొందవలసినది దృఢపరచుకొనుట బుద్ధినిశ్చయముగా చెప్పబడుచున్నది. ఇది కూడా గురువును నాల్గు శుశ్రూషలచేతా మెప్పించి నపుడే సాధ్యమగును. ఇట్టి స్థితియందు బోధను దృఢపరచుకొనుట, తిరిగి చెప్పగలుగట అను అంశములలో సామర్థ్యము

సిద్ధించును. కాని చివరి అంశమైన ఎరుకను వీడి గురుర్వాక్యాను సారముగా సర్వార్పణ భావముతో గుర్తును వీడిన స్థితియందు జీవించగలుగుట చాలా కష్టమైన విషయము. ఈశ్వరానుగ్రహ ప్రాప్తి (గురుకృప) అనగా ఎరుక స్వరూపుడు తానై నిలుచుట అనునది సాధ్యమైనపుడే విడిచి జీవించగలుగుటకు వీలగును. ఇందులకు గురూపదిష్ట మార్గములో చెప్పబడిన అనుష్టాన, ఆచరణ పద్ధతులచేతనే వీలగును. ఈ విధానము పాటించుట చేత, బోధ గ్రహించి తిరిగి చెప్పుటలో ఎట్టి గుణ దోషములు కలిగిన అవి అన్నియు పరిహరింపబడి ఈశ్వరానుగ్రహముచే (గురుకృప) బోధయందు ఆరూఢత కలిగి, తగిన విధంగా జీవించు విధానము సిద్ధించును. ఈ అంశమును ప్రముఖముగా చెప్పుటకు ఈ శీర్షికలో పలు దృష్టాంతములద్వారా శిష్యునికి ఉండకూడని అంశములు, ఉండవలసిన అంశములు చెప్పబడుచున్నవి.

కం॥ గురుమూర్తికె దురహంకృతి। దొరకొన్నను దొంగ త్రోవ ద్రొక్కి
నచెవులన్। గురునింద వినినచేసిన। నరునకు పరిపూర్ణబోధ।
నలవీయెతెలియా। కూడదువాన్ని తెలియాక। కలియా। గురుడు
దెల్పనిపుస్తకరీతిచే పూర్ణ। మరసీతినని యెంతో మురసీ నయిాబోధ।
నలవీయెతెలియా। కూడదు వాన్ని తెలియాక కలియా॥ 233

## ప్రతిపదార్థము

గురుమూర్తికి = తనకు మంత్రోపదేశం చేసిన గురువుకు
ఎదుర = ఎదురుగా నిలబడి
అహంకృతి దొరకొన్నను = అహంకారముతో, తలబిరుసు తనంగా వుండకూడదు
దొంగ త్రోవ తొక్కిన = ప్రమాణము చేసిన విధానానికి అనువుగా కాక వేరే సాధనల యందు ప్రవేశించటం
చెవులన్ గురునింద వినిన చేసిన = గురుదూషణ స్వయముగా చేసిన, ఇతరులు చేసినపుడు విన్న

నరునకు = ప్రాణశక్తి విశేషముగా నున్నవాడు
పరిపూర్ణ బోధ = పరిపూర్ణమెరిగి, ఎరుకనెరిగి, ఎరుకను మానుట
అలవియేతెలియ = విచారించినచో సాధ్యమవుతుందా
కూడదు వానిని తెలియాక కలియా = అటువంటి వారితో ఎటువంటి సాంగత్యము పనికిరాదు.
గురుడు తెల్పని = వస్తు నిశ్చయ పూర్వకంగా గురువు ఉపదేశించనిదె
పుస్తక రీతిని = పుస్తకము చదువుట చేత
పరిపూర్ణము అరసితి మని=పరిపూర్ణ బోధయందు సమగ్రమైన ఆరూఢత పొందితి మని
ఎంతో మురిసిన = ఎంతో సంతోషించిన
ఈ బోధ అలివి యె తెలియ = పరిపూర్ణ బోధ పొందుట సాధ్యమౌతుందా?

## తాత్పర్యము

తనకు మంత్రోపదేశము చేసిన గురువు ఎదురుగా అహంకారాభిమానములతో ప్రవర్తించరాదు. గురూపాసనయందు తప్ప ఇతరమైన మార్గములందు ప్రవేశింపరాదు. స్వయముగా గురునింద సేయరాదు. ఇతరులు చేసిన తన చెవులతో విన రాదు. ఇట్టి లక్షణములు గలవానికి పరిపూర్ణ బోధయందు ఆరూఢత కలుగుట సాధ్యము కాదు. అట్టి వారిని గూర్చి ఎట్టి సహవాసము పనికిరాదు. ఉపదేశక్రమమునందు బోధనా క్రమముచే వస్తునిశ్చయ జ్ఞానము ద్వారా పరిపూర్ణబోధను ఆరూఢపరచుకొనక పీఠగ్రంథములను చదివి, బోధ దృఢపరచుకొన్నామన్న వారికి సాంప్రదాయ మందలి సిద్ధాంత పద్ధతి తెలియ జాలదు.

కం॥ జనులందరు గురుబోధను। గనిరాజనులందునేను
గలియకయున్నన్। ననుమన్నింతురెవారని। మనమునదల
పోస్తే బోధ। మర్మామబ్బినా। అబ్బినవారి। ధర్మామబ్బినా। జనన
మరణములేని ఘనమైన త్రోవనే। గననైతినని బోధ గనకున్న।
యీా బోధ। మర్మమబ్బినా। అబ్బినవారి। ధర్మా మబ్బినా॥ 234

## ప్రతిపదార్థము

జనులు = జనన మరణములకు లోనైవున్నవారు

అందరు = పూర్వ పుణ్య విశేషముచే ప్రభావితమైనవారు

గురుబోధను గనిరి = పరిపూర్ణబోధ యందు ప్రవేశించివున్నారు

ఆజనులందు = అట్టివారితో

నేను కలియక యున్నన్ = నేను వారితో కలిసి ప్రవేశించనిచో

నను మన్నింతురె వారని = నన్ను ప్రేమగా తమతో కలిసి జీవింపనిస్తారా?

అని మనమున తలపోసి = ఈ విధముగా ఆలోచించి ఈధర్మంలో ప్రవేశిస్తే

భోధ మర్మమబ్బినా=పరిపూర్ణబోధ యందలి రహస్యములు తెలియ బడునా

అబ్బిన = ఒకవేళ గ్రహింప గలిగినా

ధర్మమబ్బిన = బోధయందు ఆరూఢత సిద్ధించునా

జనన మరణము లేని ఘనమైన త్రోవ నేగననైతి = జన్మ రహిత విధానమునకు సరియైన మార్గమును సూచించు పరిపూర్ణ బోధ యందు నేనెట్లు ప్రవేశింపగలను

అని బోధ గనకున్న=ఈ విధమైన సంస్కార బలముచే గురువు నాశ్రయిస్తే తప్ప

## తాత్పర్యము

పూర్వ పుణ్యవిశేషముచే మోక్షాపేక్ష కోరి, జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు పరిపూర్ణభావమే మార్గముగా గుర్తించి, అందులకు వీలైన సద్గురునాశ్రయించి కృషిచేయుచున్నవారిని చూచి, సామాన్యులు వారితో తనకు గల బంధుత్వమును దృష్టిలోపెట్టుకొని వారి ప్రేమ పొందుటకు, కలసి మెలసి జీవించుటకు తాను కూడా ఈ మార్గములో ప్రవేశింప దలచినచో అట్టి వారికి బోధయందలి రహస్యములు తమ తెలివి తేటలచేత గ్రహింప వీలగును గాని, స్థితియందు ఆరూఢత పొందజాలరు. పూర్వజన్మ పుణ్యముచే పరిపూర్ణబోధ గురుదర్శనము, వారి ఉపదేశము పొంది గురూపదిష్ట మార్గములో కృషి చేసి గురుఅనుగ్రహముద్వారా జనన మరణ భ్రాంతి రహిత విధానము దృఢపరచుకోవలసినదేగాని అనుకరణ ద్వారా వచ్చేది కాదు అని తెలియ వలెను.

**కం॥ మంతనమునగురుబోధను। యెంతో వింతనుచునమ్మి
తింతేకద। యేవింతలుగనరావనిధా। వంతమునొందేటివాని
బ్రతుకెంతకంతే। చింతలులేని గతిగానడింతే। అంతకంతకు
వాని కతిచాదస్తమెకాని। సంతాకూటముతోటి సంభాషించ
డువాని। బ్రతుకెంతకంతే। చింతలులేని। గతిగానడింతే॥ 235**

## ప్రతిపదార్ధము

మంతనమున = మనస్సులో
గురుబోధను = పరిపూర్ణబోధను
ఎంతో వింతనుచు నమ్మితి = ఎన్నో చిత్ర మహత్తులకు, కోరికలకు, భ్రాంతులకు వీలుగా వుండునని తలంచితి
ఇంతే కదా = పరిపూర్ణము వున్నది, లేనిదదే కదా
ఏ వింతలు కానరావు=ఏమహత్తులకు భ్రాంతులకు ఇందులో చోటు లేదు
ధావంతము నొందేటి వాడు = చిన్న మనసుతో కోరికలతో నిండి యున్నవాడు
వాని బ్రతుకు = అతని జీవితము
ఎంత కంతె = జన్మ కర్మలకు లోనైయుండును
చింతలులేని గతి గానడంతె=జనన మరణ భ్రాంతి రహిత విధానమును పొందలేడు
అంతకంతకు = రానురానూ, పోనుపోనూ
వానికతి చాదస్తమెగాని = భ్రాంతి విస్తారమెగాని
సంతకూటమితోటి=పరిపూర్ణభావమునందు ఆరూఢత చెందిన సత్పురుషుల తోటి
సంభాషించడు = భ్రాంతి రహిత విధానము తెలుసు కొనుటకు ఇష్ట పడడు

## తాత్పర్యము

భ్రాంతిరహితమిదం మోక్షం అను సూత్రానుసారంగా సర్వభ్రాంతి రాహిత్యమే లక్ష్యముగా పరిపూర్ణభావము నిర్ధేశింపబడుచున్నది. ఇందలి నిర్మిత విధానము గ్రహించక కొందరు ప్రధమంలో ఈ మార్గమందు ప్రవేశించి, కొంత కృషిసల్పి, భ్రాంతిరహిత విధానమునకు ఇష్ట పడక మనస్సులో పలురకములుగా ఆలోచిస్తూ పెక్కు సందేహాలతో భ్రాంతులకు

లోనై ఉందురు. జనన మరణ భ్రాంతిరహిత విధానమందు వారికి ఆరూఢత కష్ట సాధ్యము. అంత కంతకు ఈధర్మమునకు దూరమై, పలురకాల భ్రాంతులకు లోనై పెక్కు సుఖదు:ఖములు పొందుచు జీవించుట కిష్టపడునే గాని భ్రాంతి రహితం ప్రబోధించు మహాత్ములను దర్శించుటకు గాని, వారితో సాంగత్యముగాని, సాన్నిహిత్యం గాని కల్పించుకొనుట కిష్టపడడు.

## గురుకృపా విహీనుల అనధికార తత్త్వము

కందార్థ రచన ప్రారంభిస్తూ "వినబుద్ధైతే వినుడీ చదివెద మీకేకనుగొన మనసైతే కనుడీ పుస్తకమంత" అని గ్రంథకర్తగారు ప్రప్రథమం లోనే పేర్కొన్నారు. ఆక్రమంలో గ్రంధమును సమగ్రంగా పరిశీలించిన మీదట గ్రంథస్త విషయము అగు పరిపూర్ణబోధ (పరిపూర్ణమెరిగి, ఎరుకనెరిగి, ఎరుకను మాను) అను విషయ నిరూపణ యందు తనకు కలిగిన పరిజ్ఞానము భాషయందు, పాండిత్యమందు అర్థవంతముగా బుద్ధినిశ్చయముద్వారా పొందిన వస్తునిశ్చయ రూపమైన బోధయందు ఆరూఢత గురుకృపలేనిదే సాధ్యముకాదని ఉపదేశక్రమమందలి విధి విధానము పాటించుటకై అందుకు సమర్థుడైన గురువు నాశ్రయించి వాని శిక్షణలో క్రమములో యోగ్యతను, పాత్రతను సంపాదించుకొని బోధ ద్వారా మాత్రమే జన్మ కర్మల భ్రాంతి తొలగగలదని పాఠకుడు గ్రహించి, అందుకు కావలసిన ప్రయత్నము ద్వారా పరిపూర్ణబోధ గురువును దర్శించుటకు ఉపక్రమించును.

**కం॥ ఏ పురుషుడు గురువర్యుని। శ్రీపాదము బట్టలేదో సేలుగ నాతం। డీపుస్తకమును జూచిన। యేపట్టుననిలు వకేగునిది। నిజమయ్యా। నరులారమీ। మదిదెలయరయ్యా యీపరమ గోప్యాము యెవరెరుగరోరయ్యా। నాపల్కుమదిలోన నాటీన వారికెయిది నిజమయ్యా। నరులార। మీమదిదెలియరయ్యా॥**

**236**

## ప్రతిపదార్థము

పురుషుడు = పురమందు శయనించి వ్యవహరించువాడు (క్షరపురుషుడు)
గురు వర్యుని = సాంప్రదాయ పద్ధతి యందు బోధచే ఆరూఢత చెందిన పరిపూర్ణ గురువర్యుని
శ్రీపాదము = సర్వ మంగళ ప్రదమైన శ్రేష్టమైన పాదము
పట్టలేదో = ఆశ్రయించలేదో, పొందలేదో
సేలుగ = చక్కగా
అతండీ పుస్తకమును చూచిన=అట్టివ్యక్తి ఈ కందార్థగ్రంధమును పరిశీలించిన
ఏపట్టున = తక్షణం, వెంటనే
నిలువక = ఆలస్యం చేయక
ఏగు = వెడలి పోవును
ఇది నిజమయ్యా = ఇది సత్యము, వాస్తవము
నరులారా = మానవులారా
మీమది తెలియరయ్యా = మీమనసులో చక్కపరచుకోండి
పరమ గోప్యము = ఇది అత్యంత రహస్యమై వున్నది
ఎవరెరుగ రోరయ్యా = సామాన్యులకు అంతు పట్టని విషయము
నాపలుకు = నామాట, విధానము
మదిలోన నాటిన వారికె=(బాగా)అవగాహన స్పష్టంగా కలిగించుకున్న వారికె
ఇది నిజము = ఇదివాస్తవము

## తాత్పర్యము

ఈ కందార్థ గ్రంథమునందు నిర్దేశించబడిన పరిపూర్ణ భావమును గురూపదిష్ట మార్గమునందు మాత్రమే అనగా గురుశిష్య న్యాయములో శిష్యుడు ఎంతటి గొప్పవాడైనా గురుపాదములాశ్రయించి, మంత్రదీక్ష గైకొని, గురు సేవా శుశ్రూష లొనర్చి గురూపదిష్ట మార్గములో గురుకృపకు పాత్రులై గురోన్ముఖేన జ్ఞాతవ్యనా అన్యదా గ్రంధకోటిభి: అన్నట్లుగా వస్తునిశ్చయ జ్ఞానపూర్వకముగా గ్రంథస్త మందలి విషయ నిరూపణ పరిపూర్ణము ఎరిగి,

ఎరుక నెరిగి ఎరుకను మాను అను క్రమములో బోధను దృఢపరచుకొని, ఆరూఢత కొరకు గురువు నిర్దేశించిన అనుష్టాన, ఆచరణలతో ఈశ్వరానుగ్రహ ప్రాప్తి (గురుకృప) ద్వారా బోధస్థితిని పొందవలసియున్నది. అట్లుకాక కేవలం పుస్తక పరిశీలన ద్వారా ఆరూఢత సిద్ధించదు. పరిపూర్ణ బోధ యందు ఎరుక యొక్క వస్తునిశ్చయ జ్ఞానం అత్యంత అవసరమై ఉన్నది. శ్రీ పాదము అనగా ఇట్టి వస్తునిశ్చయ జ్ఞానమే. పాదమనగా భాగమని అర్థము. ఒక్క పాదము చేతను ఈ విశ్వమంతా నిండి ఉన్నదని, మిగిలిన మూడు భాగములు అమృత మయమైవున్నవని ఈ నాలుగు భాగముల సమగ్ర రూపమే బ్రహ్మ పదార్థమని శ్రుతు లందు చెప్పబడుచున్నది. పరిపూర్ణబోధ ప్రారంభంలో ఈ అధికారము స్పష్టముగా పొందవలసి యున్నది. ఇది అత్యంత రహస్యము, పరమ గోప్యము అయివున్నది. శాస్త్రజ్ఞానం అను శ్లోకంద్వారా ఈ అంశము స్పష్ట పరచ బడుచున్నది. క్రమపద్ధతిలో కందార్థ గ్రంథము పరిశీలించిన వారికి ఈ అంశము స్పష్టము కాగలదు.

## గురువాజ్ఞాను వర్తనము

పరిపూర్ణ బోధయందు పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మానుట అను సూత్రమునందు మూడు అంశములు అత్యంత ప్రామాణికమై ఉన్నవి. ఇందు ఆఖరి అంశమైన ఎరుకను విడచుట అను నది అంత్యంత శక్తి వంతమై కష్ట తరమై, అనుభవనీయమై జీవితాంతము పాటింప దగినదై వున్నది. భ్రాంతి రహిత విధానమందు ఆరూఢత చెందిన వానికి పరిపూర్ణము స్వత:సిద్ధమై వున్నదని దానియందు గుర్తెరిగే ఎరుక ఏమాత్రము లేనిదని దృఢ పరచుకొన్నమీదట అట్టి దృఢ విధానమందు గుర్తించిన గుర్తుకు మూలము గాని, స్థానముగాని లేనిదని, ఏదైనా వున్నచో (ఇంకామిగిలి) అది గురుమూర్తికి సమర్పణ గావింపబడి వున్నదని గుర్తించి, ఉన్నదానినిగూర్చి నిర్ణయము గాని, లేనిదానినిగూర్చిన నిర్ణయముగాని ఏమీ లేనిది అను నిర్ణయ విధానముగాని లేక అచల స్థితియందుండును. ఇట్టి స్థితిలో శిష్యుని స్థితిని గమనించి గురువు సాంప్రదాయ ప్రయోజనము

కొరకు, తన లక్ష్యసిద్ధికొరకు, శిష్యునికి మరలాగుర్తును ప్రవేశ పెట్టును. గురువాక్యాను సారముగా జీవించుటకు, గురుధర్మమును లోక కల్యాణము కొరకు అవిచ్ఛిన్నముగా ప్రచారము గావించుటకు, ఎట్టి స్వార్ధము లేక జీవించుటలో గురుకృపచే తనవ్యక్తిగత జీవితంలో భుక్తి క్రియ యందు ఎట్టి లోటూ లేక గురుసత్తాచే రక్షింపబడుచూ గురుధర్మనిర్వహణను ఇహపర సాధనముగా ఎంచుకొని జీవించగలుగును. గురుమూర్తి అనుగ్రహము ఇట్టి వానియందు సంపూర్ణముగా ప్రవహించి, ఎట్టి వడిదుడుకులకు లోను కాకుండా భ్రాంతిరహిత విధానమందు ఆరూఢత చెంది వుండును. గురుశక్తి ఆశీర్వచన రూపంలో ఇట్టివానికి రక్షణ కవచమై నిలుచును.

**కం॥ పరిపూర్ణము నెరుకనునే। నెరిగించితినీవురెంటి నెరిగి తివిగదా।
యెరుకను గురుదక్షణగా। మరివేగిరమివ్వవట్టి మాట లేమిటికీ।
యెరుకతొయింక। కూటమేమిటికీ। పరులు నేననియేటి
భావమభావమై। నిరతాముఒకరీతి నిల చుండుమికవట్టి
మాటలేమిటికి। యెరుకతొయింక కూటమేమిటికీ॥ 237**

## ప్రతిపదార్థము

పరిపూర్ణమును ఎరుకను నేను ఎరిగించితిని=స్వత: సిద్ధమైన పరిపూర్ణమును, అందు లేక తోచు ఎరుకను వస్తునిశ్చయ పూర్వకంగా నీచేగుర్తింప జేసితిని
నీవు రెంటిని ఎరిగితివి కదా = నీవు ఎట్టి సందేహము లేక వస్తునిశ్చయముగా వాటిని గుర్తించివికదా
ఎరుకను = పైరెంటినీ గుర్తించిన నీ తెలివిని
గురు దక్షిణగా=గురువు సంతోషపడేటట్లుగా, గురువు కోరినట్లుగా, తృప్తి పడేటట్లుగా
మరివేగిర మివ్వు = తొందరగా విడిచి యుండుము, ఆలస్యంచేయకు
వట్టి మాటలేమిటికి = వృధా మాట లెందుకు
ఎరుకతో ఇంక కూటమేమిటికి = గుర్తెరిగే తెలివితో ఇంక సంబంధ మెందుకు
పరులు నేనని ఏటి భావము=నీవు, నేను అనే ద్వంధ్వ పద్ధతి గల ఎరుకతో
అభావమై = లేనిదై, విడిచిపెట్ట బడినదై

నిరతాము ఒకరీతి నిలిచుండుము = స్వత:సిద్ధమైన పరిపూర్ణము నందు ఉనికి కలిగి యుండుము

## తాత్పర్యము

స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణము, అందులేక తోచుచున్న గుర్తెరిగే ఎరుకను కేటాయించి విడి విడిగా వస్తునిశ్చయ పూర్వకంగా నీకుదృఢ పరచితిని. వాటిని స్పష్టముగా గుర్తించితివి కదా! అట్టి గుర్తించిన దానిని కూడా నాకు గురుదక్షిణగా ఇచ్చివేయుము. ఇందులకు ఎట్టి ఆలస్యము కూడదు. గుర్తించే తెలివితో నీకు ఎట్టి సంబంధము వుండకూడదు. పరిపూర్ణము ఉన్నదని గాని, ఎరుక లేని దని గాని, తాను ఏమీ లేనని గాని నిర్ణయము చేయక పరిపూర్ణము ఎట్లు స్వత:సిద్ధమై వున్నదో ఆవిధంగా ఉనికి కలిగి వుండుము.

కం॥ నేమొదటనిన్ను గనుగొని। యే ముక్కలునీదుచెవులోయి
మిడిస్తినో,నీ। వాముక్కల మూడింటిని। యేమాత్రము
మరువకుండ। యీబోధనిస్తి। అంతకెయింత। గాబోధజేస్తి। ప్రేమతొ
జదువుమి। దేమారకెప్పుడు। కామితార్థమునిచ్చుపో మీ యింటికి
దీవిం। చీబోధనిస్తి అంతకె యింతగాబోధజేస్తి॥ 238

## ప్రతిపదార్థము

నే మొదట నిన్ను కనుగొని=మొదటి సారిగా మనమిద్దరము కలసుకున్నపుడు

ఏముక్కలు నీదు చెవిలో ఇమిడిస్తినో=ఉపదేశ దీక్షతో రహస్యము నీకు చెప్పచడిన మంత్రములు లేక వాక్యములు (పరిపూర్ణమును ఎరిగి, ఎరుకను మాను)

నీవా ముక్కలు మూడింటిని=ఆ వుపదేశమందు పొందిన మూడు అంశములను

ఏమాత్రము మరువకుండా=నిరంతరం జ్ఞాపకంవుండేలా వస్తునిశ్చయ పూర్వకంగా

ఈ బోధనిస్తి = జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు మార్గముగా నీకు ప్రబోధించితిని

అంతకే = అందులకే

ఇంతగా బోధ చేస్తి = ఇన్ని వివరములతో దృఢ పరచితిని
ప్రేమతో చదువుము = అత్యంత శ్రద్ధతో దృఢపరచుకొనుము
ఎప్పుడు ఏమారకు = ఎట్టి పరిస్థితిలోనూ నిర్లక్ష్యము చెయ్యకు
కామితార్థము నిచ్చు = నీవు కోరిన జనన మరణభ్రాంతి రహిత విధానము కలిగించును
ఫో మీ ఇంటికి = నువ్వు వచ్చినదారిని వెళ్ళవలయును
దీవించి బోధనిస్తి = నా ఆశీర్వచనముతో అట్టి ఆరూఢతలో ఎట్టి లోపము లేకుండా వుండగలవు.

## తాత్పర్యము

గురు శిష్యులమైన మనము ఒకరి నొకరు కలుసుకొన్న సమయంలో రహస్యంగా నీకు మాత్రమే తెలిసేలా నాచే ఉపదేశింపబడిన వాక్యములు పరిపూర్ణమనే దొకటి, లేనెరుకనే దొకటి, పరిపూర్ణ మెరుకల నెరిగి ఎరుకను మాను మనునవి నీమనసుకు దృఢపడునట్లుగా చెప్పి యుంటిని. అంతే గాక ఆమూడు అంశములయందు గల రహస్యములను వస్తునిశ్చయ పూర్వకంగా నీవు గుర్తించి దృఢపరచుకొనుటకు పలు దృష్టాంతముల ద్వారా ఈ బోధను విశాలము చేసి నీకు చెప్పడమైనది. దీనియందు అత్యంత ప్రేమ కలిగి, నిరంతరము భావనలో నింపుకొని, ఎట్టి నిర్లక్ష్యము చేయక, స్థితి కలిగి యుండుము. నీవు కోరిన జనన మరణ భ్రాంతి రహిత విధానము ఇట్టి ఆరూఢత చేత మాత్రమే నీకు సిద్ధించును. నా ఆశీర్వచనము వలన నీ ఆరూఢతకు ఎట్టి భంగము వాటిల్లదు. క్షేమంగా నీ స్వస్థానమునకు చేరుకొనుము.

**కం॥ జతనముగదాచి చదువుము। రతనమ్ములహార మిదియు**
**రసికులగళమా। యతనము దీనికినేబహు। యతన ముగావించి**
**తెచ్చి। యిస్తీరనేడూ। బోధకుబందో బస్తౌర చూడూ। రతనాలెట్లో**
**రాళ్ళురతనాలంచనియుంటె। రతనాలీప ద్యాలేరసికం**
**లెరిగెదరివినీ। కిస్తీరనేడూ। బోధకుబంధో। బస్తౌరచూడూ॥ 239**

# ప్రతిపదార్థము

జతనముగ = శ్రద్ధగా, ప్రయత్నపూర్వకముగా

దాచి = అత:కరణయందు ఇముడ్చు కొని

చదువుము = మననము చేయుము

రతనమ్ముల హారము=అత్యంత విలువైన కంఠము నందు ధరించగలుగు హారము

ఇదిరసికులగళము ఆయతనము= పరిపూర్ణభావమందు ఆరూఢత చెందిన మహాత్ముల కంఠసీమయందు ఆభరణముగా వుండ తగినది

దీనికి = ఇట్టి విలువలతో కూడిన ఈ గ్రంధమునకు

బహుయతనముగావించి = అనేక కష్టములతో కూడిన ప్రయత్నము గావించి

తెచ్చి యిస్తీర నేడు = ఈ గ్రంథరూపంలో మీకు అందిస్తున్నాను

బోధకు బందో బస్తౌర = వస్తునిశ్చయపూర్వకమైన పరిపూర్ణబోధకు కట్టుదిట్టమైన రక్షణ కవచము ఈగ్రంథము

చూడు = పరిశీలించు, గమనించు

రతనాలెట్లౌ రాళ్ళు = రాళ్ళ నుండి చెక్కబడి, మలచబడి మెరుపుతో కూడిన పిదప వాటిని రాళ్ళనుటకు వీలు లేదు

రతనాలని యంటే = అత్యంత విలువైన, రత్నములు గానే చెప్పవలెను.

రతనాలీ పద్యాలె = అట్టి లక్షణములు కలిగిన రత్నములతో సమానమైన వీపద్యములు

రసికులెరిగెదరివి = పరిపూర్ణ బోధయందు ఆరూఢత చెందినవారు మాత్రమే ఈ అంశములు గ్రహించగలరు

# తాత్పర్యము

జన్మరహిత విధానమునకు పరిపూర్ణ బోధయే అత్యంత సులువైన మార్గముగా చెప్పబడుచున్నది. ఎట్టి సాధనల చేతను సాధ్యము కాక వస్తునిశ్చయపూర్వకమైన గురుప్రబోధ ద్వారా మాత్రమె, గురుకృపద్వారా బోధనాపద్ధతిచేతనె భ్రాంతి రహిత విధానము కలిగించుటకు వీలై వున్నది. దీనినే శాస్త్రపరిభాషలో సద్యోముక్తిగా చెప్పబడుచున్నది. (అప్పుడె వార

లిప్పుడు గంటె ) ఆగమ నిగమోపనిష త్సాగరమధితార్థము అవల వున్నది. ఈగ్రంథమందలి బోధనా క్రమము పరిపూర్ణమెరిగి, ఎరుక నెరిగి ఎరుకను మాను అని సూత్రబద్ధము చేసి చెప్ప వచ్చును. మనో వాక్కుల కందని కేవలత్వము కలిగిన పరిపూర్ణమును, దేనిని తెలిసిన మీదట సమస్తమును తెలుసుకో గలుగు జ్ఞానము కలుగునో (అఖండ ఎరుక ) అను అంశములు స్పష్టముగా వివరించి భ్రాంతులకు కారణమైన గుర్తెరిగే ఎరుకను లేనిదని దృఢ పరచగలుగు విధానము ఈ గ్రంథమునందు ప్రతి పాదింపబడినది. ఈరచన కొరకు ఎంతో శ్రమ, ఆరూఢత, గురుకృప తోడై గ్రంథముగా రచింపబడెను. ఈగ్రంథము గురుగోప్యమై యున్న పరిపూర్ణభావమునకు ఒక రక్షణ కవచముగా చెప్పవచ్చును. పరిపూర్ణ బోధయందు స్పష్టమైన ఆరూఢత కలిగిన మహాత్ముల కంఠమునందు ఆభరణముగా నిలువగలుగు విలువలతో కూడుకున్నది. రాతినుండి సానబట్టి మెరుపు తీసినట్లుగా, ఆపైన అవి రత్నములుగా ఎట్లు పిలువ బడుచున్నవో అట్లే ఇందలి పరిపూర్ణము, ఎరుకల నెరిగి, ఎరుకను విడచు విధానము మలచ బడియున్నది. విలువ తెలిసిన వారికి అనగా విషయ నిరూపణ కలిగినవారు ఈపద్యములనే విలువైన రత్నముగా భావించెదరు. ఇట్టి విలువలతో కూడిన ఈ గ్రంథము అత్యంత భక్తితో, శ్రద్ధతో విని, చదివి, అంతఃకరణమునందు ఇముడ్చుకొని భ్రాంతి రహిత విధానము పొందవలసినదిగా చెప్పబడుచున్నది అని గ్రహించుము.

**కం॥ నన్నాశ్రయించినావని। యన్నా యీబోధనీకు అతుకుట కొరకై।**
**యెన్నో యుక్తులజెప్పితి। విన్నావాదీన్ని। నీవువిడువ కెప్పటికీ।**
**నాయాజ్ఞను గడువాకెప్పటికీ। నన్నునీవు నిన్ననే**
**గన్నావేళ్లెట్టిదొ। నన్ను నీవువిడువలేవు నిన్ను నేవిడలేను।**
**విడువకెప్పటికీ। నా యాజ్ఞను। గడువకెప్పటికీ॥ 240**

## ప్రతిపదార్థము

అన్నా = నాయనా

నన్నాశ్రయించి నావని = స్థాన శుశ్రూషయందు గురుస్థానము నందే వుండి

జీవితమును వెచ్చించుటచేత
ఈ బోధనీకు అతుకుట కొరకు = ఈపరిపూర్ణ భావం దృఢపరచుటకు
ఎన్నోయుక్తులు చెప్పితి = అనేక రకములైన దృష్ట ద్రాష్టాంతములు ప్రబోధించి యున్నాను
విన్నావా = గట్టిగా దృఢ పరచు కొన్నావా?
దీన్ని = ఇట్టి అపూర్వమైన భావమును
నీవు విడువ కెప్పటికి=నీ జీవిత కాలమంతయు ఇట్టి భావమునే కలిగి వుండుము
నా ఆజ్ఞను = నే ప్రబోధించిన విధానము నందు ఎరుకను విడచు క్రమము గడువ కెప్పటికి = అతిక్రమించి జీవించకు
నన్నునీవు, నిన్ను నేను కన్నవేళ ఎట్టిదొ = గురుశిష్యులమైన మనము ఒకరి కొకరు ఎదురు పడిన వేళ, సందర్భము ఎటువంటిదొ
నన్ను నీవు విడువలేవు = గురువునైన నన్ను నీవు విడిచి వుండుట కష్టము
నిన్ను నే విడువలేను=శిష్యుడవైన నిన్ను నే విడిచి వుండుట కూడా కష్టము
విడువ కెప్పటికి = ఈ భావమును ఎల్లపుడు కలిగి వుండుము

## తాత్పర్యము

జనన మరణ భ్రాంతి రహిత విధానమును దృఢ పరచుకొనుటకు గురు స్థానముననే శిష్యుడు చేరి కొంత జీవితమును వెచ్చించినగాని పరిపూర్ణబోధ యందు విషయనిరూపణ, ఆరూఢత సిద్ధించవు. ఈ కందార్థమునందు స్థాన శుశ్రూష యొక్క అవసరము, ప్రయోజనము ప్రముఖముగాచెప్పబడుచున్నది. గురుస్థానమందు శిష్యుడు నివసించుట చేత గురువు యొక్క శక్తి సామర్థ్యములు శిష్యుని ప్రభావితము చేయుటయేగాక, శిష్యుని యందు గల అయోగ్యత, అవలక్షణములు అపాత్రత అప్రయత్నముగా సంస్కరింపబడి, పూర్ణాధికారిగా మలచబడును. ఇట్టి యోగ్యతతో విన్నది విన్నట్లుగా చెప్పగలిగే ప్రజ్ఞ సిద్ధించును. వాత్సల్య పూరితమైన ప్రేమతో అనుగ్రహ పూర్వకముగా, బోధయందు గురుశిష్యులు ఇద్దరు ఆదర్శవంతులై ఒకరి నొకరు వ్యక్తిత్వములు విడిచి పెట్టి

తత్వములుగా ప్రకాశించి, అభివ్యాజ్యమై, విడదీయరానివై నిలచి వుందురు. ఇందులకు ఎంతో బోధనా క్రమము అవసరమై వున్నది. గురుధర్మ నిర్వహణ సాంప్రదాయము యొక్క విలువలు, ప్రయోజనము ప్రచారము గురుశిష్యు లిరువురు భౌతికముగా వేరైవున్నా, సమిష్టి అంత:కరణ వృత్తి విధానముచే ఏకభావనతో జీవించెదరు. ఇట్టి ఆదర్శము గలవారినే వరగురు శిష్యులుగా చెప్పవచ్చును.

కం॥ నీమానసమునసంశయ। మేమాత్రమునిల్పబోకు మికనాతోడే।
నామాటనిశ్చయమునే। నేమాత్రముదాచలేదు నీతోడు సుమీ్మ।
యింతకుమిక్కి। లికలేదులెమ్మీ। నామీద తల పుంచుననుమరువ
కికనేను। నీ మీద దయవుంతు నిజ మిందుకిదె వొట్టు।
నీతోడుసుమీ్మ। యింతకు మిక్కి। లికలేదులెమ్మీ॥ 241

## ప్రతిపదార్థము

నీమానసమున = నీ మనస్సు లో
సంశయము = పరిపూర్ణ బోధయందు ఎట్టి సంకోచము
నిల్ప బోకుము =ఏ మాత్రము వుంచుకోకు
ఇక నాతోడె = ఇందులకు నేనే ప్రమాణముగా భావించుము
నామాట నిశ్చయము=నేను చాలా స్పష్టముగా వివరించి, దృఢపరచియున్నాను.
నేనే మాత్రము దాచలేదు=బోధనా పద్ధతియందు ఎట్టిరహస్యమును నేను మిగల్చలేదు
నీతోడు సుమీ్మ = ఇందులకు నీమీద ప్రమాణముగా చెప్పుచున్నాను
ఇంతకు మిక్కిలిక లేదు లెమ్మీ=బోధయందు ఇక మిగల్ప వలసినది ఏమీలేదు
నామీద తలపుంచు = గురు నిష్టయందే జీవితమును వినియోగించుము
ఇకనను మరువకు = గురువును, గురుధర్మమును ఎట్టి నిర్లక్ష్యము చేయకు
నేను నీమీద దయ వుంతు=గురు అనుగ్రహము నీమీద ఎప్పుడునూ వుంటుంది
నిజము = ఇది సత్యము
ఇందు కిదే ఒట్టు = ఇందులకిదే ప్రమాణముగా చెప్పుచున్నాను.

## తాత్పర్యము

జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు పరిపూర్ణ బోధయే శ్రేష్టమైన మార్గము వస్తునిశ్చయ పూర్వకంగా పరిపూర్ణము ఎరుకల నెరిగించి ఎరుకను విడచు విధానము నీకు స్పష్టముగా వివరించి యున్నాను. బోధయందు ఆరూఢతను ఎట్టి సందేహమునకు తావు లేకుండా బోధించి యున్నాను. నీమనస్సులో ఎట్టి సందేహమును కలిగి వుండకుము. నాగురుమూర్తి ద్వారా నేను విని దృఢపరచుకొన్నది ఏమాత్రము దాపరికం లేకుండా నీకు ప్రబోధించి యున్నాను. ఇంతకన్నా వివరించి చెప్పుటకు ఏమీలేదు. గురువాజ్ఞను సారముగా జీవించుము. గురు నిష్టయందు ఎట్టి తొట్రుపాటు పనికిరాదు. ఈ విధంగా నీవు జీవించి యున్నప్పుడు అప్రయత్నముగా గురు అనుగ్రహము నీయందు ప్రసరించి ఆరూఢత యందు చెక్కు చెదరకుండా వుండగలవు. ఈ అంశములన్నియు నీమీద ప్రమాణ పూర్వకమైన భావనతో చెప్పుచున్నాను.

**కం॥ నీగురుబోధను నీచే। బాగుగవినినిందజేయు భ్రష్టుల మాటల్**
**లోగొనివిడిచేవిదినీ। కేగురుడీలాటి బోధనెరిగించడో యీా।**
**యెరుకలోదె। యెరిగించునోయీా। ఆగురుబోధలనన్నీ**
**నేదెలిసుండి। నాగురుబోధ నేనయముగనీకిస్తి। యెరిగించ**
**డోయీా। యెరుకలోదె। యెరిగించునోయీా॥ 242**

## ప్రతిపదార్థము

నీగురు బోధను = నీవుగ్రహించిన పరిపూర్ణ భావమును
నీచే బాగుగావిని = నీవల్ల చక్కగా విని
నిందజేయు భ్రష్టులమాటల్=నిందించే స్వభావము కలిగిన దుష్టప్రవృత్తికలవారి మాటలలో
లోగొని = విచారించి
విడిచేవు ఇది = ఈ భావమును విడిచి వుండకుము
నీకే గురుడు = ప్రపంచంలోవున్న అష్టవిధ గురువులు

ఈలాటి బోధనెరిగించడోయి = భ్రాంతి రహిత విధానమును కలిగించు ఈ ధర్మమును ప్రబోధించడు

ఎరుక లోదే ఎరిగించును = భ్రాంతి విస్తారముతో కూడిన మార్గములనే నీకు ప్రబోధించును

ఆ గురుబోధలన్నీ నేతెలిసుండీ=ఆ భావములన్ని బాగా ఆరూఢ పరచుకొన్న మీదటనే

నాగురుబోధ = నేను గ్రహించిన ఈ పరిపూర్ణ భావమును

నేనయముగా నీకిస్తి=నే గ్రహించినదంతయు నీకు స్పష్టముగా బోధించి యున్నాను

## తాత్పర్యము

ప్రపంచము నందు మోక్షప్రాప్తికై అనేక మార్గములు ప్రతిపాదింపబడి వున్నవి. "ఏకంసత్ విప్రా బహుధా వదంతి" అనగా ఒకేలక్ష్యమును, మార్గమును ప్రతిపాదించుటలో మహాత్ములు పెక్కు మార్గములు ప్రతిపాదించి యున్నారు. జనన మరణ రహిత విధానమునకు పరిపూర్ణభావమే ఏకైక మార్గముగా మొదటిలో జగద్గురు శ్రీకృష్ణ భగవానునిచే భగవద్గీత యందు ప్రతిపాదింప బడియున్నది. " నసపునరా వర్తతే" తిరిగి రాని మార్గము అనగా పునరా వృత్తి రహిత విధానమే ఇందలి రహస్యము. ఇట్టి విధానము పరిపూర్ణ బోధద్వారా మాత్రమె సిద్ధింపబడు చున్నది. ఇది అత్యంత "రహస్యంహేతదుత్తమం" గా చెప్పబడుచూ అత్యంత గోప్యమై లక్షణయుతులైన వారికి మాత్రమేం అనగా (జనన మరణ భ్రాంతిరహితాసక్తులగు వారికి మాత్రమే) సాంప్రదాయ బద్ధమైన గురుశిష్య న్యాయంలో ప్రబోధింపబడుచున్నది. ప్రపంచంలో దీని ప్రచార సరళి చాలా తక్కువ. నీకృషి విధానము, జీవన విధానము గమనించి అది విచిత్రముగా తోచి లౌకిక జనులు ఆవిధానమంతయు నీద్వారా వివరింపజేసుకుని తమమార్గములతో దానిని పోల్చుకుని వలునందేహములు వ్యక్తపరచుచుందురు. అట్టి అంశములన్నియు నీవు విని ఈ ధర్మమును,ఈ

భావమును విడచి వుండకు. ప్రపంచంలో గల అష్ట విధ గురువులలో ఏఒక్కరు కూడా ఈ పరిపూర్ణ భావమును నీకుపదేశించరు. భ్రాంతి విస్తారమును కలిగించు సాధనయందే వారు శ్రద్ధ కనిపించి, అట్టి వాటినే లక్ష్యములుగా చేసుకుని నీకు ప్రబోధించెదరు. అట్టి బోధలు, భాధలు, భావములు, గురువులు అన్నియు సమగ్రముగా విచారించి, జనన మరణభ్రాంతి రహిత విధానమునకు ఒక పరిపూర్ణబోధయే శ్రేష్టముగా గుర్తించి, నాగురుమూర్తి అనుగ్రహముచే స్పష్టముగా దృఢపరచుకొని నీకుపదేశించితిని. ఇందులకు నీకెట్టి సందేహమునకు తావు లేదని తెలియుము.

కం॥ నిక్కముగబీరపీచుల। చిక్కుసుమీవిచ్చరాదు ఛీ యీ యెరుకన్
మక్కువనే బోధించిన। చక్కనిబోధాగ్నిచేత। సాధించుకోరా।
విచ్చేచింత। చాలించుకోరా। చొక్కమౌ యీబోధకెక్కాడ
యీడౌను। తక్కీనబోధాల దిక్కూచూడక దీన్ని। సాధించుకోరా।
విచ్చేచింత చాలించుకోరా॥ 243

## ప్రతిపదార్థము

నిక్కముగా = నిజముగా
బీర పీచుల చిక్కుసుమీ = ఈ గుర్తెరిగే శరీరము బీరపీచుల చిక్కువలె చిక్కులతో కూడియుండును
విచ్చరాదు = దీనిని విడదీయుటకు ప్రయత్నించరాదు
మక్కువతో = ఎంతో ప్రేమతో
నేబోధించిన = నేనుపదేశించిన
చక్కని బోధాగ్ని చేత=శ్రేష్టమైన పరిపూర్ణ బోధయందలి ఆరూఢ విధానముచేత
సాధించు కోరా = ఆరూఢ పరచు కొనుము లేక దృఢ పరచుకొనుము
విచ్చే చింత చాలించుకోరా = విడదీసే ప్రయత్నమును విరమించుము
చొక్కమౌ = శ్రేష్టమైన
ఈబోధ కెక్కడ ఈడౌను = ఈ బోధతో సమాన మైనవి వుండవు

తక్కిన బోధల దిక్కు చూడకు=భ్రాంతి విస్తారకములగు మిగిలిన మార్గములను దరిజేరనియ్యకుము

## తాత్పర్యము

జన్మరాహిత్యమును కలిగించు మార్గములో, ప్రతిపాదనలో సృష్టి కారకమైన అధిష్టాన బ్రహ్మమును (అఖండ ఎరుకను) మోక్షస్థానముగా నిర్ణయించి అందుకు కావలసిన మార్గములు భిన్నభిన్న కోణములలో ప్రతిపాదించి యున్నారు. (ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతము) ఇవన్నియు బీరపీచువలె చిక్కులతో కూడి యున్నవి. దీనిని వివరించి విచారించుట సాధ్యము కాని అంశము. పరిపూర్ణ బోధయందు ఇట్టి భ్రాంతి సహిత విధానము కలిగిన ఎరుకను విడిచి యుండుటయే లక్ష్యముగా నున్నది. ఈ విధానమంతయు వస్తునిశ్చయ పూర్వకంగా పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను మను క్రమంలో దృఢపరచి, అట్టి ఆరూఢత పెంపొందు బోధనాక్రమము చాలాస్పష్టముగా వివరింపబడుచున్నది. దీనిద్వారా భ్రాంతిరహిత విధానము పొందవచ్చును. శ్రేష్టమైన ఇట్టి భావముతో ప్రచారములో వున్న మార్గములేవియు సరితూగలేవు. అట్టి విధానము నుండి బయట పడి, ఈ భావము ద్వారా పరిపూర్ణ భావమును దృఢ పరచుకొనుము.

కం॥ పెద్దలనిందయొనర్చకు। పెద్దల సేవించు కొరకు పిరిదివియకు
మే। పెద్దలతో వాదించకు। పెద్దలుజెప్పేటి సుద్ధి। పెడచెవుల
వినకూ। పెద్దలునడిచె। నడకనేమనకూ। పెద్దలకన్ననే
పెద్దనంచనుకోకు। పెద్దలగనుగొన్న ప్రి। యముతో మ్రొక్కుము।
పెడచెవుల వినకూ। పెద్దలునడిచే। నడకానేమనకూ॥ 244

## ప్రతిపదార్థము

పెద్దలు = పరిపూర్ణబోధయందు ఆరూఢతచెందివున్నవారు
నింద యొనర్చకు = దూషించకు, తక్కువచేసి మాట్లాడకు

సేవించు కొరకు = వారిని పూజించుటకు, గౌరవించుటకు
పిరిదివి యకుము = సందేహింపకుము, ఆలోచించకుము
వారించకు = సిద్ధాంత ప్రతిపాదనలో విభేదములు (కూడదు) ఎంచకు
చెప్పేటి శుద్ధి = వారు చెప్పేమంచి వాక్యములు
పెడ చెవిని వినకు = నిర్లక్ష్యంగా వినకు
నడిచే నడకనేమనకు = వారి ప్రవర్తనలో ఎట్టి లోపములు ఎంచకు
పెద్దనంచనుకోకు=వారికంటే గొప్పవాడివైయున్న, వారిముందర వ్యక్తపరచుకు
కనుగొన్న ప్రియముతోమ్రొక్కుము = వార్ని దర్శించిన వెంటనే భక్తిశ్రద్ధలతో నమస్కరించుము

## తాత్పర్యము

పెద్దలు అనగా వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు అను రెండుతరగతులుగా చెప్పవచ్చును.పెద్దదైన, గొప్పదైన వస్తువునుగూర్చి సమగ్రమైన జ్ఞానము కలిగియున్నవారిని, జ్ఞానవృద్ధులులనియు, వయస్సుతోపాటు మనస్సును కూడా పండించుకొని వయోభారముతో నున్నవారిని వయోవృద్ధులని చెప్పబడుచున్నారు. పరిపూర్ణభావమందు ఆరూఢతకలిగి, దానికి సరిపడ జీవన విధానము కలిగి వున్నవారిని ఈకందార్థమందు పెద్దలుగా చెప్పుచున్నారు. శ్రవణ మాత్ర జ్ఞానమె గాక, ఆరూఢతతో కూడిన అనుభవ జ్ఞానము కలవారిని పెద్దలుగా చెప్పబడుచున్నారు. అట్టి మహాత్ములను నిందాపూర్వకంగా మాట్లాడరాదు. వారిని సేవించుటకు ఎట్టి సందేహము పడరాదు. వారితో వాద ప్రతివాదములకు దిగరాదు. వారుపదేశించు అంశములను అత్యంతభక్తి శ్రద్ధలతో వినవలసి యున్నది. జీవన విధానంలో వారిప్రవర్తన యందు ఏదైనా దోషము కనిపించినా అది వేలెత్తి చూపరాదు. వయస్సు, కులము, ధనము మొదలైన అంశములలో వారికన్నా నీవు పెద్ద వాడవైనా వారి ముందవి ప్రదర్శించవద్దు. అట్టి మహాత్ములు ఎదురు పడినచో వారికి భక్తి పూర్వకముగా నమస్కరింపుము అని భావము.

కం॥ తనకు శరణన్నవారల। మనసెట్టిదొతరచిచూచి మరి తెల్ప
దగున్। వినువారికి తగినట్టిది యని। రిట్లు మహానుభావు లతిచా
తుర్యమునా। వినికని నీమన। సతిచాతుర్యము నా। ఘనమైన
యీ బోధ కరుణిస్తి దీన్ని। చచ్చినదాకా నిదురా వచ్చిన దాకా।
మరువాకుం। మతిచాతుర్య మునా। వినికనినీ
మనసతిచాతుర్యమునా॥ 245

## ప్రతిపదార్థము

తనకు = అచల పరిపూర్ణభావమును ప్రబోధించు గురుమూర్తికి
శరణన్న వారల = సాష్టాంగ నమస్కారముచే తన్నాశ్రయించిన వారిని
మనసెట్టిదో = అట్టివారి మనో భావము గమనించి
తరచి చూచి = లోతుగా విచారించి, ఆలోచించి
మరీ తెల్పదగున్=నమ్మకము కలిగిన మీదటనే బోధ విధానము వారికి చెప్పవలెను
వినువారికి తగినట్టిది = యోగ్యతను గమనించి, తగినవిధంగా
అనిరిట్లు మహనుభావులు అతి చాతుర్యమున = ఎంతో సూక్ష్మమైన విచారణ ద్వారా పరిపూర్ణ భావమందు ఆరూఢత చెందిన మహాత్ములు పైవిధంగా పేర్కొన్నారు
నీమనసతి చాతుర్యమున = పైనపేర్కొన్న విధముగా నీమనస్సును గ్రహించి
వినీ కనీ = స్పష్టమైన అవగాహన కలిగించుకొనిన మీదట
ఘనమైన ఈబోధ = గొప్పదైన ఈ పరిపూర్ణ భావమును
కరుణిస్తి దీన్ని = అట్టిది నీకు ఉపదేశించినాను
చచ్చినదాకా = మరణించు వరకు
నిదుర వచ్చినదాక = సుషుప్తి లోకి వెళ్ళే వరకు
మరువకు = ఈ భావమును విడిచి యుండకు

## తాత్పర్యము

పరిపూర్ణ భావమునందు గట్టి ఆరూఢత చెందిన మహాత్ములు లోక కల్యాణమునకై, సమాజ శ్రేయస్సుకై దీనిని ఇతరులకు బోధించుటలో

ఎట్టి తొట్రుపాటు, తొందరపాటు లేక తమను శరణాగతి జెందిన వారల మనోభావమును నిశితముగా పరిశీలించి బాగుగా నమ్మకము కలిగిన మీదటను గాని గొప్పదైన ఈ భావమును ప్రబోధించరాదని, వచ్చిన వారి మనోభావము కనిపెట్టి, అందుకు తగిన విధంగా మాత్రమె దీనిని ప్రబోధించ వలసియున్నదని నిర్దేశించి యున్నారు. దానిని దృష్టిలో వుంచుకొని నీభావములను నేను గమనించి జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు శ్రేష్టమైన మార్గముగా చెప్పబడుచున్న ఈపరిపూర్ణ బోధను నీకు ఉపదేశించి యున్నాను. దీనియందు ఎట్టి నిర్లక్ష్యములేక నీ జీవిత కాలమంతయు అనగా నిదురించు దాకా, మరణించుదాకా దీనియందు చక్కటి ఆరూఢత కలిగి యుండుము.

కం॥ చెప్పదగు గురుడుబోధను। చెప్పిన పనిజేసెనేని శిష్యాగ్రణి
కిన్ చెప్పదగదు చెప్పినపని। తప్పని వాదించేనేని। దయదల్చి
బోధా। యిద్దరికుండ। దగునట్టిమేధా। చెప్పిముందుగ బోధ
చెప్పుండిపనులన్న। చెప్పాగూడదువాన్ని తిప్పాలబెట్టాక
దయదల్చి బోధా। యిద్దరికుండదగు నిట్టి మేధా॥ 246

## ప్రతిపదార్థము

చెప్ప దగును గురుడు బోధను = పరిపూర్ణబోధను గురువాక్యానుసారముగా జీవించు లక్షణము గలవానికి మాత్రమే ఉపదేశించవలెను

చెప్పిన పనిజేసెనేని = చెప్పినట్లుగా జీవించులక్షణము కలవానికి

శిష్యాగ్రణికిన్ = శిష్యులలో గొప్పవానికి

చెప్పతగదు = పై లక్షణములు లేనివానికి చెప్పరాదు

చెప్పిన పని తప్పని వాదించెనేని = గురూపదిష్ట మార్గములో ఉపదేశింపబడిన అనుష్టానాదికములు పాటించనివారికి

దయదల్చి బోధ=అట్టి వాని ఎడల ఏమాత్రము దయాదాక్షిణ్యములు పనికి రావు

ఇద్దరికీ ఉండదగునట్టి మేధ=ఇట్టి యోగ్యత గురుశిష్యులిద్దరికీ వుండవలయును

చెప్పిముందుగ బోధ = పరిపూర్ణ భావమును ముందుగా ఉపదేశం చేసి

చెప్పండీ పనులన్న = అది ఆరూఢ మగుటకు తాను చేయవలసిన పనులు తరువాత క్రమంలో చెప్పవచ్చును కదా

చెప్పకూడదు వానిని తిప్పలు పెట్టక = అట్టివాని విషయంలో చాలా కఠినముగా నుండి శిక్షణకులోనుచేసి యోగ్యత కలిగించిన మీదటనే దీనిని ఉపదేశించవలసి వున్నది.

## తాత్పర్యము

పరిపూర్ణ బోధసాంప్రదాయ బద్ధమై, ఆదర్శ వంతమైన గురుశిష్య న్యాయంలో ప్రకాశించు చున్నది. గురుర్వాక్యం యధాతధంగాఅమలు పరుస్తూ, గురువునిర్ధేశించిన అనుష్టాన, ఆచరణల యందు అనగా చతుర్విధ శుశ్రూషలు, త్రికరణ శుద్ధి ప్రవర్తన కలిగి యున్నవారికి మాత్రమె వున్నదున్నట్లుగా ప్రబోధించవలసి యున్నది. ఇందుకు బదులుగా పరిపూర్ణభావము దృఢపడుటకు అందులకు యోగ్యత కలిగించుటకు ఉ పదేశింపబడిన కార్యాచరణ పనులు కూడనివని తప్పు బట్టి అత్యంత రహస్యమై యున్న పరిపూర్ణ భావమును ముందుగా ఉపదేశించుడనీ, అది ఆరూఢ పరచుకొనుటకు తాను చేయవలసిన పనులను గూర్చి తరువాత వివరించ వచ్చుననియు చెప్పె గడసరి శిష్యుని, వారి జీవన విధానము స్పష్టముగా గమనించి, దీనిని ప్రబోధించవలసి యున్నది. గురుశిష్యులిరువురికి ఇటువంటి దృఢమైన భావము జీవితము కలిగి వుండవలయును. చెప్పిన విధముగా జీవన విధానము సవరించుకో లేని శిష్యులకు కఠినాతి కఠినమైన శిక్షణ కల్పించి,గురువాక్యమునందు లక్ష్యము కలిగించి యోగ్యత కలిగిన మీదటనే దీనినిఉపదేశించ వలసి యున్నది.

కం॥ నాలుగుశుశ్రూషణములు। లోలతగావించుకొనుచు లోకాతీతం।
బాలోకించీగురునిచే। యూలోకముజోలివిడువు మింతెచాలన్నా।
నీతోగూడా। యిదిమరువకన్నా। కీలుదెలియని చదువు చాలా
జదివెందూకు। చాలించి నీవిట్టికీలూ దెలిసితి వేని। యింతే
చాలన్నా। నీతోకూడ। యిదిమరువకన్నా॥ 247

## ప్రతిపదార్థము

నాలుగు శుశ్రూషణములు = నాలుగు విధములైన సేవలు (స్థాన, అంగ, భావ,ఆత్మ శుశ్రూషలు)
లోలత గావించుకొనుచు = భావనలో జీవించగలుగుచు
లోకా తీతము =పరిపూర్ణ పరబ్రహ్మము
ఆలోకించి =ఉన్నదని గట్టిగా దృఢపరచుకొని
గురునిచే =గురుమూర్తిచే వస్తు నిశ్చయ పూర్వకంగా
యీలోకము జోలి = ఈ గుర్తెరిగే శరీరముతో గల సంబంధము
విడువుము = షోడశి వాక్యముద్వారా విడిచి పెట్టుము
ఇంతే = భ్రాంతి రహిత విధానమునకు సరియైన మార్గము ఇదే
చాలన్నా = ఇంతటితో నీకృషి విధానము సరిపోగలదు.
నీతోగూడా = గుర్తెరిగే నీతో సహా
ఇది మరువకన్నా = వ్యష్టి రూపమైన నీవు, సమిష్టి రూపమైన నీగుర్తు, ప్రకాశించి గుర్తెరిగే తెలివితో సహా విడువ వలెననే మాట మరచిపోవద్దు.
కీలు తెలియని చదువు = అత్యంత రహస్యమై యున్న ఇట్టి విడిచే విధానము తెలిసికొనక
చాల చదివెందుకు = ద్వాదశి, షోడశి వాక్యములద్వారా మనన క్రియ చేయుచు గుర్తు కలిగి యుండుట ఎందుకు?
చాలించి = ప్రయత్న పూర్వకంగా అన్ని విడచిపెట్టి
నీవిట్టి కీలూ దెలిసితివేని = పైన పేర్కొన్న విడిచే విధానములోనున్న రహస్యము స్పష్టముగా దృఢపరచు కొన్నమీదట

## తాత్పర్యము

పరిపూర్ణబోధయందు ఆరూఢవిధానము కలుగుటకు గురుకృప అత్యంత అవసరమై యున్నది. గురుకృప కలుగుటకు చతుర్విధ శుశ్రూషలు మార్గములుగా చెప్పబడుచున్నవి. వాక్యార్థ, లక్ష్యార్థములలో ఈ శుశ్రూషలుపాటించుట అత్యంత అవసరమై యున్నది. గురువును వ్యక్తి

నిష్టముగా భావించి స్థాన, అంగ, ఆత్మ, భావ శుశ్రూషలు సల్పుము. వ్యక్తిగతమైన గుణదోషములు అనగా అహంకార, మమకారములు ఇవి పాటించుట చేత తొలగగలవు. వీటి వివరణ అన్యత్ర చెప్పబడుచున్నది. పరిపూర్ణ బోధ ఆరూఢమగుటకు కొంతకాలమైన గురునితో కలిసి జీవించవలసి వున్నది. ఏలననగా పరిపూర్ణ భావము అత్యంత సూక్ష్మము, రహస్యమై మనస్సుకు సంబంధించిన పరిపక్వము కలిగించేలక్షణము కలిగియున్నది. ఒకరి మనస్సులొకరు సూక్ష్మ ప్రజ్ఞచే గమనించుకొని భావమును కలిగించుకొనుటకు అవసరమైన యోగ్యతను, పాత్రతను కల్పించుకొని అందుకు వ్యతిరేకముగానున్న అవలక్షణములు పోగొట్టుకొని దృఢపరచుకోవలసియున్నది. ఈ రహస్యమును గమనించే పురాణపురుషులు గురుస్థానమునందే స్థాన శుశ్రూషాక్రమము పాటించి మహాత్ములైనట్లుగా చరిత్ర చెప్పుచున్నది. తన ప్రవర్తనచే గురువును మెప్పించి, గురువాక్యముతో యధాతధంగా భావశుద్ధి కలిగించుకొని, తన శరీరమును, మనస్సును, ఆలోచన, జీవన విధానము గురుమయంగా చేసుకొని (అనన్య భక్తి) వ్యక్తిగానున్న తాను పైన పేర్కొన్నవిధానముచే తత్వముగా మారవలసియున్నది. ఇక తత్వనిష్ట అనగా గురుస్వరూపముయొక్క స్థాన, స్వరూప, స్వభావములు వస్తునిశ్చయ పూర్వకంగా గురుముఖత: దృఢపరచుకొని, భావనలో సర్వంగురుమయంగా భావిస్తూ అనుష్టాన ఆచరణ పద్ధతులచే అధిష్టాన దేవతానుగ్రహప్రాప్తి కలిగించుకొని, (ఈశ్వర కృప, గురుకృప) తత్వదృష్టి పూని, తాను అఖండాత్మ రూపుడుగా నిలువ గలుగు శక్తి యుక్తులు పై క్రమముచే సాధింపబడి తాను తానై నిలిచినపుడు నీకన్యమై స్వత:సిద్ధమై ఉన్నది పరిపూర్ణమని ద్వాదశి మంత్రార్థ నిరూపణ గావించి, అట్టి వునికి యందు గుర్తించే నీకు మూలముగాని, స్థానముగాని లేదని షోడశి వాక్యము ద్వారా దృఢపరచి పై అంశములయందు భావము దృఢపడుటకు వాక్యములు మంత్రములుగా ఉపదేశించి దృఢపరచుకొనగలుగు ప్రయత్నం గావించును. ఇది అంతయు

గురుశిష్యన్యాయములో బోధనాక్రమముద్వారా పొందవలసినది. గురుగోప్యమై ఉన్నది. ఇది అంతయు పైన పేర్కొనబడిన చతుర్విధ శుశ్రూషల ద్వారా సిద్ధించునని ఈ కందార్థమునందు చెప్పబడుచున్నది. కావున వీటియందు శ్రద్ధ కలిగి క్రమములో పాటించుట చేత పరిపూర్ణబోధయందలి సమగ్ర రూపము అనగా పరిపూర్ణ మెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను క్రమము యధా తధంగా సిద్ధించును. ఇట్టి విధానము పాటించక జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు సమాజములో పేర్కొన బడిన పలు రకములైన భ్రాంతి విస్తారకమగు మార్గములు పాటిస్తూ గురుకృప ద్వారా నిర్థిష్టమైన విధానంగా ఈ భ్రాంతి రహిత విధానము దృఢపరచుకొనవలసియున్నది.

లోలత గావించుకొనుచు అను శబ్దము ద్వారా తాను ఏ స్థానమందున్నా తన భావనా బలముచే మనస్సు ద్వారా పైశుశ్రూషలు పాటించుటచే లోకాతీతమైన స్వతఃసిద్ధమైన పరిపూర్ణము వున్నదని, దానియందు గుర్తెరిగే ఎరుక ఏమాత్రము లేనిదని దృఢపడును. ఇట్టి స్థితియందు దృఢపరచుకొన్న తనగుర్తుతో సహా విడిచి యుండు విధానము గురుమూర్తిచే సూచింపబడి, తనతో సహా భ్రాంతులకు మూలమైన గుర్తు లేక పోవుచున్నది. ఇట్టి విధానము గురుగోప్యముగా చెప్పబడుచు గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాఅన్యధా గ్రంథకోటిభిః అని చెప్పబడుచున్నది.

**కం॥ గురుసూచనైన నరులను। మరిమరి వినుమనుచు జదువు**
**మా। పద్యములన్। గురుసూచన యెరుగని। యానరులను**
**విను మనుచు జదువ। నగుబాటౌగదరా। అదియెట్లన్న।**
**యిదిగొదె ల్పెదరా పురుషాసంగతిలేని పొలతి కొక్కోకశాస్త్ర।**
**మరసిమెచ్చునెదాన్ని। యతిప్రౌఢసతివోలె। నగుబాటౌగదరా।**
**అది యెట్లన్న। యిదిగొ నేదెల్పెదరా॥ 248**

## ప్రతిపదార్థము

గురుసూచన = గొప్ప సూచన లేక గురువు ద్వారా గ్రహించ వలసిన ముఖ్యమైన వస్తుజ్ఞానము

అయిన నరులను = పొందిన లేక గ్రహించిన మనసు గలవారిని

మరి మరి వినమనుచు చదువుమా పద్యములన్ = పదే పదే ఈ కందార్థములను విన వలసినదిగా వివరించి చెప్పువలెను.

గురుసూచన ఎరుగని ఆనరులను = వస్తునిశ్చయ పూర్వక ప్రబోధ గురుముఖత: వినని వారిని

వినమనుచు చదువ = అట్టి వారిని ఈ గ్రంథమందలి పరిపూర్ణ భావమును వినవలసినదిగా చెప్పుట

నగుబాటౌ గదరా = అవమానము లేక అభ్యంతరముగా నుండును

అది ఎట్లన్న = ఆవిధానము ఎట్లుండు ననగా

ఇదిగో నేతెల్పెదరా = అనధికారత్వమును వివరించి చెప్పెదను

పురుషా సంగతి లేని పొలతి=భర్తతో కూడి సంసార జీవితమును ఎరుగని స్త్రీ

కొక్కోక శాస్త్రము = శృంగార శాస్త్రము

అరసి = చూచి

దాన్ని మెచ్చునె = అందలి అనుభవములను పొందుటకు వీలగునా

యతి ప్రౌఢ సతివలె = భర్తతో సుఖమయమైన సంసార జీవితము గడిపిన స్త్రీవలె సంతోషించునా

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణము మనోవాక్కుల కందనిదై కేవలత్వముకలిగి ఎరుకతో సంబంధపడక అవిజ్ఞేయమైవున్నది. దాని వునికిని గురుసూచన ద్వారా మాత్రమే తెలియ వలసియున్నది. తెలివిచే తెలియబడు సమస్తము ఒకటిగా చేసి అట్టి స్థితియందు గురుసూచనద్వారా అచలము, బయలు, పరిపూర్ణము అను శబ్దములచే స్థూల అరుంధతీన్యాయముగా దానిని గ్రహింప గలుగు లాగున శిష్యునికి ప్రబోధించు వస్తు నిశ్చయ

జ్ఞానమంతయు గురుసూచన అను శబ్ధముచే ఇందు పేర్కొనబడుచున్నది. సాంప్రదాయమునందు గురుశిష్యన్యాయములో ఇది అత్యంత రహస్యమై యున్నది. బోధనాపద్ధతిచే గురుమూర్తి ద్వారా ఎరుక, పరిపూర్ణముల వస్తునిశ్చయ జ్ఞానము దృఢపరచుకొన్నవారికి మాత్రమే ఈగ్రంథమందలి విలువలు తెలిసి ప్రయోజనము పొందగలరు. విన్న ప్రబోధను దృఢపరచుకొనుటకు ఈ కంధార్థములు ఒక సిలబస్‌గా చెప్పబడి పదే పదే వారిని ప్రోత్సహించి, ఈగ్రంధమందలివిశేషములు వివరించవలసి యున్నది. అట్టి వారు మాత్రమే అందలి నిజాభిప్రాయములు గ్రహించి దృఢపరచుకొనగలరు. ఆవిధంగా ఎరుగని వారిని వినుమనుట, చదువుమనుట అవమానకరమైన లేక అభ్యంతర కరమైన అంశము. ఏలననగా ధర్మ పద్ధతిగా వివాహజీవితము అనుభవించు భార్యకు శృంగార శాస్త్రమునకు సంబంధించిన పుస్తకమును పరిశీలించుటలో అధికానందము పొందగలదేకాని, భర్త సౌఖ్యములేనిస్త్రీకి అట్టి శాస్త్రగ్రంథము ఎట్లు నిరర్థకము కాగలదో అట్లే ఈగ్రంధ రచన అపాత్రులను వినమనుట గూడా అట్లే కాగలదు.

**కం॥ యెవరుంటెయేమి భయమురI సవరింతురు తప్పులుంటె సాధులు**
**విన్నన్I సవరించనివ్వుమిది వినిI యువ నీతుల నిందజేస్తెI**
**అయ్యేదేమోయీI అందులో మనదిI పొయ్యేదే మోయీI భవనా**
**శస్థితిలేని పద్ధాతియీ బోధIచౌరంగవి నిపించు చాటేలమాటేలI**
**అయ్యేదేమోయీI అందులో మనదిI పొయ్యేదే మోయీ॥ 249**

## ప్రతిపదార్థము

ఎవరుంటె యేమి భయమురా = సభయందు ఎట్టి వారున్నను ఎట్టి భయము, సంకోచము పడవలదు

సాధువులు విన్న = సత్పురుషులై యున్నవారు విన్నచో

తప్పులుంటె సవరింతురు = రచనయందు ఏదైనా దోషమున్నచో దానిని సరిదిద్దెదరు

సవరించనివ్వ = అట్టి సవరింపునకు ఎట్టి అభ్యంతరము నీవు చెప్పవద్దు
అవనీతులు = పరిపూర్ణ భావమందు విషయప్రవేశము లేనివారు
ఇదివిని = ఈ కందార్థ రచన పరిశీలించి
నిందజేస్తె = తప్పులెంచితే
అయ్యేదేమోయి = ఏమాత్రము అభ్యంతరము చెప్పకు
అందులో మనకు పొయ్యేదేమోయి=దానివల్ల మనకు ఎట్టి కష్ట నష్టములు వుండవు
ఈ బోధ = ఈ పరిపూర్ణ బోధ
భవనాశ స్థితిలేని పద్ధతి=జనన మరణము లేని లక్షణమును ప్రతిపాదించినదై
చౌరంగ వినిపించు = నిర్భయంగా వివరించు
చాటేల మాటేల = ఎట్టి సందేహములకు, అనుమానములకు తావులేకుండా దాపరికం లేకుండా నిర్భయంగా

## తాత్పర్యము

జనన మరణ రహిత విధానమును ప్రతిపాదించు లక్షణము కలిగిన నిర్దుష్టమైనది ఈ కందార్థ గ్రంథము. దీనిని ఏసభయందైనా నీవు చెప్పుటకు ఎట్టి సందేహము పడవలదు. సత్పురుషులైనవారు విన్నచో ఇందలి లోతులు గ్రహించి, గ్రహింపబడుటలో గల లోపములు సరిచేసెదరు. అట్టి హృదయము లేనివారు ఇందలి తప్పులను ఎంచి చూపిస్తారు. అందుచేత ఈ సాంప్రదాయమునకు గాని ధర్మమునకు గాని ఎట్టి కష్ట నష్టములు కలుగవు. పదిమంది కందించుటలో ఎట్టి దాపరికము లేకుండా దీన్ని వివరించి చెప్పుటలో ఎట్టి సందేహమునకు లోను కావద్దు అని తెలియవలెను.

కం॥ నాబుద్ధికిసరిపడ్డది। నీబుద్ధేకానియెన్ని నేర్పులగనినన్। ఛీ
బద్దులయాబుద్ధులు। నా బుద్ధికి మెప్పురావు నా తండ్రి వినరా।
శబాసుని। న్నేతండ్రిగనెరా। యీబుద్ధినిక మానకే బుద్ధిబూనాకు।
యేబుద్ధిబూనీన నీ। బుద్ధి చెడిపోవు। నాతండ్రి వినరా శాబాసు
విన్నే। తండ్రిగనెరా॥ 250

## ప్రతిపదార్థము

నాతండ్రీ = ప్రియమైన శిష్యుడా
వినరా = శ్రద్ధగా గ్రహించుము
నాబుద్ధికిసరిపడ్డది = పరిపూర్ణ బోధ ఆరూఢ పరచుకొనుటకు వుండవలసిన యోగ్యత, అధికారము
నీబుద్దే = నీఆలోచన సంస్కారమే
యెన్ని నేర్పుల గనినన్=ప్రపంచములో గల విభిన్నమైన భావములతో కూడిన
ధీ బద్దులు = మత దురభి మానముతో బంధింప బడియున్నవారు
అబుద్ధులు = అట్టి భావము లన్నియు
నా బుద్ధికి మెప్పురావు = నాకు సరిపోవు
వినరా = శ్రద్ధగా పరిశీలించుకొనుము
శభాసు నిన్నే తండ్రి గనెరా = పరిపూర్ణబోధ వినుటకు సర్వలక్షణ సంపన్నుడవైన నీకు జన్మ నిచ్చిన తండ్రి ఎంత గొప్పవాడో కదా!
ఈ బుద్ధి నిక మానకు = ఈ యోగ్యతను ఏ మాత్రము విడిచి యుండకు
యే బుద్ధి పూనకు = ఇతర మార్గములలో ఏ మాత్రము ప్రవేశించకు
యేబుద్ధి పూనిన = ఏ మార్గములో ప్రవేశించ దలచిన
నీబుద్ధి చెడిపోవు = ఈ అధికారము యోగ్యత నశించగలవు.

## తాత్పర్యము

పూర్వ జన్మయందు చేయబడిన పుణ్య సంస్కారములు ఫలప్రదమై జనన మరణ రాహిత్య విధానమునకు యోగ్యమైన పరిపూర్ణ భావమందు ప్రవేశార్హత కలిగి కృషి చేయుట తటస్థ పడును. అట్టి యోగ్యతతోనే నీవు నావద్దకు వచ్చి చేరినావు. నీవు, నీకు జన్మ నిచ్చిన తండ్రి చాలా యోగ్యులు కనుకనే దుర్లభమైన పరిపూర్ణ భావము వినుటకు యోగ్యత కలిగింది. మోక్ష మార్గమునకు ప్రపంచములో ఎన్నో మత సాంప్రదాయములు, భిన్న భిన్న మార్గములు మతముల పేర్లతో పిలవబడుచు భద్దత్వమును పోగొట్ట జాలకున్నవి. అవి అన్నియు నీకు

గాని, ఈ మార్గమునకు గాని సరిపోవు. వాటి జోలికి వెళ్ళక ఈ భావమునకు దూరము కాక నీకు కలిగిన యోగ్యతను, పాత్రతను శ్రద్ధతో నిలుపు కొనుము.

**కం॥ కొట్టితి తిట్టితిశ్రమలన్। బెట్టితి నీమనవి చెవుల బెట్టక పెడచౌ। బెట్టితి మొట్టితి వెడలన్। గొట్టితినీమనసు దెలియ। కోపాము లేకా। సరెతెలిసెనీ। వోపీకపోకా పట్టుమిచ్చెదయిం కనట్టేమి యనిదయ। బుట్టియిచ్చితిబోధ। గట్టీవాడవురోరి కోపాము లేకా సరెతెలిసెనీ। వోపీకపోకా॥ 251**

## ప్రతిపదార్థము

నీమనసు తెలియ = ఈ పరిపూర్ణ బోధను ఆరూఢ పరచు కొనుటకు కావలసిన యోగ్యత, అర్హత నీకు వున్నవో లేవో తెలిసి కొనుటకు

కోపము లేకా = నీపై ఎట్టి దురభిప్రాయము లేకనే కేవలం నీ అర్హత ఏమేరకో తెలిసి కొనుటకు మాత్రమె

కొట్టితి = శారీరకంగా నిన్ను హింసించితి

తిట్టితి = మాటలతోను కష్టము కలిగించితి

శ్రమలన్ పెట్టితి = అనేక కష్టములు కలిగించె పనులు చెప్పితిని

నీమనవి చెవుల పెట్టక = అట్టి శిక్షణలో నీకు కలిగిన కష్టములు నీవు వ్యక్తపరచుచున్నా నేను ఏ మాత్రము పట్టించుకోక

పెడచౌ పెట్టితి = ఏమాత్రము లెక్కలోకి తీసుకోలేదు.

మొట్టితి = తలపై కొట్టాను

వెడలన్ గొట్టితి= శిక్షణా కేంద్రమునుండి నిన్ను బయటకు పంపించి వేసితిని

తెలిసె నీ వోపిక = అత్యంత ఓర్మితో వీటన్నిటిని అనుభవించితివి.

పట్టు మిచ్చెద=అనుగ్రహించి ఈ పరిపూర్ణ భావమందలి రహస్యమును నీకు చెప్పితిని

యింకనట్టేమియని = ఎలాంటి సంశయము లేకుండా

దయబుట్టి ఇచ్చితి బోధ = సంపూర్ణమైన అనుగ్రహముతో ఈ భావమును నీకు అందిస్తున్నాను

గట్టి వాడవు రోరి=చాలా దృఢమైన, స్థిరమైన, యోగ్యమైన మనసు కలవాడవు

## తాత్పర్యము

పరిపూర్ణ భావమును గ్రహించుటకు అంహంకార, అభిమాన రాహిత్యములు కలిగి యుండుట యోగ్యతగా చెప్పబడుచున్నవి. అవి తన్నాశ్రయించిన శిష్యునికి కలిగి యున్నవో లేవో తెలుసుకొన్న మీదటనే గురువు అతనికి పరిపూర్ణబోధ ఉపదేశించ వలసి వున్నది. గురుశిష్యు లిరువురు స్థాన శుశ్రూషయందు ఒక స్థానమున జీవించినపుడే ఇట్టి శిక్షణ సాధ్యమగును. పాత్రత లేని ఉపదేశము నిష్ప్రయోజము కాగలదు. అట్టి యోగ్యత పాత్రత శిష్యునికి కలిగి వున్నవో లేవో, అతని మనసు ఎటువంటిదో తెలుసు కొన్న మీదట నే గురువు తన అనుగ్రహము ద్వారా ఈ భావము నతనికి అందించవలసి వున్నది. ఈ భావమునకు శ్రద్ధ, భక్తి కూడా అవసరమై యున్నవి. కొట్టుట, తిట్టుట, శిష్యుని విన్నపములు పట్టించుకొనకుండా ఉండుట, మొట్టి కాయలు మొట్టుట, తాత్కాలికముగా గురుస్థానము నుండి పంపివేయుట మొదలుగునవన్నియు శిష్యుని మానసిక స్థితి గమనించుట కొరకేగాని, గురునికి అతనిపై ఎట్టి విద్వేషము ఉండదు. గురు అనుగ్రహము చేత మాత్రమే పరిపూర్ణ భావము దృఢమగునని అన్యత్ర చెప్పబడుచున్నది. పై యోగ్యతతో గురు అనుగ్రహముచే ఈ భావమునందు ఆరూఢత కలగ గలదని తెలియ వలెను.

**కం॥ నీవెంతకొట్టి తిట్టిన। నేవిడిచేవాడగాను నీచరణంబుల్।
చావైనను పెండ్లైనను। నేవిడు వనటంటి వట్టి నిజభక్తుడవెరా।
నేగనుగొంటీ నీనిష్ఠనౌరా। కావున నీకిట్టిఘనమైన। యీ బోధ
నేవేగదయజేస్తి నీవిదివిడువాకు। నిజభక్తుడవెరా। నేగను గొంటి
నీనిష్ఠనౌరా॥ 252**

## ప్రతిపదార్థము

నీవెంత కొట్టి తిట్టిన = ఏ విధమైన శిక్షణకు నీవు నన్ను గురిచేసిన
నేవిడిచే వాడను గాను నీచరణంబుల్ = నీ పాద పద్మాలు నేనెప్పుడూ విడచి వుండను

చావైనా, పెండ్లైనా = మంచి జరిగినా, చెడుజరిగినా

నేవిడువనటంటివి=నేను విడిచి యుండు వాడనుకాను అని బుజువు పల్కితివి

అట్టి నిజభక్తుడవేరా = పరిపూర్ణ భావమును దృఢపరచుకొనుటకు కావల్సిన యోగ్యత పాత్రత కలిగివున్నవాడవు

నే కనుగొంటి నీనిష్టనౌరా = పైన తెల్పిన యోగ్యత, పాత్రత నీయందు కలిగి యున్నవని నేను సంపూర్ణముగా విశ్వసించి

కావున = అందుచేత

నీకిట్టి ఘనమైన ఈబోధ = గొప్పదైన ఈభావము నీకు

వేవేగ దయ జేస్తి = వెంట వెంటనే నీకు దృఢ పరచి యుంటిని

నీవిది విడువకు = ఎట్టి పరిస్థితులలోనూ దీనికి దూరము కాకు

## తాత్పర్యము

నీవు ఎటువంటి శిక్షణకు గురిచేసినా (కష్టములకు) నీ పాదములను నేను విడిచి యుండను. కష్టమైనా, సుఖమైనా, మంచి జరిగినా, చెడుజరిగినా నీ, నా, జీవితము ముడి పడి యున్నది. నాజన్మ సార్థకము ఇచ్చుటనే నీవల్లనే పొందవలసి యున్నది. అని శిష్యుడు గురువును, గురు ధర్మమును ఆశ్రయించి వుండుట కర్తవ్యమై యున్నది. నిజమైన భక్తునికుండవలసిన లక్షణము లివియే. పరిపూర్ణ భావము దృఢ పరచుకొనుటకు కావల్సిన యోగ్యత కూడా ఇట్టిదని చెప్ప వలెను. ఇట్టి మానసిక స్థితి యందు గురువాక్యము యధా తధంగా అనుభవనీయం కాగలదు. ఇట్టి అనుభవం దృఢపరచుకొన్న మీదట ఆ స్థితియందే తన జీవితమును వెచ్చించి జీవించుట చాలా అవసరమైయున్నదని తెలియవలెను.

కం॥ నానోటిమాటవెంబడి। తానెప్పుడు సంచరించెతగనీ చిత్తం।
బేనదిగని యీ బోధ। విధానమునీకిస్తిదీన్ని। దాచుకోసుమ్మీ।
నిత్యము నీవు। చూచుకోనమ్మీ। యేనరుడైన నిన్నీ బోధన డిగీతె।
వానిమనసరయాకవానికి జూపేవు। దాచుకోసుమ్మీ। నిత్యము
నీవు చూచుకోనమ్మీ॥ 253

## ప్రతిపదార్థము

నా నోటి మాట వెంబడి=నేను చెప్పిన ఈ మాట ప్రకారము నీమనసును నడిపించుట

తానెప్పుడు సంచరించు తగ నీచిత్తంబు = దాని కనుగుణ్యంగా నీభావన, ఆలోచన ప్రవర్తించ గలిగినప్పుడు లేక నడత గలిగినపుడు

ఏనదిగని = అట్టి యోగ్యతను నే గమనించి

ఈబోధ విధానము నీకిస్తి = పరిపూర్ణ బోధయందలి సమగ్ర సారాంశము నీకు ప్రబోధించి యున్నాను

దీన్ని దాచుకో సుమ్మీ = నీ అంత:కరణయందు పదిలపరచుకో

నిత్యము నీవు చూచుకో నమ్మి = అత్యంత శ్రద్ధా భక్తులతో ప్రతి నిత్యము దీనియందు వునికి కలిగి వుండుము

ఏనరుడైనా నిన్నీ బోధనడిగితే = సాటి మానవులెవరైనా నిన్నీ భావము గురించి ప్రశ్నించినపుడు

వానిమనసరయక = వాని ఆసక్తిని, యోగ్యతని గమనించక

వానికి జూపేవు = అట్టివానికి తెలియ పరచేవు

## తాత్పర్యము

గురువాక్యము యధాతథంగా గ్రహించి పాటించగలిగే మనస్సు శిష్యునికి కలిగి యుండుట ఒకముఖ్యమైన అధికారంగా ఈ సాంప్రదాయమందు చెప్పబడుచున్నది. అట్టి మనస్సుకలవానికి మాత్రమే ఈ బోధను దృఢపరచగలుగు విధానము గురువు ఉపదేశించుననని కూడా చెప్పబడుచున్నది. పరిపూర్ణభావము వినుట చేతనే తరించుట అను సూత్రము పై ఆధారపడి యున్నది. దీనినే సద్యోన్ముక్తిగా చెప్పవచ్చును. తన్నాశ్రయించిన శిష్యునికి ఇట్టి మానసిక స్థితి ఉన్నది, లేనిది స్పష్టముగా గ్రహించి లేనిచో గమనించి అట్టి యోగ్యతను కలిగించి గాని ఇందలి రహస్యములు ప్రబోధించరాదని చెప్పబడుచున్నది. అట్టి భావమును, యోగ్యతను దృష్టి లోవుంచుకొని ఈ కందార్థములను శిష్యుని మానసిక

పరిస్థితిని గమనించి బోధ విధానము అనగా శ్రేష్టమైన విలువలు, రహస్యములు నీకుపదేశిస్తున్నానని అత్యంత జాగురూకతతో తనఅంత:కరణ యందు దీనిని భద్ర పరచుకొని, ప్రతినిత్యము ఏమరపాటులేక జాగ్రత్త పరచుకోమని, బయట వారెవరైనా ఆసక్తితో దీనిని గూర్చి ప్రశ్నించినప్పుడు వారి అంతర్యమును గ్రహించక ఈ భావమును వారిముందు వ్యక్తపరచవద్దు అని తెలియ వలెను.

## దృష్ట ద్రాష్టాంతములు

పరిపూర్ణ సిద్ధాంతరీత్యా పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను క్రమములో ఎరుకను వీడుట ప్రముఖమైన విషయముగా, చివరి అంశముగా చెప్పబడుచున్నది. విడచు విధానము అనుభవ పూర్వకంగా ప్రమాణ బద్ధంగా స్పష్ట పరచవలసియున్నది. భ్రాంతిరహిత విధానమందు ప్రతిపాదిస్తూ ఈసిద్ధాంత కర్తఅయిన శివరామ దీక్షితులవారు ఎరుక పుట్టనేలేదు. పరిపూర్ణము వున్నదని ఎవరికెరుక అని వుద్బోధించి యున్నారు. ఉత్తమాధికారి విషయంలో ఈ అంశము స్పష్టముగా తెలియబడును. మధ్యమాధికారుల విషయంలో అనగా పరిపూర్ణమనేదొకటి, లేనెరుకనేదొకటి, పరిపూర్ణమెరుకాల నెరిగి ఎరుకను మాను అనుక్రమంలో ఎరుకను విడచుటకు ఈ గ్రంథకర్త ఈ గ్రంథమునందు దృష్ట ద్రాష్టాంతములు అను పేర ఈభావమును ప్రతిపాదిస్తున్నారు. ఎరుక లేక పోవుటకు కలను దృష్టాంతముగాను, కర్పూర దీపములు ద్రాష్టాంతము లుగాను ఇందు చెప్పబడుచున్నవి. కలనుండి మెలకువ కలిగించుటకు ఎట్టి ప్రయత్నము చేయవలెను? అట్లే ఎరుకనే కలనుండి బోధ అను మెళకువ ద్వారా దృఢపరచు విధానము దృష్టాంతము గాను అనుభవములో లేక ఆరూఢతలో బోధచే ఎరుక ఎట్లు లేక పోవును అను సందేహ మనస్కులకు ద్రాష్టాంతము అను యుక్తి చే కర్పూరము, దీపము వీటి సంయోగములో కలుగు జ్వాల ఎట్లుప్రకాశించి లేక పోవుచున్నది అను అంశములు ప్రతిపాదింపబడి యున్నవి.

కం॥ దృష్టాంతమెరుకకేదని। యోష్టము గదిలించగా। నె యొరులు
కలనుచున్। దార్ష్టాంతమడుగ బోధకు। స్పష్టముగా। కర్పూర।
దీపము జూపవోయీ। యీ యుక్తి లోపము జేయకో యీ
తుష్టినొందెదరిట్లుతోచి చెప్పితివేని। శ్రేష్టామౌ యీ బోధ। చేకొన్న
వారు। దీపముజూపవోయీ యీ యుక్తిలోపము జేయకోయీ॥ 254

## ప్రతిపదార్థము

యొరులు = ఇతర సాంప్రదాయకులు

ఓష్టము = పెదవి

కదిలించగానె = మాట్లాడుట మొదలు పెట్టగానె

దృష్టాంత మెరుక కేదని = ఎరుక లేక పోవుటకు ఉదాహరణ ఎటువంటిదని

కలనుచున్ = కలవంటిదని

ద్రాష్టాంత మడుగ బోధకు=అనుభవ పూర్వకంగా మెళకువపొందు విధానమెట్లు

స్పష్టముగా = ఎట్టి సందేహము కలుగ కుండా

కర్పూరము, దీపము జూపవోయి = కర్పూరమును, నిప్పును చూపించుము

యీ యుక్తికి = ఈ విధానమునకు

లోపము చేయకోయి = ఏ మాత్రము తక్కువ చేయకు

తుష్టి నొందెదరు= సమాధాన పడెదరు

ఇట్లు తోచి చెప్పితివేని = పైవిధంగా సమాధాన పరచితివేని

శ్రేష్టమౌ ఈ బోధ చేకొన్నవారు = ఉన్నతమైన భావము నందు ఆరూఢత చెందినవారైతే

## తాత్పర్యము

పరిపూర్ణ బోధరీత్యా ఎరుక లేనిది అని తెలియు చున్నది. అది ఎట్లు సాధ్యము అని ఎవరైనా సందేహము వ్యక్తపరచినచో కలను ఉదాహరణగా చెప్పవలసియున్నది.(సురి స్వప్నము) అనుభవమునందు ఎట్లుసాధ్యము అని సందేహ పడినచో కర్పూరము, దీపము వెలిగించి వారి ముందుంచుము. ఈ ప్రక్రియ యందు ఎట్టి లోపము ఉండరాదు.

పరంపరానుగతంగా వచ్చు ఈ సాంప్రదాయమునందు గురుముఖత: ఉన్నది వున్నట్లుగా ఆరూఢపరచుకొన్నవారైతే నీవు చూపిన యుక్తికి సమాధాన పడి సంతోషించెదరు.

## నిజ శిష్య నిర్ణయము

పరిపూర్ణ భావమును వస్తునిశ్చయ పూర్వకంగా దృఢపరచు కొన్నమీదట (పరిపూర్ణ మెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను) గురవాజ్ఞాను సారము జీవించు మీదట స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు గుర్తెరిగే ఎరుకకు మూలముగాని స్థానము గాని లేదని ధృఢ పరచుకొని, ఈ భావము కలిగించుకొన్నగుర్తుని గురుదక్షిణగా సర్వార్పణ భావముతో గురునకు సమర్పించి ఎట్టి నిర్ణయము చేయుటకు వీలు కాక వ్యవహార సత్తా కొరకు గుర్తును తిరిగి గురువుచేత పొందబడి తాను పొందిన మానసిక స్థితి(ఆరూఢత) దిగజారకుండా వుండుటకు గురునిష్ట యందే తదనంతర జీవితమును వెచ్చించుటకు నిలిచి యుండును. అనగా వున్నది పరిపూర్ణము లేనిది ఎరుకయనిగాని, తానేమీ లేనని గానీ అను ఎట్టి భావములకు లోను కాక గురువు నిర్దేసించిన జీవన విధానమునే ప్రమాణము గా గైకొని ఆదర్శ వంతముగా, స్వేచ్ఛగా ఎట్టి భ్రమ, ప్రమలకు లోనుకాకుండా సర్వ స్వతంత్రమై, శేష జీవితము ఆనందమయమై శాంతిమయమై యుండులాగ జీవించును. అట్టి విధానము ఎట్లుండునో ఈ శీర్షికయందు గల కంధార్థములలో చెప్పబడుచున్నది.

కం॥ జలమునెడబాయనొల్లని। జలచరములతీవిబూని సచ్ఛిష్యుడు
వ్యాజ్జలజంబను షీతముపై। నిలిపితరముమాని।
గురువునేకొల్చు నమ్మీ। తదూకర్తాల। నేతల్చునమ్మీ।
కలకాలమీరీతి గడుపూచునే ప్రొద్దు తలిదండ్రిదొరదాత
దైవమనుచు గురువు। నేకొల్చునమ్మీ। తదూకర్తాల
నేతల్చునమ్మీ॥ 255

## ప్రతిపదార్థము

సచ్ఛిష్యుండు = శ్రేష్టుడైన శిష్యుడు

జలము నెడబాయ నొల్లని జలచరములు = నీటియందు నివసించు చేపలు ఆనీటిని విడచి యుండుట కిష్టపడక

ఠీవి బూని = నీటియందు స్వేచ్ఛ స్వతంత్రము కలిగియుండి

హృజ్జలజంబను పీఠముపై = హృదయ పద్మమునందు, తాను ఏర్పాటు చేసుకొన్న పీఠము నందు

ఇతరము మాని = ఇతరమైన మానసిక వ్యవహారములు విడిచిపెట్టి

గురువునే కొల్చు సుమ్మీ = తనకు మంత్రోపదేశము చేసిన గురుమూర్తినే మంత్రరూపముగా ధ్యానించుచుండును

తదూక్తులనే తల్చు సమ్మీ = తనకు ఉపదేశింపబడిన బోధయందలి ముఖ్యాంశములను అత్యంత భక్తి శ్రద్ధలతో పదే పదే గుర్తుచేసుకొనుచుండును

కలకాలమీ రీతి గడుపూచు = జాగ్రదావస్థయందు, లౌకిక వ్యవహారముల యందు తనప్రమేయము అవసరము ఉన్నంతవరకు వెచ్చించి మిగతా కాలమంతయు

ఎప్రొద్దు = క్రమము తప్పక ప్రతిదినము దీనిని పాటిస్తూ

తల్లి, తండ్రి, దొర, దాత దైవమనుచు గురువునే = తనకు జన్మనిచ్చిన తల్లిగా, పెంచిపోషించు తండ్రిగా తనను పరిపాలించు దొరగా, తనయోగ క్షేమములు గ్రహించు భగవంతునిగా

గురువునే కొల్చు సుమ్మీ = తనకు మంత్రోపద్రష్ట అయిన గురువుయందే పైవస్తు తత్వములన్నియు కలవని భావించుచుండును.

## తాత్పర్యము

పరిపూర్ణ భావమందు విషయ ప్రవేశము కలిగిస్తూ, ఇందలి గురుశిష్యులను శ్రేష్టులుగా పేర్కొన్నారు. ఈ శ్రేష్టత్వము కొన్ని ఆదర్శములతో కూడిన జీవన విధానమునకు సంబంధించినదిగా యున్నది. పరిపూర్ణ బోధయందు ఆరూఢత చెందుట అను అంశమును, ఆశిష్యుని యొక్క

మానసిక స్థితి ఏవిధముగా యుండునో, అతని జీవన విధానము ఆదర్శ వంతమై ఎట్టి భ్రమ, ప్రమలకు లోనుగాక ఎట్లు వినియోగింప బడునో ఈ కందార్థమునందు స్పష్ట పరచ బడుచున్నది. తాను గ్రహించిన పరిపూర్ణ భావమునందు గల స్థితిలక్షణమును తాను పాటించు గురునిష్టద్వారా అనుభవనీయము గావించుకొనుచు యావజ్జీవితము ఆభావమునందే మరుపులేక స్పృహ కలిగియుండుటకు తాను అనుసరించు గురునిష్ట యే యోగ్యమైనదిగా భావించి, గురుమూర్తిచే తనకుపదేశింపబడిన మంత్రము, మంత్రార్థము, మంత్రరహస్యములను తన హృదయ పీఠమందు స్థిరపరచుకొని ఇతర భావములేమియు దరికిరానివ్వక భావ శుశ్రూష క్రమమునకు ఎట్టి భంగము వాటిల్లకుండా గురూపదిష్ట మార్గములో తాను గడిపిన జీవనవిధానము, బోధనా క్రమము పదేపదే వల్లించుకొనుచు, తనకుపద్రష్ట అయిన గురుమూర్తియందు తన భౌతిక జీవనమునకు ఉ పాధికి కారణమైన తల్లి దండ్రులు, తనకు శక్తి సామర్ధ్యములు ఇచ్చి పరిపాలించు ప్రభువు తనజీవన గమ్యము లక్ష్యమగు భగవంతునిగా మున్నగు లక్షణములన్నియు తన గురుమూర్తి యందే భావించుకొని వ్యవహార కాలమునందు తనవునికిప్రమేయము అవసరమైన మేరకు వినియోగించి మిగిలిన కాలమంతయు పైన పేర్కొన్నవిధముగా జీవించుటకు ప్రయత్నించును. దీనినే గురునిష్ట అనిచెప్పబడును. నిజమైన శిష్యుని మానసిక స్థితి, జీవన విధానము ఈవిధముగానే వుండును. ఇందుకు అనువుగా అనుభవములో ఒక దృష్టాంతము ద్వారా గురునిష్టయొక్క స్వరూప స్వభావములు మనకు విశదీకరిస్తున్నారు. నీటియందు నీరు, చేపపిల్ల వీటిఉ నికిని ఉదాహరణగా చెప్పుచూ, నీటిని ఆశ్రయించుకొన్న చేప తన ఉనికి అంతయు నీటియందే వెచ్చించి, బయట పడుటకు ఇష్టముకాక నీటియందు స్వేచ్ఛా స్వాతంత్రములతో ఎట్టి భయములకులోనుకాక ఎట్లు జీవింపగల్గునో ఆవిధంగానే నిజ శిష్యుని వర్తనము ఉండునని ఇందుస్పష్ట పరచుచున్నారు.

**కం॥ సతిపొరుగూరికిబోయిన। పతిరాకడకోరినట్లు భావము లోనన్**
**మతిమంతుడు సచ్ఛిష్యుడు। సతతముగురురాకగోరు। సత్యాము**
**వినరా। వానితోటి। సాటెవ్వరనరా। హితుని రాకడను స్నేహితుడు**
**గోరినయట్లు। సత్యాము వినరా। వానితోటి। సాటెవ్వరనరా॥ 256**

## ప్రతిపదార్థము

సతి = భార్య
పొరుగూరికి పోయిన పతి = కార్యార్థమై ఇతర గ్రామమునకు వెళ్ళిన భర్త
రాకడ కోరినట్లు = తిరిగి వచ్చుట కొరకు
భావము లోనన్ = ఆదుర్దాతో, ఉత్సుకతతో
మతిమంతుడు సచ్ఛిష్యుడు = శ్రేష్టమైన బుద్ధికలిగిన శిష్యుడు
సతతము = ఎల్ల వేళలా
గురురాక కోరు = గురు దర్శనమునకు , ప్రబోధకు ఎదురు చూచుచుండును
సత్యము వినరా=ఇది అంతయు వాస్తవమైన విషయముగా తెలుసు కొనుము
వాని తోటి సాటెవ్వరన=ఇట్టి గురుభక్తి గలవానితో పోల్చుటకు వేరెవ్వరు సరిపోరు
హితుని రాకడను స్నేహితుడు గోరినయట్లు = ఎట్టి ప్రతిఫలమును ఆశించక ఒకరికొకరు సహాయ పడగలుగు లక్షణము కలిగిన మిత్రులు ఒకరి నొకరు కలిసికొనుటకు
అతిదరిద్రుడు = తీవ్రమైన ఆర్థిక ఇబ్బందులకు లోనైనవాడు
ద్రవ్యతతిరాగోరినయట్లు = ధనప్రాప్తి కొరకు ఎట్లు ఎదురు చూచుచుండునో
సత్యము వినరా = ఇది అంతా వాస్తవమైన విషయము

## తాత్పర్యము

వ్యవహారార్థమై తనభర్త గ్రామాంతరమునకు వెళ్ళినపుడు, తిరిగి తనభర్త తన్ను చేరుటకు ఆలస్యమైనపుడు అతనిరాకకొరకు భార్య ఎట్లు ఎదురు చూచు చుండునో, ఎట్టి స్వార్థ పరత్వము లేక ఒకరి యందు ఒకరుప్రేమ కలిగి స్నేహితులు ఒకరి కొకరు ఒకచోట వుండుటకు ఎట్లు ఎదురు చూచు చుందురో, తీవ్రమైన దరిద్రబాధతో అనేక కష్ట నష్టములకు

గురిఅగుచున్నవాడు ఐశ్వర్యప్రాప్తికొరకు ఎట్లు ఎదురు చూచు చుండునో ఆవిధముగానే యోగ్యుడైన శిష్యుడు గురుదర్శనమునకు, గురుప్రబోధకు అట్లు ఎదురు చూచు చుండును. అట్టివానితో వేరెవ్వరూపోల్చుటకు సరిపోరు. ఇదిసత్యమై అనుభవనీయమైన అంశము అని తెలియవలెను.

కం॥ అతివెలరతిచతురతలా। యతివలచేవారితంద్రులర యరనుచు
త। త్పతులరయరెరతి నట్లనె। మతిమంతుడు గురుడు బోధ।
మానీనగాని। తద్బోధతా మానాడుపూనీ అతి దరిద్రుని
చేవిధ్యార్జించినతగాడు। చతురుడై విత్తామార్జన జేయు
పంతూలు। మానీనగానీ। తద్బోధతా। మానాడుపూనీ॥ 257

## ప్రతిపదార్థము

అతివెలు = స్త్రీలు
రతి చతురత=సంసార జీవితమందు వారు పొందిన నేర్పరి తనం, అనుభవము
అతివలచే = అట్టి స్త్రీలచే
తత్పతులరయరెరతిని=వారిభర్తలకే సంసార జీవితములో స్పష్టముగా తెలియును
వారి తంద్రులరయ రనుచు=వారి తంద్రులకే మాత్రము తెలియదు
అట్లనే = ఆవిధంగానే
మతి మంతుడు = చక్కటి బుద్ధి గలవాడు, పరిపూర్ణ భావమున్నదున్నట్లుగా గ్రహించినవాడు
గురుడు బోధమానిన గాని = గురుమూర్తి ప్రబోధ ద్వారా పరిపూర్ణమును ఎరుకను ఎరిగించి, ఎరుకను విడిపించి స్థితి లక్షణము కలిగించిన తరువాత
పూని = తిరిగి
తద్బోధ మానడు = బోధ యందు కృషి చేయుట అనగా వినుట చెప్పుట యందు ఎట్టి నిర్లక్ష్యము, అశ్రద్ధ లేక
అతిదరిద్రునిచే = గొప్పదరిద్ర బాధలోనున్నా
విద్యార్జించినతగాడు = విద్యను సంపాదించినతడు
చతురుడై = మిక్కిలి తెలివి తేటలతో

విత్త మార్జనచేయు=ధనము సంపాదించి తనవిద్యను అభివృద్ధిలోకి తెచ్చును.

## తాత్పర్యము

యుక్త వయసు వచ్చిన స్త్రీలకు తల్లి తండ్రులు వివాహ సంస్కారమొనర్చిన పిదప ఆ స్త్రీలు తమ భర్తలతో కలిసి జీవించుచు రసవత్తరమైన శృంగార జీవితమును ఒకరి కొకరు అనుభూతము కావించు కొందురు. ఆ స్త్రీల నేర్పరి తనము ప్రావీణ్యము వారి భర్తలే ఎరుగుదురు గాని, జన్మ నిచ్చి, పెంచి పోషించి, పెద్ద చేసి, వివాహము జరిపిన తండ్రులు వారి ప్రావీణ్యత నెరుగ జాలరు. ఆవిధంగానే పూర్వపుణ్య విశేషముచే బుద్ధిచే ప్రేరేపింపబడి జన్మ తరుణోపాయమునకు పరిపూర్ణభావమె మార్గముగా ఎన్నుకొని, సామర్థ్యముగల సద్గురుమూర్తిని జేరి వారి ద్వారా ఉపదేశ దీక్షగై కొని క్రమ పద్ధతిలో యోగ్యతను, పాత్రతను సంపాదించి, గురు అనుగ్రహము ద్వారా పరిపూర్ణ భావము నందు స్థిరమైన, దృఢమైన నిపుణత పొంది యుండును. అట్టి ఆరూఢతచే తానుపొందవలసిన జ్ఞానము ఇక ఏమీ లేకున్నను గురుమూర్తి ద్వారా భ్రాంతి రహిత విధానమందు స్థితి కలిగి యున్నను ఎట్టి నిర్లక్ష్యము, ఏమరుపాటు లేక బోధ యందు కృషి సల్పుచు బోధకు మెరుగులు దిద్దును. ఎట్లనగా అతి దరిద్రుడైవుండి విద్యాభ్యాసము కావించు కొని తాను పొందిన విద్యచే భుక్తి క్రియంకు ఎట్టి లోపమురానీయకుండా ధనార్జన గావించుకొను వాని వలె యిహపరముల కాదర్శ ప్రాయుడై, తన ప్రజ్ఞాపాటవములచే సాంప్రదాయమును సమాజమున కందించుచూ నిరంతరము కృషిసల్పుచు వుండును.

కం॥ దేశికుని చరణతీర్థము। కాశీగంగయని గురుని గనుగొన్నువి।
శ్వేశుడనియతడుతన। కుపదేశంబొనరించి నట్టిదే। తారకమనీ
మనసందుతా। నీతీరునగనీ। యేసీమ యందున్న। కాశిప్రయాగ
రామేశునిపురమై। ప్రకాశించు నాసీమ। అదేతారకమనీ।
మనసందుతా। నీతీరునగనీ॥ 258

## ప్రతిపదార్థము

దేశికుని చరణ తీర్థము = తనకు మంత్రోపదేశము చేసిన గురుమూర్తి యొక్కపాద జలము
కాశీ గంగయని=అత్యంత పుణ్యప్రదమైన, శక్తివంతమైన కాశీ గంగ గాను
గురుని కనుగొన్నను = తనకుపద్రష్ట యైన గురుమూర్తిని దర్శించుట
విశ్వేశుడని = కాశీ పురాధీశుడై విశ్వవ్యాప్తమై యున్న పరమేశ్వరునిగాను
అతడు = ఆగురుమూర్తి
తనకుపదేశమొనరించినట్టిదె = హస్త మస్తక సంయోగము ద్వారా తాను ఉపదేశము పొందిన మంత్రము
తారకమని = తనకు జన్మకర్మల నుండి తరింపజేయుటకు వీలైవున్న అత్యంత శక్తివంతమైన మహా మంత్రమని
మనసందున = తన మనస్సులో
తానీ తీరున గని = తానీ విధముగా భావన కలిగించుకొని
ఏసీమయందున్న=ఇట్టి భావనా బలముచే ఏఏప్రదేశములందు తాను తిరుగు చున్న
ఆ సీమ = ఆయా ప్రదేశము లన్నియు
కాశీ ప్రయాగ రామేశుని పురమై ప్రకాశించు =కాశీ ప్రయాగ, రామేశ్వరము అను పుణ్యప్రదేశము లందు తానున్నట్లుగాభావించు కొనును

## తాత్పర్యము

ఈ కందార్థము నందు గురూపాసన విధానము, భావనా బలము అను అంశములు రెండునూ స్పష్టముగా చెప్పబడుచున్నవి. పరిపూర్ణబోధ ఆరూఢమగుటకు అందుకు సరిపడా జీవించుటకు గురుకృప అత్యంత అవసరమై వున్నది. గురుసాక్షాత్ పరబ్రహ్మ అను భావము తన నిత్యదైనందిన జీవితములో సహజమై పోవలెను. తనకు మంత్రోపదేశమును అనుగ్రహించిన గురుమూర్తి పాదములు అభిషేకించిన జలమును అత్యంత పుణ్యప్రదమై శక్తివంతమైన కాశీ గంగగానూ, తన గురుమూర్తియే

విశ్వమూర్తియైన విశ్వేశ్వరుడుగానూ, భ్రాంతి రహిత విధానమునకు, జన్మకర్మలనుండీ విముక్తి పొందుటకు ఉపదేశ దీక్షగా పొందిన మంత్రమే తనను తరింపజేయు తారక మంత్రమని, భావనలకు కేంద్రమైన తన మనస్సునిండా ఇట్టి భావజాలము కలిగియుండును. గురుతత్వము వ్యక్తినిష్టముగా, తత్వనిష్టముగా వస్తునిశ్చయ పూర్వకముగా తెలుసుకొన్న వారికి మాత్రమే ఇది సుసాధ్యము. ఇట్టిది రహస్యమై గురుగోప్యమై ఉన్నది. ఇట్టి భావనా బలము కలిగినవారు ఏ ఏ ప్రదేశములయందు తిరుగాడుచున్నా ఆయా ప్రదేశములన్నియు ఏకమై ఒకటిగా ప్రకాశిస్తూ సమస్త దేవతా మయమై పుణ్య తీర్థమయమై ప్రకాశించు చుండును. ఏలననగా గురుమూర్తి సర్వ దేవతా స్వరూపుడు అందుచే అట్టి ఆరూఢత యందు ఇట్టి భావ పరంపర ఏర్పడును అని తెలియ వలెను.

**కం॥ గురుచరణజలముగోదా। వరియనిగురుమూర్తి రామభద్రుండ**
**నిత। త్పురమును భద్రాచలమని। గురుమంత్రమె తారకమని।**
**గురిగలిగినట్టీ। తిరిగిరాని। మరుగెరిగినట్టీ। నరు డున్న చోటే।**
**సుందర శేషగిరిభద్ర। గిరిరంగనాయక పురమాన దగి యుండు।**
**గురి గల్గినట్టీ। తిరిగిరాని। మరుగెరిగినట్టీ॥ 259**

## ప్రతిపదార్థము

గురు చరణ జలము = తనకు మంత్రోపద్రష్ట అయిన గురుమూర్తి పాదములు అభిషేకించిన జలము

గోదావరియని = అత్యంత పుణ్యప్రదమైన గోదావరి నదియని

గురుమూర్తి రామభద్రుడని = తనకు మంత్రదీక్ష నొసంగిన గురుమూర్తి అంతర్యామియైన ఆత్మారాముడని

తత్పురమును భద్రాచలమని = అతడు నివసించు ప్రదేశము పుణ్యక్షేత్రమైన భద్రాచలముగాను

గురుమంత్రమె = జన్మకర్మలు తొలగుటకు అతడుపదేశించిన మంత్రమె తారక మంత్రమని

గురి కలిగినట్టి = విశ్వాసముతో కూడియుండి
తిరిగిరాని మరుగెరిగినట్టి = తిరిగి జన్మ కర్మలకు రాకుండా పోవు రహస్యవిధానము దృఢపరచుకొని
నరుడున్నచోటె = ఇట్టి భావనా బలము కలిగియున్నవారు ఎక్కడున్నా (ఏఏ ప్రాంతములందున్నా)
సుందర శేషగిరి = అత్యంత సుందరమైన ఏడుకొండలలో ఒకటిగా పిలువబడుచున్న శేషా చలమని
భద్రగిరి = సీతారామ లక్ష్మణులు కొలువైయున్న భద్రాచలముగాను
రంగనాయక పురమనదగియుండు = కలియుగ వైకుంఠముగా చెప్పబడుచున్న శ్రీరంగనాధుని నివాసస్థలమైన శ్రీరంగధామమని

## తాత్పర్యము

పై కందార్థమునందు పేర్కొనబడినవిధంగానే ఈకందార్థము నందు కూడా అన్వయించుకోవలెను. గురుమూర్తి పాద జలము గోదావరి యని, అతడు సాక్షాత్తు రామభద్రుడని, ఆయన నివశించు ప్రదేశము భద్రాచలమని, జన్మ కర్మల రహితమునకు అతడుపదేశించినదే తారకమని, తనభావనా బలమును పెంపొందించుకొని పరిపూర్ణబోధను గట్టిగా దృఢపరచుకొని అట్టి స్థితియందు ఉనికి గలిగి గురునిష్టయందు ఏమరపాటు లేక జీవించుచున్న పరిపూర్ణభావజ్ఞుడు నివశించు ప్రదేశములన్నియు ఒకటిగా భావిస్తూ, అవన్నియు పుణ్యప్రదములైన క్షేత్రములుగా దేవతా మయమై యున్నవిగా ప్రకాశించుచుండును. అత్యంత సుందరమైన శేషాచలము, అందు నివసించు వేంకటేశ్వరుడు, భద్రాచలము, అందు నివశించు సీతాలక్ష్మణ సమేత శ్రీ రామచంద్రుడు, భూలోకమందు వైకుంఠముగా పిలవబడుచున్న శ్రీరంగము, రంగనాధుడు ఆప్రదేశములందే నివశించుచుండును. ఏలననగా గురుస్థానమును, గురుపీఠమును సమస్త దేవతా తీర్థములు ఆశ్రయించి వుండునని గురుగీతయందు చెప్పబడుచున్నది.

కం॥ ఇంగితము నెరిగిన సద్గురు। పుంగవుచే నరుడుం భుక్తి
ముక్తిక్రియలన్। సంగాసంగములెడలిన। శృంగారమెవానిచేష్ట।
చూచేవారలకూ। వాడున్నట్లు। తోచేవారలకూ। మంగాళ
సూత్రమే భంగి శృంగారమొ। శృంగారవతికి। యశృంగార
వతికట్లు। చూచేవారలకూ। వాడున్నట్లుతోచేవారలకూ॥ 260

## ప్రతిపదార్థము

ఇంగితము = రహస్యము

ఎరిగి = వస్తునిశ్చయపూర్వకంగా గుర్తించి

సద్గురు పుంగవుచే = పరిపూర్ణ గురుమూర్తి యొక్క అనుగ్రహముచే

నరుడు భుక్తి ముక్తి క్రియలన్ = అట్టి మానవుడు భుక్తి క్రియ యందు, ముక్తి క్రియ యందు

సంగా సంగములు = సంయోగ వియోగములు

వెడలిన = విడిచి పెట్టబడిన

శృంగారమె వారి చేష్టలు = వారి జీవన విధానము అందరికీ ఆనంద దాయకము గాను, చూడముచ్చటగానూ వుండును

చూచే వారలకు = లౌకిక జనులకు

వాడువున్నట్లు తోచే వారలకు = పరిపూర్ణ భావమందు ఆరూఢత చెంది వుండీ లేని స్థితిని పొందినవారు

మంగళసూత్రము = వివాహమందు భార్యాభర్తల ప్రాణరక్షణకై భర్తభార్యమెడలో అలంకరించు సువర్ణా భరణము

ఏభంగి = ఏ విధముగా

శృంగారమొ = అందమును, విలువను కలిగించునో

శృంగారవతికి అశృంగారవతికి = సౌందర్యవతికి, అసౌందర్యవతికి

## తాత్పర్యము

గురుమూర్తి యొక్క అనుగ్రహమునకు పాత్రుడై పరిపూర్ణ భావము నందలి రహస్యము (పరిపూర్ణమెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను) ఎరిగి

అశరీర పద్ధతిలో గురుర్వాక్యం యధాతథంగా అమలు పరుస్తూ, భుక్తి ముక్తి క్రియల రెంటియందు ఎట్టి సంయోగ వియోగములు అనగా కూడియుండుట, కూడి లేకుండుట అను అంశములలో లౌకిక జనులకు పరిపూర్ణ భావమందు సహపాటులై తనతో సమానముగా ఆరూఢత చెందిన వారికి, వీరిజీవన విధానము చూచేవారికి ఆదర్శవంతముగా నుండును. ఎట్లనగా వివాహ కాలమునాడు భర్త చేతిమీదుగా భార్యమెడలో వివాహ బంధమునకు గుర్తుగా కట్ట బడిన మంగళసూత్రము శృంగారవతికి, అశృంగారవతికి ఎట్లు విలువ కలిగించి లేకుండునో అట్లే వీరి జీవన విధానము ఆనంద ప్రదమై, ఆదర్శవంతమై వుండును.

కం॥ దూరము నసుండి విన్నను। చేరునుసజ్జనుడు గురుని
చెంతకుబోదం। గోరిదుర్జనుడు గోరడుదూరస్థుడు గాక గురుని।
తోగూడియుండీ। యెట్లనియన్న। దూరాననుండీ। కోరీ తుమ్మెద
తమ్మి జేరితేనియగ్రోలు। నారీతినెరుగావు చేరికప్పలు తమ్మి।
తోగూడియుండీ। యెట్లనియన్న దూరాననుండీ॥ 261

## ప్రతిపదార్థము

దూరము నుండి విన్నను=గురుస్థానమునకు తాను దూరముగా నుండి నివసించుచున్నను

చేరును సజ్జనుండు = సత్పురుషుడు దూరమును లెక్కచేయక గురువు వద్దకే చేరును

గురుని చెంతకు బోధగోరి = జన్మ కర్మల భ్రాంతి నుండి విడువ బడుటకు పరిపూర్ణబోధను పొందగోరి

దుర్జనుడు = పూర్వజన్మ సంస్కార ప్రేరణ లేనివాడు

కోరడు = కావాలని అభిలాష పడడు

దూరస్తుడు కాక = దూరముగా లేక పోయినా

గురునితో గూడియుండి = గురుస్థానమునకు అందుబాటులో కలిసిమెలసి వుండికూడా

ఎట్లని యన్న = ఆవిధానము ఎట్లన్న దనగా

కోరితుమ్మెద = కావాలనే కోరికతో తుమ్మెద

దూరాన నుండి = దూరముగా నున్నను

తమ్మి చేరి = పద్మమును సమీపించి

తేనియగ్రోలును = అందలి మకరందమును స్వీకరించును

చేరి కప్పలు తమ్మితో గూడియుండి = తామర కమలమును ఆశ్రయించు కున్న కప్పలు

ఆరీతి నెరుగవు=అందుబాటులోవుండి కూడా ఈ క్రమమును, విలువను తెలియలేవు

## తాత్పర్యము

పూర్వ జన్మ పుణ్య సంస్కారముచే ప్రేరేపింపబడిన సత్పురుషుడు జన్మకర్మల భ్రాంతి రహితము కొరకు పరిపూర్ణ గురుమూర్తి దూరముగావున్నను లెక్క చేయక అతని నాశ్రయించి బోధయందు ఆరూఢతచెందును. అట్టి సంస్కారము లేనివారు పరిపూర్ణ బోధ తెలియజేసే పుణ్యపురుషులకు సమీపములో నివసించుచున్నా, అందుబాటులో వున్నా ఈ ఫలితమును పొందలేరు. ఈ విదానమెట్లున్నదనగా భ్రమరము పద్మమునందలి మకరందమును కోరి ఎంతదూరముగా నున్నను లెక్క చేయక తామర పూవ్వు వద్దకు పోయి తేనెను సంపాదించును. కప్పలు తామరపువ్వునకు సమీపములో వున్నను పువ్వునందలి మధువును పొందలేవు.

కం॥ తన గురుబోధనుతా। జదివిన వినుజనవితతిమదికి
వింతైయీబో। ధను నేర్వకున్నవ్యర్థము। జననంబనితోచి శరణు
శరణానెటట్టా। వెంటనెవాండ్లు దరిజేరెటట్టా। ఘనమైన యుక్తి
జేసినవాడె శిష్యుడు। అనుమానమే మిందుగనరాదు వినవోయి।
శరణానెటట్టా। వెంటనేవాండ్లు। దరిజేరెటట్టా॥ 262

## ప్రతిపదార్థము

తనగురుబోధను = గురుమూర్తి ద్వారా తాను గ్రహించిన పరిపూర్ణ భావమును

తా చదివిన = తాను మననము చేసుకున్నపుడు

విను జనవితతి మదికి = ప్రక్కనే వుండి వాటిని వినుచుండే లోకుల మనసుకు
వింతై = ఆశ్చర్యమనిపించి
ఈ బోధను నేర్వకున్న = ఈ పరిపూర్ణ భావమును తాము గ్రహింపకున్న
వ్యర్థము జననంబని తోచి = ఈ జన్మ వృధా అవునని గ్రహించి
శరణు శరణనెటట్టు = ఈ భావమును ఆశ్రయించేటట్లు
వెంటనే = ఎట్టి ఆలస్యము చేయకుండా
వాళ్ళు దరిజేరేటట్టు = అట్టి వారు గురుమూర్తి నాశ్రయించేటట్లు
ఘనమైన యుక్తి చేసేవాడె శిష్యుడు = తన జీవన విధానముచే ఎదుట వారిని ఆకర్షింపజేసి పాటింపజేసేలా జీవించేవాడే నిజమైన శిష్యుడు
అనుమానమే మిందు కనరాదు = ఈ అంశమునందు ఎట్టి సందేహములకు తావులేదు.

## తాత్పర్యము

గురుమూర్తి ద్వారా తానువిన్నపరిపూర్ణ భావమును ప్రతినిత్యము మననము చేసుకొను విధానము నందు, భుక్తి ముక్తి క్రియల రెంటియందు తన జీవన విధానముచే లౌకిక జనులచే ఆకర్షింపబడి తాముకూడా ఈ భావమునందు ప్రవేశించి కృషిచేసి ఈ ధర్మమునందు ఆరూఢత చెంది, మానవజన్మను సార్థకత కావించుకొనవలెనని వారికి వారుగా గ్రహించి, గురుమూర్తిని ఆశ్రయించుటకు ఎట్టి వ్యవధి, కాలయాపన చేయకుండా శరణాగతి పొందేటట్టు చేసేలా నడవడిక కలిగిన వాడే నిజమైన శిష్యుడు ఇందులకెట్టి సందేహము లేదు.

## గురుస్తవము

స్తవము అనగా స్తుతించడము అని అర్థము. 84 లక్షల జీవరాసులలో మనవోపాధి అత్యంత దుర్లభమైనదిగా చెప్పబడుచున్నది. జన్మ కర్మల రహిత విధానమే జీవితలక్ష్యముగా నిర్దేశింపబడియున్నది. అందులకనువుగా పరిపూర్ణ భావమే శ్రేష్టమైన, సక్రమమమైన మార్గముగా

పెద్దలచే పేర్కొనబడుచున్నది. బ్రహ్మైవాహమస్మి అహంపదార్థ రహిత: అను లక్ష్యముతో అచలఋషి సాంప్రదాయము ద్వారా పరంపరా ప్రోక్తమై గురుశిష్యన్యాయములో అవిచ్ఛిన్నముగా ప్రచారము గావింపబడుచు నేటికి తెలుగు భాషలో "శివరామ దీక్షితీయ సిద్ధాంతము " అను పేర భ్రాంతిరహిత విధానమే లక్ష్యముగా నేటిసమాజంలో ప్రచారంలో వున్నది. ఇందు రెండు ప్రధానాంశములు ప్రతిపాదించి జీవిత లక్ష్యాన్ని గమ్యాన్ని నిర్దేశించుచున్నవి. అందు ప్రథమంలో ఏది తెలిసినమీదట సమస్తమును తెలిసినట్లు కాగలదో అట్టి దానిని వస్తునిశ్చయపూర్వకముగా తెలియ జేయుట. దేనిని విడిచిన మీదట సమస్తమును విడిచినట్లు కాగలదో అట్టి దానిని విడిపించుట, అందుల కనుగుణ్యముగా, భుక్తి ముక్తి క్రియలకి సమతూకంపాటిస్తూ, ఆదర్శప్రాయమైన జీవన విధానాన్ని ఏర్పరచుట ఇందలి ముఖ్యాంశములు. ఈ కృషియందు వ్యక్తి గతమైన కృషితో సరిపుచ్చక, ఆదర్శవంతమైన శిక్షణా క్రమముతో కూడుకున్నగురుని మార్గదర్శకత్వముతోడ ఈశ్వరానుగ్రహప్రాప్తిచే (గురుకృప) అన్నిఅవరోధములు తొలగించుకొని, కృతకృత్యుడగుటకు కావలసిన బోధనా పద్ధతి, వస్తునిశ్చయజ్ఞానము ఇందు నిర్దేశింపబడి ఉన్నవి. కావున సామాన్యమైన ముముక్షువులకు ఇది దుస్సాధ్యము. గురుని మార్గదర్శకత్వములో సుసాధ్యము అయివున్నవి. ఈ మార్గమునందు గురుశిష్యులిరువురు సమతూకముతో ఆదర్శవంతమై కృషికి, జీవన విధానానికి ఆదర్శవంతులై " మణియేన వలయం, వలయేన మణి " ఒకదాని కొకటి ఎట్లు ప్రభావితం గావించుకొనుచున్నవో, అట్లే వీరు ఆదర్శవంతులై సాంప్రదాయమునకు వన్నెను తీసుకు రాగలరు. అత్యంత దుర్లభమైన ఈ సాంప్రదాయమునందు ప్రవేశించి ఆదర్శవంతంగా కృషిచేసి ఈ సిద్ధాంతమందలి సారవంతమైన బోధనా క్రమము (పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను) గురువాక్యము యథాతథంగా జీవితాన్ని వెచ్చిస్తూ, తాను ఆరూఢపరచుకొన్న పరిపూర్ణభావము యొక్క విశిష్టతను, విలువలను, బోధనాపద్ధతియందు నేర్పరితనము అందుకు వలయు

తనసుకృతము, అదృష్టమును, కలగలుపుకొని దీనికి ఆధార భూతమైన తనకుపద్రష్ట అయిన గురువును అత్యంత భక్తితో, వినమ్రభావముతో ప్రార్థించువిధానము ఈశీర్షిక ద్వారా చెప్పబడుచున్నది.

**కం॥ గురువరమీనాసందున। యెరుకను తెరగలిగి। యుండె యిన్నాళ్ళగొలెన్ కరుణారసేక్షణముల। తెరదీసితి రెరుకమాట దీరెనిక్కడికీ। చాలుబోధ। దూరేదెక్కడికీ। పరిపూర్ణమును లేని యెరుకాను జూపించి। యెరుకలేదని యంత్రి యెరుకే లేదాయను। తీరెనిక్కడికీ। చాలుబోధ। దూరేదెక్కడికీ॥ 263**

## ప్రతిపదార్థము

గురువర = ఓ సద్గురుస్వామీ!

మీ,నా సందున = మన ఇరువురి మధ్య విచారణలో

ఎరుకనే తెర కలిగియుండె = ఎరుక యొక్క ఉత్పత్తి, స్థితి, నాశనములగూర్చి సంశయము తెరవలె అవరోధముగా నున్నది

యిన్నాళ్ళగొలెన్ = ఇప్పుడు మిమ్మల్ని ఆశ్రయించుటచే

కరుణారసేక్షణముల = అత్యంత అనుగ్రహ పూర్వకమైన దృష్టిచే (బోధచే)

తెరదీసితిరి = సందేహమును నివారించితిరి

ఎరుక మాట తీరెనిక్కడికీ = ఇంతటితో ఎరుకను గూర్చిన సందేహము లన్నియు తీరినవి

చాలు బోధ = సర్వసందేహములు నివారింపబడి తృప్తి కలిగి ఇకబోధతో పనిలేదు

పరిపూర్ణమును, లేని ఎరుకను చూపించి = వస్తునిశ్చయ పూర్వకముగా ఎరుక, పరిపూర్ణములను నిర్ధారణ గావించి

ఎరుక లేదని యంత్రి = రెండింటిని గుర్తించిన మీదట గుర్తుకు మూలముగాని, స్థానముగాని లేదని దృఢపరచితిరి

ఎరుక లేదాయెను = మూలములేని గుర్తెరిగే శరీరమేమీ లేదని దృఢపడినది

## తాత్పర్యము

ఓ గురుస్వామీ! పరిపూర్ణమెరిగి, ఎరుకనెరిగి, ఎరుకను మాను అను సిద్ధాంతవాక్యమును దృఢపరచుటలో లేనెరుకను గూర్చి సందేహము మన ఇరువురి మధ్యన ఒకతెరవలె అవరోధముగా నున్నది. అనగా ఎరుక ఉత్పత్తి, స్థితి, నాశనములందు సందేహమేర్పడుచున్నది. అత్యంత భక్తి శ్రద్ధలతో మిమ్ములనాశ్రయించి, మీరునిర్ధేశించిన విధముగా జీవించుటలో మీ అనుగ్రహమునకు పాత్రుడనై ఎరుక యొక్కఉత్పత్తి, స్థితి, నాశనముల యెడల నాకున్న సందేహములను మీ బోధాగ్నిచే పోగొట్టి సందేహ విముక్తి గావించితిరి. ఇక బోధించుటకు, గ్రహించుటకు గుర్తులేని పరిపూర్ణమే స్వతఃసిద్ధమై యున్నదని నాకు గట్టిగా దృఢపడినది. ఏలననగా వస్తునిశ్చయ పూర్వకమైన ప్రబోధచే, అచల పరిపూర్ణము ఎట్లు స్వతఃసిద్ధమై యున్నది, దానియందు గుర్తుకు మూలము గాని, స్థానముగాని ఎట్లులేదో స్పష్టముగా దృఢపరచియున్నారు. ఇట్టి ఆరూఢతచే ఎరుక లేనిదని స్పష్టమైనది. ఎట్టి భ్రమ, ప్రమలకు తావులేకుండా దృఢపడినది అని తెలియ వలెను.

**కం॥ ధారుణికొంత జరించివి। చారించితి గాని యీా విచార మునేనె।**
**వ్వారలు జెప్పగవినలే దాఅరయ మీనోటవిన్నా। నయ్యా**
**గురుమూర్తి। నా తరమానుతి। జెయ్యామీ కీర్తి। సారాసన యనపురారి**
**నీరజబ్భం। దారకముఖులైన నేరారు మిము దెలియ నయ్యా**
**గురుమూర్తి। నాతరమా నుతి। జెయ్యా మీకీర్తి॥ 264**

## ప్రతిపదార్థము

అయ్యా గురుమూర్తీ = ఓ సద్గురుస్వామీ
ధారుణి = ఈ భూమండలమునందు
కొంత చరించి = చాలాప్రాంతములు తిరిగి తిరిగి
విచారించితి గాని = జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు మార్గమును గూర్చి పరిశీలించగా
ఈ విచారము = ఈ పరిపూర్ణ భావమును

నేను = జిజ్ఞాస తోకూడిన నేను
ఎవ్వారలు చెప్పగ వినలేదు=ఇతరులు చర్చించు కొనుచుండగా నేను వినలేదు
అరయ = స్పష్టముగా
మీనోటే విన్నాను = మీ ద్వారానే ఈ భావమును వినగలుగు చున్నాను
నాతరమా నుతి చెయ్యమీ కీర్తి = మీ గొప్పతనము, విశిష్టత, సామర్థ్యముప్రశంసించుట నాకు శక్యముకాదు
సారసనయన = విశాలమైన పద్మముల వంటి నేత్రములు కలవాడు(విష్ణువు)
పురారి = త్రిపురాంతకుడైన పరమేశ్వరుడు
నీరజ = బ్రహ్మదేవుడు
బృందారాకముఖులైన = దేవేంద్రాది దేవతలు
నేరారు మిముదెలియ = మిమ్ములను సుత్తించుటకు వారికే శక్యముకాదు

## తాత్పర్యము

సద్గురుమూర్తీ! జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు సరియైన మార్గము ఏది అని అన్వేషించుటలో ఈ భూమండలములో చాలా ప్రదేశములు తిరుగాడుచు చాలా మందిని విచారించితినిగాని ఏ ఒక్కరి వల్లను కూడా ఈ పరిపూర్ణ భావము నేను వినియుండలేదు. ఇప్పుడు తమ నోటిద్వారా మాత్రమే ఇట్టి భ్రాంతి రహిత మార్గమును వినగలిగితిని. అట్టి విశేషప్రజ్ఞా పాటవములు కలిగిన అరుదైన అపూర్వమైన భావమును ప్రబోధించు మిమ్ములను స్తుతించుటకు హరి హర బ్రహ్మాది దేవతలకు కూడా సాధ్యము కాదు. అట్టిది సామాన్యుడనైన నావంటి వానికి అసలే సాధ్యము కాదు అని తెలియవలెను.

కం॥ ఘటమెదుటబెట్టి చూపిన। యెటువలెబయలుండ జూపి యతిమాయ
లచే। నటి యింపుచున్న యెరుకను। తృటిలో విడిపిస్తి రిపుడు।
దీరెమచ్ఛంకా। యికబుట్టాదు। యేరీతిశంకా యెటుదోచకిలువెళ్ళి
యిటమిమ్ముజూచిన। ప్పటినుంచిదయ జేసిప్పటిదాకా బోధిస్తే।
తీరెమచ్ఛంకా। యికబుట్టాదు యేరీతిశంకా॥ 265

## ప్రతిపదార్థము

ఘట మెదుట పెట్టి చూపినట్టు వలె = కుండను గూర్చి తయారుచేయు విధానమంతయు వివరించుటలో తయారుకాబడిన కుండను ప్రత్యక్షముగా చూపించి దానిని గూర్చి సమగ్రమైన జ్ఞానము కలిగించిన విధంగా

బయలుండ జూపి = స్వతఃస్సిద్ధమైయున్న పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి వస్తునిశ్చయ పూర్వకముగా దృఢపరచి

అతి మాయలచే నటియింపుచున్న ఎరుకను = జన్మకర్మలకు, భ్రాంతులకు అత్యంత మూలకారణమై యున్న గుర్తెరిగే తెలివిని

తృటిలో = ఒక్క క్షణములో

విడిపిస్తిరి = లేనిదని దృఢపరచిరి

ఇపుడు తీరె మచ్చంక = ఇపుడు నాకు సర్వసందేహములు తీరినవి.

ఇక పుట్టదు ఏరీతి శంక=భవిష్యత్తులో ఇక ఏలాంటి సందేహము కలుగ జాలదు

ఎటు తోచక = జనన మరణ సంసార రహితమునకు మార్గమును తెలిసికొనుటకు దారిని అన్వేషించుటలో

యిలు వెళ్ళి = నా ఇంటి నుండి బయలుదేరి

యిట మిమ్ము చూచినప్పటి నుంచి = మీదివ్య దర్శన భాగ్యము కలిగేంతవరకు

దయచేసి = అత్యంత అనుగ్రహపూర్వకముగా

యిప్పటి దాకా బోధిస్తె = ఈ స్థితి దాకా పరిపూర్ణ భావమును ప్రబోదించిన మీదట

## తాత్పర్యము

మట్టితో తయారు చేయ బడిన కుండను గూర్చి వస్తునిశ్చయ జ్ఞానము కలిగించుటకు తయారుకాబడిన కుండనే ప్రత్యక్షముగా చూపించి దృఢపరచిన విధముగా జన్మకర్మలను రద్దుపరచు విధానమును ప్రబోధించుటలో సర్వలక్షణ విలక్షణమైన పరిపూర్ణమును గూర్చి ఉపదేశిస్తూ, అందుకు ముందుగా జన్మకర్మలకు భ్రాంతులకు అత్యంత మూలకారణమై

యున్నఅఖండ ఎరుకను స్థాన, స్వరూప, స్వభావముచే వస్తునిశ్చయ పూర్వకముగా దృఢపరచి, అట్టి స్థితియందు దీనికి వేరైవున్న అచలపరిపూర్ణమును వుండజూపి, అట్టి దృఢనిశ్చయ విధానమందు ఉన్నదానియందు గుర్తించడానికి మూలము గాని, స్థానముగాని లేదని దృఢపరచిరి. ఇప్పుడునా సర్వసందేహములు తీరినవి. భవిష్యత్తులో ఎట్టి సందేహములు కలుగ బోవు. జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు మార్గము అన్వేషించుట పట్ల నాఇల్లు విడిచి మార్గమును వెతుకుతూరాగా నాపూర్వ పుణ్య ఫలముచే మీ దర్శనభాగ్యము కలిగి ఈపరిపూర్ణ భావము అనేక యుక్తి ప్రయుక్తులతో వస్తునిశ్చయపూర్వకముగా అత్యంత అనుగ్రహముతో తమరు బోధించుటచేత సర్వసందేహములు తీరి పరిపూర్ణ భావమునందు స్పష్టమైన ఆరూఢత కలిగినది. జన్మ సాఫల్యమును పొందినాననేతృప్తి కలిగినది అని భావము.

## గురుశిష్యోభయ నిర్ణయము

పరిపూర్ణ భావము సాంప్రదాయబద్ధమై, గురుశిష్యన్యాయమై ప్రకాశించుచున్నది. ఆచరించి అనుభవములోనికి తెచ్చుకొనుట ఎట్లు అను మీమాంశలో శిష్యునికి గురువు ఆచార్యుడై మార్గ దర్శకుడై యుండ వలెను గురునిర్ణయ విధానమునందు ఎట్టి సందేహమునకు లోను కాక యధావిధిగా తన అంత:కరణ వృత్తిని పరిపక్వముగావించుకొనులక్షణము గలవాడిగా శిష్యుడుండవలెను. బ్రహ్మ విద్యయందు శిక్షణచాలా అవసరమై యున్నది. అట్టి శిక్షణకు సంసిద్ధుడై నున్నవానిని శిష్యశబ్ధముతో చెప్పవచ్చును. పరిపూర్ణభావము ఉభయతారకము. శిష్యునికి గురువు అవసరమైనట్లే, గురునికి శిష్యుడు కూడా అవసరమై యున్నది. అత్యంత భక్తిశ్రద్ధలతో శిష్యుడు, అత్యంత భాధ్యతా యుతముగా గురువు ఉన్నప్పుడే ఈ ధర్మము ప్రకటము కాగలదు. వీరినే వరగురు శిష్యులుగా అన్యత్రా చెప్పబడి ఉన్నది. ఎవరి విద్యుక్త ధర్మమును వారు సక్రమంగా పోషించగలిగినపుడే ఈ ధర్మ స్వరూప స్వభావములు వారికి అనుభవనీయము కాగలదు. ఉ

భయులు ప్రాపంచీక పారమార్థిక విషయములందు ఏఏ లక్షణములు కలిగుండవలెనో ఏఏ లక్షణములు కూడనివో ఈ శీర్షిక ద్వారా చెప్పబడుచున్నది.

**కం॥ హృదయగ్రంధివిడుటకై। సదయత యీ బోధదెల్ప జనదా గురుడై**
**వదలక చిత్తములో గురు। పదయుగళము దలుప వలదే।**
**భక్తుడైనపుడూ। భ్రాంతిరహితా సక్తుడైనపుడూ। కుదు రాదుయివి**
**రెండు గురుశిష్యులకూ లేక। కదిలికెలేనట్టి ఘన బోధ క్తస్థితి।**
**భక్తుడై నపుడూ। భ్రాంతిరహితా। సక్తుడైనపుడూ॥ 266**

## ప్రతిపదార్థము

హృదయ గ్రంధి = హృత్ + అయ +గ్రంధి లోపల పెనవేసుకుని ముడిపడిన వస్తువు = గుర్తెరిగే శరీరము
విడుటకై = విడిచిపెట్ట బడుటకు
సదయత = ఎల్ల వేళలా
ఈ బోధ = ఈ పరిపూర్ణభావము
దెల్ప = ఉపదేశించ
జనదా గురుడై = గురువైనవాడు సంసిద్ధుడు కావలసి వుండును
వదలక = విడిచిపెట్టక, అనన్యమైన భక్తితో
చిత్తములో = తన అత:కరణమందు
గురుపద యుగళము = తనకుపద్రష్ట అయిన గురుమూర్తి దివ్యశ్రీ చరణములు (నిర్గుణ గురుస్వరూపము యొక్క వస్తునిశ్చయ జ్ఞానము)
తలప వలదె = నిరంతరము ధ్యానించుచుండవలెను
భక్తుడైనపుడు = త్రికరణ శుద్ధితో కూడిన ప్రవర్తన కలవాడై వున్నపుడు
భ్రాంతి రహితా సక్తుడైనపుడు = జనన మరణ భ్రాంతి రహిత విధానమె లక్ష్యముగా గలవాడు
కుదరదు ఇవి రెండు గురుశిష్యులకు లేక = పరిపూర్ణ భావమందు పైన పేర్కొన్న లక్షణములు ఇరువురికీ లేక పోయినచో ఆరూఢత సాధ్యము కాదు
కదలికే లేనట్టి ఘన బోధోక్తస్థితి = ఎట్టి పరిణామములకు లోనుకాకుండా వున్న పరిపూర్ణస్థితి

# తాత్పర్యము

తన్నాశ్రయించిన శిష్యునికి జన్మ కర్మలు ఎట్లు కలుగుచున్నవి? అందులకు కారణము, ఆధారం, మూలం, మున్నగు అంశములు మాటలకే పరిమితం కాక వస్తునిశ్చయముగా ప్రబోధించి సర్వమునకు కారణమైయున్న గుర్తెరిగే శరీరమందే దృష్టిని, ఆరూఢతను పెంపొందించి, దాని పట్టునుండి శాశ్వతముగా తప్పించి జననమరణ భ్రాంతిరహిత విధానము, దృఢపరచగల లక్షణము కలవాడు శ్రేష్టమైన గురునిగా చెప్పబడుచున్నాడు. అయితే అట్టి గురుని ఆశ్రయించి ఆయన ఉపదేశ క్రమము పాటిస్తూ అనన్య చింతనతో గురుమూర్తి యొక్క పాదములను సగుణ, నిర్గుణ రూపంలో వస్తునిశ్చయ పూర్వకంగా గుర్తించి నిరంతర ధ్యాననిమగ్నుడై త్రికరణ శుద్ధితో కూడిన భక్తి తత్పరుడై గురువాక్యం యథాతథంగా జీవించగలిగే లక్షణం కలవాడై శిష్యుడు ప్రవర్తించగలిగినపుడు బోధయందు ఆరూఢస్థితి సిద్ధించగలదు. ఎవరి ఆదర్శములు వారుపాటిస్తూ, వారివారి కర్తవ్యములు నిర్వహించుచూ ఆదర్శవంతులై వున్నపుడే అత్యంత దుర్లభమైన పరిపూర్ణ భావమునందు స్థితి కుదురుట. జన్మసాఫల్యము చెందుట సాధ్యమగును. ఇందు హృదయ గ్రంధి అను శబ్దము అత్యంత విశిష్టమై గురుగోప్యమై గురుముఖత: మాత్రమే వస్తునిశ్చయ పూర్వకముగా తెలియు వలసి యున్నది. అట్లే గురుపదయుగళము అను శబ్దమును కూడా తెలియ వలసి ఉన్నది.

కం॥ గురుడాసవదలకుండిన। మరి శిష్యుడు ద్రవ్యలో భమగ్నుం
డైనన్। మరియాద దక్క దిరవుర। కెరిగుండుము వీరలతి
విహీను లోయన్నా। గట్టిగ దురభి। మానులో యన్నా। గురుడు
శిష్యుని కన్న కొడుకూగ గనకున్న। గురునీ పై శిష్యుడా
గురినిల్పు కుండీన। హీనులోయన్నా। గట్టిగదురభి। మానులో
యన్నా॥ 267

## ప్రతిపదార్థము

గురుడాశవదలకుండిన = గురుడు ద్రవ్యమును గూర్చి శిష్యుని నుండి ఎట్టి కోరిక కలిగి వుండకూడదు
మరి శిష్యుడు = తరువాత శిష్యుడు
ద్రవ్యలోభమగ్నుండైనన్ = ధనము నందు లోభితనము కలిగున్నవాడైతే
మర్యాద దక్కదిరువురికి = ఇరువురికి ఎట్టి విలువలు గౌరవము లేకపోవును.
ఎరిగుండుము = ఈ విషయము స్పష్టముగా గమనించుము
వీరలు = ఇట్టి గురుశిష్యులిరువురు
అతి విహీనులోయన్నా = చాలా హీనమైన వారు
గట్టిగ దురభిమానులోయన్నా = చాలా చెడు వర్తన కలవారని తెలిసుండుము
గురుడు శిష్యుని కన్న కొడుకూగ గనకున్న = గురుమూర్తి తన శిష్యులను తానుకన్న సంతానవంతులుగా భావించవలెను
గురునిపై శిష్యుడాగురి నిల్పకుండీన = శిష్యులు తన గురుమూర్తిని తమకు తండ్రిగా భావించవలెను.

## తాత్పర్యము

పరిపూర్ణ బోధయందు ఆదర్శవంతులైన గురుశిష్యులకు మధ్య ఆర్థిక పరమైన ఎట్టి లావా దేవీలు ప్రతిఫలాపేక్షలు అనగా గురునికి ఆశతనము శిష్యునికి పిసినారితనమూ ఉండకూడదు. ప్రాపంచీకముగా ఇట్టి వ్యామోహము కలవారు గురుశిష్యుల ఆదర్శములకు అమర్యాదకరముగా ఉండునని, దానివలన ధర్మము అవహేళన కాగలదని గుర్తించి, అట్టి దుంభిమానమును, స్వార్థపరత్వమును, ఆశా వ్యామోహములను విడిచి ఆదర్శప్రాయులై మెలగ వలెను. తన శిష్యులను గురువు తన సంతానముగా భావించి, వారి ప్రయోజకత్వమునకు పాటు పడవలెను. అట్లే శిష్యులు తమ గురుమూర్తిని తండ్రిగా భావించి, ప్రేమతో భయ భక్తులు కలిగి ఉండవలెను. ఇట్టి వీరి ప్రవర్తన ఇతరులకు ఆదర్శ ప్రాయముగా నుండవలెను.

**కం॥ పతియైనను సతియైనను। నతిసాహసపరులుగాక యాంతర్యమునన్**
**రతివేళ్ళలజ్జపడసం। తతి గలుగదు చూడు మట్ల। తగదు లజ్జించా।**
**గురుశిష్యాలు। తగులజ్జనొంచా। మతిని నీవిట్లు సమ్మతి**
**జేసియేయే। సంగతినన్నడుగుముబోధ। స్థితి నీకు దృఢపరతు।**
**తగదూలజ్జించా। గురుశిష్యాలు। తగులజ్జనొంచా॥ 268**

## ప్రతిపదార్థము

పతియైనా సతియైనా = భార్యా భర్త లిరువురిలో ఏఒకరైనా
అతిసాహసపరులు గాక ఆంతర్యమునన్ = అత్యంత ఉత్సాహముతో, మనసులో ఎట్టి సంకోచములేకుండా
రతివేళ = సంసార జీవన విధానంలో
లజ్జ పడ = అభిమానపడినచో
సంతతికలుగదు = వంశాభివృద్ధికి కావలసిన సంతానము కలుగజాలదు
చూడు మట్ల = ఆవిధముగా నీవు ఇందలి రహస్యమును గమనించుము
తగదు లజ్జించ=బోధ ఆరూఢవిధానమునకు ఎట్టి సందేహమునకును తావీయకుము.
గురుశిష్యులు తగు లజ్జ నొంచా = పరిపూర్ణ బోధను ఉపదేశించుటకు గురువు. గ్రహించుటకు శిష్యుడు ఎట్టి అభిమానమునకు లోను కాకూడదు
మతిని నీవిట్లు సమ్మతి జేసి=నీబుద్ధి చే ఈవిషయమును చక్కగా విచారించి
ఏఏ సంగతి నన్నడుగుము = బోధయందు ఎట్టి అంశములు సందేహముగా నున్నను వాటిని నిర్భయముగా నా దగ్గరుంచుము
బోధస్థితి నీకు దృఢపరతు = పరిపూర్ణ బోధయందు స్పష్టమైన అవగాహనతో నీకు గట్టి ఆరూఢత కలిగించగలను

## తాత్పర్యము

సంతానా పేక్షకై వివాహజీవితమందు భార్యా భర్తలు సంసార జీవితములో ఎట్టి అభిమానమునకు, సందేహమునకు లోను కాక, ఒకరి కొకరు ప్రేరణ కలిగించుకొన్నమీదటనే సంతాన వంతులు కాగలరు. అదే

పద్ధతిగా పరిపూర్ణబోధను ఆరూఢపరచుకొని జన్మ కర్మల రహితమునకు కృషిచేయు లక్షణములు కలిగిన గురుశిష్యులిరువురు ఒకరిపై ఒకరికి ఎట్టి సందేహము లేక ఒకరి కొకరు ప్రేరణ కలిగించుకొని, బోధనా క్రమమును దృఢపరచుకొనవలసి యున్నది. కనుక ఈ అంశమును చక్కగా నీ బుద్ధితో విచారించి బోధగ్రహించుటలో నీకు కలుగుచున్నసందేహములు తెలుసుకొనవలసియున్నచో అవి నిర్భయముగా వ్యక్తపరచి గురువుద్వారా నివారించుకొనవలసియున్నది. వస్తునిశ్చయ జ్ఞాన పద్ధతిచే బోధ దృఢపరచి సర్వ సందేహములు గురుమూర్తి నివారించి ఆరూఢత చెందించగలడు.

**కం॥ అడివివుసిరికయు జలనిధి। బొడమినలవణం బటంచు**
**బొగడినరీతిన్ పుడమిని యీ స్థలమందున। కడువేడుక నీవు**
**నేను గలసూటవినరా। నీనా ప్రేమ। గలసెకన్గొనరా। విడలేవునీవు**
**నన్ను విడలేనునేనిన్ను । పొడజూచినీవునేనెక్కడ బోక।**
**నిలిచిట్లు గలసూటవినరా। నీనాప్రేమ గలసెకన్గొనరా॥ 269**

## ప్రతిపదార్థము

అడవి వుసిరికయు = అడవిలో కాసిన వుసిరి కాయ

జలనిధి పొడమిన లవణంబు=సముద్రము నందు ఉత్పత్తి అవుతున్న ఉప్పు

బొగడిన రీతిన్ = ఒకచోట చేరి ఎట్లు రుచి కలిగించునో

ఆరీతిన్ = ఆ విధముగా

పుడమిని = ఈ భూమియందు

ఈ స్థలమందున = ఈ సందర్భములో

కడువేడుక = చాలా ఆశ్చర్యకరమైన పద్ధతిలో

నీవు నేను కలసుట వినరా=మన ఇరువురము గురుశిష్యులుగా కలిసి కొనుట

నీనా ప్రేమ కలసె = నీ యందు నాకు నాయందు నీకు అనుగ్రహ భక్తి విశేషములు కలిగినవి.

కనుగొనరా = స్పష్టముగా విచారించి చూడుము

విడలేవు నీవు నన్ను, విడలేను నే నిన్ను = ఒకరి నొకరు విడచి వుండలేము

పొడ జూచి = ఈ రహస్యమును చక్కగా గుర్తించి
నీవు ఎక్కడికీ పోక = ఈ స్థానమును విడిచి పెట్టక
నిలు = నిలచి వుండుము

## తాత్పర్యము

అడవిలో చెట్టున కాసిన ఉసిరికాయ, సముద్రమందేర్పడిన ఉప్పు వేరు వేరుగా వునికి కలిగి ఒకానొక సందర్భములో ఒక చోట కలసి ఎట్లు రుచిపుట్టించునో ఆ విధంగానే ఈ ప్రపంచంలో నీవు, నేను ప్రారబ్ధ వశమున ఏతల్లి తండ్రుల గర్భ వాసంలో మానవోపాదికి వచ్చి, పూర్వపుణ్యవిశేషముచే ఈ సాంప్రదాయమందు ప్రవేశించి, గురుశిష్యులుగా మారి, ఒకరియందొకరికి ప్రేమాభిమానములు ఏర్పడి ఇవి విడదీయ రానివై, ఆదర్శ వంతమై వున్నవి. ఇప్పటి స్థితియందు నీవు నన్ను, నేను నిన్ను విడచియుండుట సాధ్యము కాని పని. కావున ఒకరి నొకరు ఈ భావము నుండి వేరుకాక ఆదర్శవంతమై జీవించెదము గాక.

**కం॥ కూడిగురుశిష్యులిద్దరు। వేడుకతో బయలువున్న విధ
మెరిగెరుకన్ వీడిరిది లేనిదని। మాటాడుట కికయేమిదోచ।
దదియేమోకానీ। వింటిరెమీరలిది। యిందులోని। జాడమీకెరు
కాని వేడి తివినుమంచు। యీడీకి సరిము। చ్చటాడూటకిక
దోచ। దదియే మొకానీ। వింటిరెమీర। లిదియిందులోనీ॥ 270**

## ప్రతిపదార్థము

కూడి = కలిసి
గురుశిష్యులిద్దరు = గురువు, శిష్యుడు
వేడుకతో = సంతోషంతో
బయలున్న విధమెరిగి = స్వతఃసిద్ధమై యున్న పరిపూర్ణ పరబ్రహ్మమును ఉండజూచుకొని
ఎరుకన్ వీడిరిది లేనిదని=పరిపూర్ణ మందు గుర్తెరిగే తెలివికి మూలముగాని,

స్థానముగాని లేదని దృఢపరచుకొని గుర్తును విడచిరి
మాటాడుట కిక యేమీ తోచదు = వున్నదానిని నిర్ణయించుటకు గాని, లేనిదానిని నిర్ణయించుటకు గాని గుర్తులేదు
అది ఏమొ గాని = ఇది ఏమి రహస్యమొ కదా
వింటిరే మీరలు=మీరు ఈ అంశములను శ్రద్ధగా గమనించి దృఢపరచుకొన్నారా
యిందులోని జాడ = ఈ గ్రంథ మందలి రహస్యము
మీ కెరుకాని = మీకు తెలిసినదని
వేడితి వినుమంచు = ఈగ్రంథమును మొదటినుండి చివరిదాకా వినమని మిమ్ము కొరితిని
ఈడికి = ఇప్పటికి
సరిముచ్చటలాడుటకు = ఇరువురము బోధను గూర్చి చర్చించుటకు
ఇంకేమీ తోచదు = ఇంకేమీ మిగలలేదు

## తాత్పర్యము

గురుశిష్యులిరువురూ బోధ దృఢీ కరణకొరకు ఒకచోట చేరి, ఒకే లక్ష్యముతో భక్తి శ్రద్ధలతో పరిపూర్ణ భావమును, అందలి మౌలికాంశములైన స్వతఃసిద్ధమైన పరిపూర్ణమును గూర్చి అందు మూలము గాని, స్థానము గాని లేని ఎరుకను గూర్చి స్పష్టముగా విచారణ చేసి ఆ రెండింటిని గుర్తించిన గుర్తును లేనిదని విడిచి యుండిరి. ఇక వినుటకు, చెప్పుటకు ఏ అంశము ఏమీ తోచుటలేదు. ఈ రహస్యము ఈ గ్రంథమును విచారించుట ద్వారా మీరు స్పష్టముగా గ్రహించియే వుందురు. అందులకే ఈ గ్రంథమును శ్రద్ధగా పరిశీలింపుడని మిమ్ము కోరడమైనది. ఇక చెప్పుటకు, వినుటకు ఎట్టి అంశము మిగిలి యుండదు అని దృఢపరచుకొన వలసియున్నది.

## కపట శిష్య నిర్ణయము

సృష్టి అంతయు గుణదోషములతో కూడి యున్నది. అందుండి ఏర్పడిన మానవోపాధి యందు కూడా ఈ గుణ దోషములు కలిగి ఉ

ండును. గురుశిష్యన్యాయములో కూడా విద్యాభ్యాసము కొరకు గురువులను, గురుకులములను ఆశ్రయించిన శిష్యులు ఆదర్శప్రాయులై జీవించిన విధానము చరిత్రయందు స్పష్టముగా చెప్పబడి యున్నది. ఆదర్శములను నిర్వీర్యముచేసి, గురుశిష్య ధర్మములను అవహేళన చేసి, నిందాపూర్వకమైన జీవితమును గడిపి, గురుధర్మమును భ్రష్టు పట్టించిన సందర్భములు కూడా చరిత్రయందు చోటు చేసుకున్నవి. అట్లే పరిపూర్ణ బోధయందు గురువు నాశ్రయించిన శిష్యునికి కూడా ఇట్టి దుర్లక్షణములు కలిగి యుండునని అట్టి వారి మానసిక ప్రవృత్తి ఏవిధముగా వుండునో ఈశీర్షిక ద్వారా చెప్పబడుచున్నది.

**కం॥ పరిపూర్ణ బోధదెల్పే। పరియంతము సేవజేసి బహు నమ్మికగా।**
**గురుమూర్తికి తరువాతను। మరికన్నులగనని వాని**
**మార్గాముఛీఛీ। తలచరాదామాటఛీఛీఛీ। గురువాజ్ఞాయివ్వ నీదె**
**గురువై శిష్యుని గూర్చి గురుబోధదెల్పేటి గురువంచకుని**
**యొక్క। మార్గము ఛీఛీ। తలచరాదామాటఛీఛీఛీ॥ 271**

## ప్రతిపదార్థము

పరిపూర్ణ బోధ తెల్పే పర్యంతము = పరిపూర్ణ బోధయందలి రహస్యమైన విషయములు గ్రహించునంత వరకు

సేవ చేసి బహు నమ్మికగా = అత్యంత భక్తి శ్రద్ధలతో గురుమూర్తిని ఆశ్రయించి, ఉపచారములు చేసి

తరువాతను = విన్నమీదట

గురుమూర్తిని = తనకు బోధించిన గురుమూర్తిని

మరికన్నుల గనని వాని = తిరిగి చూడని వానిని

మార్గము = విధానము

ఛీఛీ తలచరాదామాట ఛీఛీ = ఈ అంశము చెప్పు కొనుటకే సిగ్గు చేటుగా నుండును

గురు వాజ్ఞ యివ్వనిదే గురువై = బోధయందు తన ఆరూఢతను గమనించి అనుగ్రహ పూర్వకముగా గురుత్వమును గురువు ఇవ్వనిదే

శిష్యుల గూర్చి = శిష్యులను చేరదీసి
గురుబోధ తెల్పేటి గురువంచకుని యొక్క మార్గము = అస్పష్టముగా తానుతెలుసుకొన్న క్రమము సాంప్రదాయము పేరిట ప్రచారము చేయుట గురుద్రోహమగును అతని మార్గము

## తాత్పర్యము

పరిపూర్ణ బోధయందు నిర్దేశించ బడిన బోధనా విధానము క్రమ పద్ధతిలో అధ్యయనము చేసి దృఢపరచుకొనే దాకా గురుమూర్తికి అత్యంత నమ్మకముతో, భక్తి విశ్వాసములు కలిగి బోధను విని ఆతరువాత ఆసద్గురు మూర్తిని దర్శించి, పూజించి అర్చించని వాని మార్గము సరియైనది కాదు. అట్టి వాని మాటలు విన దగినవి కావు. తన వద్దనేర్చుకున్న బోధక్రమము ఏపాటి శిష్యునికి దృఢమైనదో పరీక్షించి యోగ్యత, పాత్రత కలిగివున్నవాడు అని నమ్మకము కలిగిన మీదట గురుత్వము, అధికారము పొందవలసి వున్నది. అట్లుకాక స్వతంత్రుడై శిష్యసేకరణ చేసి తాను గ్రహించిన మిడి మిడి జ్ఞానమును సాంప్రదాయము పేర ప్రచారం చేస్తూ గురుద్రోహమునకు పాల్పడిన వాని నడతలు, బోధలు హర్షింప తగినవి కావు అని తెలియ వలెను.

కం॥ తనశిష్యులువిని తననతి। వినయంబునగొల్చు కొరకు। వినుతి
యొనర్చున్। తనగురువును గురుడింటికి। జనుదెంచిన జూచి
శుశ్రూషనొనర్చకుండూ। లేమిని దెల్పి। చనుమానుచుండూ
వినుము కుచ్చితశిష్యాగ్రణివీడు వీడెట్లు ఘనబోధకస్థితి
కనుగొను గురునకు। శుశ్రూషనొనర్చకుండూ। లేమినిదెల్పి। చను
మాను చుండూ॥ 272

## ప్రతిపదార్థము

తన శిష్యులు = తన్నాశ్రయించుకొన్న శిష్యులు
విని = తాను చెప్పినదంతావిని

తన నతి వినయమున కొల్చు కొరకు = తనయందు అత్యంత భక్తిశ్రద్ధలు కలిగి పూజించుట కొరకు

వినుతి యొనర్చున్ తనగురువును = తనగురుమూర్తిని గురించి, తన భక్తి శ్రద్ధల గూర్చి ఎక్కువగాచెప్పుచుండును

గురుడింటికి జనుదెంచిన = తనకుపదేశం చేసిన గురుమూర్తి తన ఇంటికి వచ్చినప్పుడు

చూచి = ఎదురేగి

శుశ్రూష ఒనర్పకుండు = ఎట్టి పూజా విధానమును చేయకుండును (ఎట్టి భక్తి భావమును వ్యక్తపరచ కుండును)

లేమిని తెల్పి = తన కష్ట నష్టములన్నీ వారి ముందుంచి

చను మాను చుండు = తిరిగి పంపి వేయును

వినుము = వీరిని గూర్చి స్పష్టముగా గుర్తించుము

కుచ్చిత శిష్యాగ్రణి వీడు = అత్యంత దుర్మార్గమైన లక్షణము కలవాడు

వీడెట్లు ఘనబోధోక్త స్థితి కనుగొను = ఇట్టి లక్షణము గల వీనికి గొప్పదైన పరిపూర్ణభావమందు ఆరూఢత ఎట్లు కలుగును?

## తాత్పర్యము

తన్నాశ్రయించిన శిష్యులు తనయందు అత్యంత భక్తి ప్రపత్తులు కలిగి వుండవలెనని ఆలోచనతో, తను శిష్యునిగా వున్నకాలములో తన గురుమూర్తిని, తాను సేవించిన విధానము భక్తి శ్రద్ధలను ఎంతో హెచ్చుగా తన శిష్యుల ముందుంచును. అట్టి సందర్భములో స్వయముగా శిష్యుని జీవన విధానము ఎట్లున్నదోనని పరిశీలించుటకు స్వయముగా గురుమూర్తి తన ఇంటికి వచ్చినపుడు ఎట్టి పూజా పునస్కారములు చేయక, తన కష్ట నష్టము లన్నియును గురునకు నివేదించి, ఆర్థికముగా ఏదైనా సమర్పించుదామన్నా తాను ఎన్నో ఇబ్బందులలో నున్నానని, తన దారిద్ర్యమును వ్యక్తపరచి, అతనిని పంపివేయుటకు ప్రయత్నించును. ఇటువంటి వాడు దుర్మార్గ శిష్యులలో మొదటి వాడుగా గుర్తించుము.

గొప్పదైన పరిపూర్ణ బోధయందు ఎటి పరిస్థితుల లోను వీడు ఆరూఢత చెందజాలడు.

**కం॥ కుటిలాత్ముడైన శిష్యుడు। యిటువలె తాబలుకు చుండు యింటికి వస్తే। యెటు బోవుచుండివస్తిరొ యిటకిక దర్శనము మళ్ళీ। యెప్పుడయ్యేనో యెవరికి తెలుసు। యెప్పుడే మౌనో। యెటుదోచదేమైన యిత్తామంచనుకుంటె। తుటుకూన వకరాగి దుడ్డైనలేదివ్పు। డెవ్పుడయ్యేనో యెవరికి దెలును। నెప్పుడేమౌనో॥ 273**

## ప్రతిపదార్థము

కుటిలాత్ముడైన శిష్యుడు = కపట లక్షణము కలిగిన శిష్యుడు

ఇటి వలె తా బలుకుచుండు = పైనపేర్కొన్న విధంగానే మాట్లాడు చుండును

యింటికి వస్తె=తనకు మంత్రోపదేశం చేసిన గురుమూర్తి తన ఇంటికి వచ్చినపుడు

యెటుబోవుచుండి వస్తిరొ = ఎటు ప్రయాణ లక్ష్యము కలిగించుకొని ఈ దారిన వస్తున్నారో

ఇటకు = మా ఇంటికి

ఇక దర్శనము మళ్ళీ ఎప్పుడయ్యేనో = మళ్ళీ మీదర్శన భాగ్యం మా కెప్పుడు కల్గుతుందో

ఎప్పుడే మయ్యేనో ఎవరికి తెలుసు = ఎప్పుడు ఏది ఎలా జరుగుతుందో ఎవరికి తెలుసు?

యెటు తోచదు = పరిస్థితులు నాకేమీ అర్థంకావడంలేదు

ఏమైనా ఇద్దామంచనుకుంటె = గురుదక్షణగా మీకేమైనా సమర్పించుకుందామనుకుంటె

తుటుకూన = నాచేతిలో

వక రాగి దుడ్డైనా లేదిప్పుడు = ఒక చిల్లి గవ్వ కూడా నాదగ్గర లేదిప్పుడు

## తాత్పర్యము

కపట బుద్ధితో కూడిన శిష్యుడు తనను జూచుటకు వచ్చిన గురుమూర్తిని మాటలతో సంతృప్తి చెందించి ఎక్కడ నుండి ఎక్కడకి వెళుతూ బయల్దేరి మాఇంటికి వచ్చారో, మళ్ళీ మీదర్శన భాగ్యం మాకెప్పుడు కలుగు తుందో, కాలగర్భంలో ఎప్పుడు,ఎలా, ఎవరికి ఏమి జరుగుతుందో తెలియదు కదా! గురుదక్షణగా మీకేమైనా నేను సమర్పించుకుందామనుకుంటె నా చేతిలో చిల్లి గవ్వ కూడా ఇపుడు లేదు అని వచ్చిన దారినే గురుమూర్తిని సాగనంప ప్రయత్నించును.

**కం॥ జపములు తపములుసలుపును। విపరీతస్మరణజేయు వేదాంతర్థం। బరిమితంబుగజెప్పును। కపటాత్ముడు శిష్యకోటి। గనిమెచ్చుకొరకూ। మెచ్చిద్రవ్య। మునుయిచ్చు కొరకూ। అపకీర్తిచేతాల కదరినట్లగుపడి। ఉపమూచె బ్రతుకూచు నుండు లోకులుతనను। గనిమెచ్చుకొరకూ। మెచ్చిద్రవ్య। మునుయిచ్చు కొరకూ॥ 274**

## ప్రతిపదార్థము

కపటాత్ముడు = కపట లక్షణములు కలవాడు

జపములు = మంత్ర జపములు

తపములు = త్రివిధ తపస్సులు

సలుపును = హెచ్చుగా పాటించును

విపరీత స్మరణ జేయు=అ ధ్యాత్మిక విషయములు పదేపదే స్మరించు చుండును

వేదాంతార్థంబు=వేదాంత శాస్త్రమందు చెప్పబడిన ఆత్మ తత్వమును గూర్చి

అపరిమితంబుగా చెప్పును=చాలా విడమరచి విశేష వాఖ్యానముతో వివరించును

శిష్యకోటి గనిమెచ్చు కొరకు = తన్నాశ్రయించిన శిష్యులు తన గొప్ప తనమును తను ఆధిక్యతను గుర్తించుట కొరకు

మెచ్చి = తన విలువను, గొప్పతనాన్ని వారు గుర్తించి

ద్రవ్యమును ఇచ్చు కొరకు = హెచ్చుగా ధనమును కట్న కానుకల రూపంలో తనకు సమర్పించుట కొరకు
అపకీర్తి చేతాలకు = అప్రతిష్టలు కలిగించేపనులకు
అదరి నట్లగుపడి = భయపడు తున్నట్లుగా పైకి కనపడుచు
ఉపమూచె = యుక్తిచే
బ్రతుకుచు నుండు = జీవితాన్ని వినియోగిస్తూంటాడు

## తాత్పర్యము

కపట లక్షణములు కల్గిన గురువులు తమ్మాశ్రయించిన శిష్యుల ఎదుట తమ ఆధిక్యతను, గొప్పదనాన్ని వారు గుర్తించుట కొర్కై విపరీతమైన జప, ధ్యానములు, వేదాంత విచారణలు వివరించి పాటింప జేస్తూ వారి ఆధిక్యతను ప్రదర్శించుకొందురు. అదిగమనించిన శిష్యులు కట్న కానుకల రూపములో అధికముగా ద్రవ్యమునిచ్చి సంతోష పరచుట కొరకు, సన్మానింప బడుటకు వీలు కల్గులాగునప్రవర్తించెదరు. అపఖ్యాతి కల్గించే పనులకు, వ్యవహారాలకు భయపడినట్లుగా జీవిస్తూ ఉపాయముచే ధనార్జన కొరకు గురుత్వమును ఒకసాధనగా ఉపయోగించు కొందురు.

## బోధానర్హులు

బ్రహ్మ విద్య యోగ్యత, పాత్రత కలవారికి మాత్రమే ఉపదేశించ వలసినదిగా సాంప్రదాయమునందు నిర్ధేశింపబడి యున్నది. పరిపూర్ణ భావమందు ఇట్టి అర్హతను యోగ్యతను నిర్ణయిస్తూ చతుర్విధ శుశ్రూషలు పాటిస్తూ, త్రికరణ శుద్ధి రూపమైన భక్తితో కూడి వున్నవాళ్ళే యోగ్యులుగా చెప్పబడుచున్నారు. మోక్ష శబ్దమునకు శాస్త్రమునందు నిర్వచిస్తూ భ్రాంతి రహిత మిదం మోక్షం అని చెప్పబడుచున్నది. అనగా జనన మరణ రాహిత్య విధానమే లక్ష్యముగా కలవాడు దీనికి అర్హనిగా చెప్పబడుచున్నాడు. ఇది ఉత్తమాధికారి లక్షణం. నేటి కాలంలో గురువుల నాశ్రయించిన వారందరూ ఇట్టి యోగ్యత కలవారేనా అని ప్రశ్నించిన చో కారని చెప్పవలసినదే. అయితే వారికి అట్టి యోగ్యతను పాత్రతను ఉపదేశక్రమములో చెప్పబడిన

అనుష్టాన, ఆచరణ, విచారణ పద్ధతుల ద్వారా పాటింపజేసి ఈ అధికారాన్ని, యోగ్యతను కలిగించి పరిపూర్ణ భావమును ఉపదేశించ వలసి యున్నది. ఇది గురునియొక్క కర్తవ్యము. అయితే ఈ కర్తవ్య నిర్వహణకు శిష్యుడు గురుని ఆశ్రయించి, గురుర్వాక్యము యధా తధంగా జీవింప వలసి యున్నది. ఈ కందార్థమందు ఎట్టి లక్షణములు కలిగుండ కూడదో, భ్రాంతి రహిత విధానమున అవి ఎట్లు అవరోధములో, మోక్ష మార్గమునకు ప్రపంచములో ఎన్ని మార్గములున్నవో చెప్పబడుచూ పరిపూర్ణ భావమును వినుటకు కల అధికారాన్ని కూడా ఇందు చెప్పబడుచున్నది.

**కం॥ జ్ఞానవైరాగ్యభక్త్య। సమాననదీస్నానదేవ మంత్రపఠన। తద్ధ్యాన మఖతంత్రములుపర। మానినిరతిగోరునట్టి మనుజా సంఘము కూ। బోధనుదెల్పు। మనిన వారలకూ। తాను బోధించూట తగదు బోధించితె। తానునేనను భ్రాంతి తలగెదే లాగట్టి। మనుజాసంఘముకూ। బోధనుదెల్పు। మనిన వారలకూ॥ 275**

## ప్రతిపదార్థము

జ్ఞానము=ఆకాశ భూత సంబంధమైన జ్ఞానము ఇది తత్వ విచారణను కలిగించును

వైరాగ్యము = విడిచే లక్షణము, విడువబడే లక్షణము కలిగించునది

భక్తి = జల భూత సంబంధమైన చిత్తమును పురస్కరించుకొని చెప్పబడుచున్న బాహ్య, అనన్య, ఏకాంత భక్తులు తరగతులు

సమాన = వీటితో సమానమైన

నదీ స్నానములు = పుణ్యనదుల స్నానము

దేవ = దేవతలను గూర్చి

మంత్ర పఠన = మంత్రమును పఠించుట (పృధ్వీభూత సంబంధమైన అహంకార నిర్మితమైన మంత్రసాధన)

తద్ధ్యానము = వారిని గురించిన సగుణ, నిర్గుణ ధ్యానములు

మఖ = యజ్ఞములు

తంత్రములు = మొదలైన పనులన్నీ

పరమాని = గొప్పవైనవిగా, మోక్షమునకు మార్గములుగా భావించి
నిరతి కోరునట్టి = నిరంతరము వాటి గురించి ఆలోచించి ప్రయత్నంచేసే
మనుజా సంఘమునకు = మనస్సు బాగా వికసించిన లక్షణము కలవారికి
బోధను దెల్పుమనిన = అట్టివారు పరిపూర్ణబోధను ఉపదేశించమని కోరినచో
వారలకు = అట్టివారికి
తాను బోధించుట తగదు = వారికే మాత్రము ఈ అంశము చెప్పకూడదు
బోధించి తే = తొందరపడి వారికి విషయము చెప్పగలిగితే
తాను నేననే భ్రాంతి = జీవేశ్వర ఐక్యభ్రాంతి, మతభ్రాంతులు
తలగే దెలాగ = పోయే విధానము వారికి తెలియదు

## తాత్పర్యము

ఈసిద్ధాంత కర్త అయిన శివరామ దీక్షితుల వారు బోధకు అనధికారులను పేర్కొంటూ శాస్త్రములయందు, దేవతలయందు, కర్మలయందు, జ్ఞానము, భక్తి, వైరాగ్యములందు, మోక్షమునందు, అనుభవమునందు, శ్రవణ మనన నిధి ధ్యాసల యందు ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత భ్రాంతి కలవారికి ఈ మార్గము ఉపదేశించ కూడదు అని నిర్ధేశించి యున్నారు. ఈ భావమునే ఈ గ్రంథకర్త ఈకందార్ధమందు పేర్కొంటూ జ్ఞాన, వైరాగ్య, భక్తి, నదీస్నానములు, దేవతా మంత్ర పఠన, ధ్యాన యోగములు మోక్షమునకు మార్గములుగా నమ్మి, వాటియందలి భ్రాంతిచే జీవించులక్షణము గలవారికి ఉపదేశించ వలసి వచ్చినపుడు ఈ మార్గము సూచించరాదు అని పేర్కొన్నారు. ఏలననగా సూచిస్తే భ్రాంతిరహిత విధానమునకు బదులుగా వారికి పైన పేర్కొన్న వాటియందు భ్రాంతి విస్తారముగా ఉండుట చేత ఈ భావము అతకదని సర్వ భ్రాంతి రహితమే లక్ష్యముగా కలవారికి మాత్రమే ఈ మార్గము ఉపదేశించ వలసి నందున, ఈ మార్గమునకు ఈ భావము సరిపడదు గనుక వారిముందు ఈప్రస్తావన చెయ్యకూడదు. ఇట్టి అధికారమును గూర్చియే ప్రారంభమున లక్షణయుతుడను శబ్ధము చేత పేర్కొన బడినది.

# అశరీర పద్ధతి

శరీరమనగా నశించు స్వభావము కలది ఇది నాల్గు విధములుగా విచారణ యందు స్పష్ట పరచ బడుచున్నది స్థూలము, సూక్ష్మము, కారణము, మహా కారణము. కరచరణాది అవయవములు కల్గినది స్థూలము. వీటిని ఒకచోట చేర్చి ఆకృతి కల్గించునది సూక్ష్మము. వీటికి శక్తిని ప్రసాదించునది కారణము. ఈశక్తిని ఉత్పత్తిచేసి వ్యవహారసత్తా కలిగించునది మహా కారణము. ఈ విధముగా నాల్గు శరీరములు నిర్ణయించబడియున్నవి. వీటియందు అత్యంత ముఖ్యమైనది సూక్ష్మమై ప్రకాశవంతమై ఉన్నది గుర్తెరిగే శరీరము. పనులను బట్టి నాల్గు శరీరములుగా నిర్ణయించిన ఈ గుర్తెరిగే శరీరమునే శరీరముగా వస్తునిశ్చయపూర్వకముగా తెలియ వలసి ఉన్నది. "యదవేహ తదముత్రా తదముత్ర యదన్విహ" అన్నట్లుగా కార్య కారణములయందు అనగా పిండాండ బ్రహ్మాండములందు, అధిష్టాన మందు ఈ శరీర నిర్ణయమును గూర్చి వస్తు నిశ్చయ పూర్వకముగా గురుముఖత: మాత్రమే గుర్తించవలసి యున్నది. అశరీరం అనగా శరీరం లేకపోవటం. కందార్థం విచారణా సౌలభ్యం కోసం, అనుభవం కోసం పిండాండ దృష్టితో పోల్చి చెప్పబడిన సమన్వయ బుద్ధితో వస్తునిశ్చయ పద్ధతిచే అధిష్టానమందు వీటిని సమన్వయ పరచుకొనవలెను. అదిష్టానమందు ఒకే శరీరము ఒకే అవస్థగా సిద్ధాంతీకరింపబడియున్నది. శరీరము = గుర్తెరిగే శరీరము, అవస్థ = స్వప్నము లేక కల. వీటి వివరణ అత్యంత గోప్యమై సాంప్రదాయ బద్ధమై యున్నది. పరిపూర్ణ బోధ అనగా పరిపూర్ణమెరిగి, ఎరుక నెరిగి ఎరుకను మానుటయే కదా! విషయ నిరూపణ యందు ఆరూఢపద్ధతిచేత గురువాక్యముచే పరిపూర్ణము స్వత:సిద్ధమై యున్నదని, దానియందు గుర్తెరిగే శరీరము లేనిదని దృఢపరచుకొన్నతాను గురుమూర్తికి దక్షిణగా సమర్పింపబడినట్లుగానూ, ధర్మపరిరక్షణకొరకు, సాంప్రదాయము అవసరము కొరకు తిరిగి గుర్తును గురువు చేత అనుగ్రహింపబడి లేక పొందబడి అట్టి గుర్తుతో ఇహ పరములయందు

చక్కటి సమన్వయముతో ఎట్టి భ్రాంతులకు లోను కాకుండా, తెలుసుకొన్న భావమునకు దూరము కాకుండా మధ్యేమార్గములో కర్తృత్వ రహిత కర్మాచరణతో ఆగామీ రహిత విధానమును ఏర్పరచుకొని, తటస్థలక్షణము కలిగి, అందరిలో అందరిలా వుంటూ అసంగుడై జీవించు విధానము ఎట్లో అట్టి స్థితియందు వారి ఆరూఢ విధానము జీవన విధానము ఎట్లు ఆదర్శప్రాయములై ఉండగలవో, వుండీలేని విధానమును అశరీరపద్ధతి అనుపేర ఈశీర్షికయందు చెప్పబడుచున్నది.

కం॥ ఒంటుకుదాపలబింద్వొం। ట్లంటించినకొలది లెక్క అధికంబగు
నావొంటుకువలవలబింద్వేక। టంటించిన లెక్క
వుళ్లక్యాగదనోయీ। వొంటుండిలేం। దౌగదనోయీ। తంటా దీరును
చూడుదానివలెనె యెరుక। కంటేబయలును తాను గలిగుండి తన
కుళ్లక్యాగదనోయీ। వొంటుండిలేందౌ గదనోయీ॥ 276

## ప్రతిపదార్థము

ఒంటు = ఒకటి అను సంఖ్య
దాపల = ఎడమ ప్రక్క
బిందువు = సున్న
అంటించిన కొలది = చేరు చున్న కొలది, లేక వేయుచున్న కొలది
లెక్క అధికంబగు = విలువ పెరుగు చుండును
ఆ వొంటుకు = ఆ ఒకటి అను అంకెకు
వలపల = కుడి ప్రక్క
బింద్వేకటంటించిన = ఒక సున్న చేర్చిన ఎడల
లెక్క = విలువ
వుళ్ళక్యాగదవోయీ = లేని దగుచున్నది గదా
వొంటుండీ = ఒకటి సంఖ్య విలువలు కలిగుండీ
లేందౌ గదనోయీ = లేనిదే అగుచున్నది గదా
తంటా దీరును = సమస్య పరిష్కారమౌను

చూడు = స్పష్టముగా విచారించిన మీదట
దాని వలెనే = పైన పేర్కొన్న విధముగానె
ఎరుక = గుర్తెరిగే తెలివి
కంటె బయలును = తన కన్యముగా స్వత:సిద్ధమైన పరిపూర్ణ పరబ్రహ్మమున్నదని దృఢ పరచుకొన్న మీదట
తాను కలిగుండీ = తాను తన ఉనికి కలిగున్న
తనకుళ్ళక్యొగద = తనకు తానుగా లేక పోవుచున్నది గదా!

## తాత్పర్యము

ఒకటి అను సంఖ్యను వేసి, దానికి ఎడమ ప్రక్కన ఒక్కక్క సున్నా చేర్చుచున్న కొలది వాటి విలువలు పెరుగు చుండును. ఆ ఒకటికే కుడి ప్రక్కన ఒక్క సున్న నుంచిన ఎడల లెక్క అంతయు లేనిదగు చున్నది. ఒకటి వేసిన సున్నలు, వాటి విలువలు అన్నీ కలిగుండీ ముందు వుంచిన సున్న చేత విలువ లేనివి గానే తెలియు చున్నవి. ఆ విధంగానే జన్మ కర్మలకు అత్యంత మూలకారణమైన గుర్తెరిగే తెలివి తనకన్యమై స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణము నందు తనకు మూలము గాని స్థానము గాని లేదని గురువాక్యముచేత దృఢ పరచుకొన్న మీదట ఒకటి సంఖ్య వంటి ఎరుక, దానికి చేర్చిన సున్నలవంటి జీవేశ్వర జగదో పాధులు (పిండాండ బ్రహ్మాండములు) మున్నగునవి కలిగియున్నను పైన పేర్కొన్న భావము చేత లేనిదె అగుచున్నది.

**కం॥ నీకలలోనినునన్నును। లోకులలోకముల జూచిలోపలి భ్రమచే।**
**నాకరుణబడసిమేలుక। చేకొనికలకల్ల జేసి। చేరేద వెటకో।**
**సర్వము నీతొచేరీనీయెంటకో। ప్రాకటముగ బట్టబయు**
**లెరుకలీరీతి। నీకు దెలిసిన మీద నిలువాకవేవేగ। చేరేదవెటకో**
**సర్వము నీతోచేరీనీయటకో॥ 277**

## ప్రతిపదార్థము

నీ కలలో = శిష్యుని యొక్క గుర్తే తెలివిచేత ప్రకాశింపబడుతున్నభావనలో
నిన్ను = ఒక శిష్యునిగా
నన్నును = ప్రబోధిస్తున్న గురువుగా
లోకుల లోకముల = ఇతరమైన ప్రపంచము, జీవోపాధులు
చూచి = చక్కగా గుర్తెరిగి
లోపలి భ్రమచే = మనస్సులో సంస్కార రూపముగా నున్న భావనా బలముచే
నాకరుణ బడసి = నా అనుగ్రహము పొంది
మేలుక చేకొని=జాగ్రత చెంది
కల కల్లచేసి= అంతకు పూర్వం పొందిన భావన నిజము కాదని గ్రహించి
చేరెదవెటకో = కానరా కుండా అదృశ్యమై పోయెదవు
సర్వము నీతో చేరేను ఎటకో=నీవలెనే మొత్తమంతయు కానరాకుండా పోవును
ప్రాకటముగ = పైనపేరొన్నవిధంగా, స్పష్టముగా
బట్ట బయలు,ఎరుక = పరిపూర్ణము, ఎరుక
ఈ రీతి నీకు తెలిసిన మీదట=పైన పేర్కొన్నవిధముగా నీకు దృఢమైన మీదట
నిలువక = వుండుటకు వీలు కాక
వేవేగ = వెంటనే
చేరెద వెటకో = లేకుండుదువు

## తాత్పర్యము

గుర్తెరిగే ఎరుక అనే కలలో గురుశిష్యులుగా, జీవేశ్వర జగత్తులుగా, నీలోపలనున్న భ్రమచే అనగా నీ గుర్తెరిగే తెలివిచే భ్రమించి గురుమూర్తి అనుగ్రహముచే స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు కలవంటి ఎరుకకు మూలముగాని, స్థానముగాని లేదని దృఢ పరచుకొన్న మీదట, నీ భావనా బలముచే కలవంటి ఈ సమస్తము లేనిదగుచున్నది. ఎచ్చట నుండి వచ్చినది, ఎచ్చటికి వెళ్ళుచున్నది కూడా ఊహించుటకు సాధ్యము కాక అదృశ్యమవుతున్నది. ఈ ప్రకారముగానే స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణము

వున్నదని, దానియందు ఎరుకకు మూలముగాని, స్థానముగాని లేనిదని దృఢపరచుకొన్నమీదట, నీవు, నేనుగా వ్యవహరించు చున్న గుర్తు కూడా పైనపేర్కొన్న విధంగా లేనిదగుచున్నది.

**కం॥ కలనెడబాసిన మనుజులు। కలలోపలి పనులు చేయకల**
**వారననా। కలవారుగారువారల। వలెయెరుకను గురునిచేత।**
**వదలెరుకలోనా। గలపనిచేయ వలదెరుకలోనా। కలవారంచని**
**నోటపలుకూటమరయాక పలికీన వారీకి తొలగాదు పాపాము।**
**వదలెరుకలోనా। గల పనిచేయ। వలదెరుకలోనా॥ 278**

## ప్రతిపదార్థము

కలనెడబాసిన మనుజులు = స్వప్నము నందు తాను పొందిన మానసిక భావము నుండి మెలుకువ ద్వారా విడిచి పెట్ట బడిన మనసు కలవారు
కల లోపలి పనులు చేయ = అంతకు పూర్వము తాను స్వప్నావస్థయందు తన మనసుతో చేయబడిన పుణ్య, పాప రూపమైన క్రియలు
కలవారననా = కలలోపలి వారిగా వారిని ఎంచవచ్చునా, భావించవచ్చునా
కల వారు కారు = స్వప్నావస్థ నుండి విడువ బడినవారు
వారల వలె = అట్టి మెళకువ స్థితిని పొందిన వారివలె
ఎరుకను గురుని చేత వదలి = పరిపూర్ణము వున్నది, ఎరుక లేనిది అని గురువాక్యము చేత దృఢపరచుకొన్న మీదట (షోడశి వాక్యము)
ఎరుక లో నా పని చేయవలదె = గురుని చేత మరల గుర్తును పొంది, నేను, నాది అను కర్తృత్వ భావన విడచి, ప్రాపంచిక వ్యవహారమున్నయు యధావిధిగా వీరు జరుపునట్టి క్రమమును జరుప వలసి యున్నది.
ఎరుక లోన కలవారంచని = లౌకిక వ్యవహారములు యధావిధిగా వీరు జరుపునట్టి క్రమమును చూచి వీరు భ్రాంతితో కూడు కునే వున్నారు అనుట
నోట పలుకుట మరయాక=వారి మానసిక ప్రవృత్తిని గమనించక, వారి నడకను గూర్చి
పలికిన వారికి = వారిగురించి మాట్లాడు వారికి
తొలగదు పాపము = వారి స్థితిని గమనించక మాట్లాడిన మాట వల్ల కలుగు దోషము ఆ మాట్లాడినవారికి సంక్రమించును

# తాత్పర్యము

స్వప్నావస్థ యందు మనస్సు ద్రష్ట, దృక్కు, దృశ్యము తానే అయి జాగ్రదావస్థ యందు వలె సమస్త వ్యవహారములు భావనా మాత్రముగా జరుపు చుండును. ఇందలి అంశములు వాస్తవము కాకపోయినా తత్కాలమందు యదార్థముగా గోచరించి భ్రమ, ప్రమలు కలిగించును. ఇది అంతయు సంస్కార ప్రభావముచే కలిగి,దాని తీవ్రత నశించిన పిదప మెలకువ కలిగి స్వప్నమందలి విషయము మరల భావములో ప్రవేశించినా వాటి ప్రభావమునకు వారు ఏ మాత్రము లోను కారు. ఏలననగా మెలకువ రీత్యా కలనిజము కానిది. కనుక అందుచే ఏర్పడిన పనులు, వాటి వలన కలుగు పుణ్య పాప సంస్కారములు కూడా నిజము కాక పోవు చున్నవి. ఈ విధంగానే జన్మకర్మలకు అత్యంత మూలకారణమైయున్న గుర్తెరిగే శరీరము పరిపూర్ణ సిద్ధాంతరీత్యా కలవంటిది. దానిచే కలుగు జన్మ పరంపరలు కలయందలి దృశ్యముల వంటివి, వాటిచే చేయు పనులు, పుణ్యాపాప సంస్కారములు జన్మ పరంపరల వంటివి. స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణమందు ఈ గుర్తెరిగే తెలివికి మూలము గాని, స్థానము గాని లేదని గురుప్రబోధ చేత దృఢ పరచుకొనుట మెలకువగా చెప్పబడుచున్నది. ఇట్టి మెలకువ స్థితి యందు నేను, నాది అను కర్తృత్వ భావము విడిచి గురువాక్యాను సారముగా లౌకిక జీవితము గడుపు వారిని, వారి ప్రవర్తనను చూచి ఇతరులు వారిని విమర్శించ వచ్చును. అది అట్టి మహనీయుల మానసిక స్థితిని, ఆరూఢతను గమనించక చేయబడిన విమర్శలు గావున అట్టి విమర్శ ద్వారా వచ్చు పాపఫలము విమర్శించిన వారుపొందక తప్పదు.

**కం॥ క్షితిలోననరుడపక్వా। న్నతతిని దినికక్కిమరలనాకునె యతిసం।**
**స్మృతివిడిచి తిరిగి పూనునె। వితరణ శాలిచ్చినట్టి। విత్తా**
**మడిగీనె। సత్యవాది సత్యముడిగీనె। ప్రతిలేనిగురుబోధ స్థితి**
**జెంది యెరుకాని। గతిసంగ్రహించాడు। కృతకృత్యుడిచ్చీన।**
**విత్తామ డిగీనే। సత్యవాది। సత్యాముడిగీనే॥ 279**

## ప్రతిపదార్థము

క్షితిలోన = ఈ ప్రపంచమందు

నరుడు = ప్రాణ శక్తి అధికముగా కలవాడు

పక్వాన్నత = మిక్కిలి పచనము చేయబడిన పదార్థములను

తిని = అనుభవించి, భుజించి

కక్కి = నోటి ద్వారా విసర్జించి

మరల నాకునే = తిరిగి స్వీకరించునా

యతి = సన్యాసి

సంస్కృతి విడిచి = గృహస్థాశ్రమమును విడిచిపెట్టి

తిరిగి పూనునె = మరల భార్యా పిల్లలతో సహజీవనం చేస్తాడా?

వితరణ శీలి = దాన గుణము కలవాడు

ఇచ్చినట్టి విత్తమును =తాను దానము చేసిన సొత్తును

అడిగీనె = తిరిగి వారి వద్దనుండి తనకు రావాలని కోరుకుంటాడా

సత్యవాది = సత్యముగా మాట్లాడడమే వ్రతముగా పాటించేవాడు

సత్యముడిగీనె = ఆవ్రత దీక్షను భంగ పరుచు కుంటారా?

ప్రతిలేని = సాటిలేని

గురుబోధ = పరిపూర్ణమెరిగి, ఎరుకనెరిగి, ఎరుకను మానుట

స్థితిచెంది = ఆరూఢతచెంది

ఎరుకాని = ఎరుకయొక్క వాస్తవికతను

గతి సంగ్రహించడు = ఎరుక యొక్క భ్రమ, ప్రమలకు లోనుకాడు

కృతకృత్యుడు = బోధయందు ఆరూఢత చెందిన వాడు

## తాత్పర్యము

ఈ భూమండలమందు అతిసారవంతమైన, పరిపక్వము కావింపబడిన ఆహార పదార్థములు సుష్టుగా భుజించిన పిదప వమనము గావింపబడి, దానిని మరల స్వీకరించునా? సన్యాసి సన్యసించిన పిదప గృహస్థుగా మారునా? దానగుణము కలవాడు దానము చేసిన పిదప దానిని

తిరిగి పరిగ్రహించునా? సత్యము మాట్లాడుట వ్రతముగా పూనిన వాడు అసత్యమాడునా? ఆ విధముగానే సాటిలేని పరిపూర్ణ బోధను గురుముఖత: గుర్తించి, ఎరుకను విడిచి, తటస్థ లక్షణముతో గురువాక్యము యధా తధంగా జీవించువాడు ఎరుక యొక్క భ్రమ, ప్రమలకు లోనౌనా? అనగా లోను కాడు అని తెలియ వలెను.

కం॥ జగమువలన సంకల్పము। జగమాసంకల్పమునను జనియించును వే।
రగుపడదు జన్మమందిర। మగపడదెడ బాసి నిల్వ। వారెండెన్నటికీ।
బయలును గనినీ। వీరెండెన్నటికీ। యికదల్చబోకుమాయి
విబుట్టుటుళ్ళక్క। మృగ జలమగుపడ్డ మిధ్యం చెరిగిన మాడ్కి।
యారెండెన్నటికీ। బయలును గనినీవీ రెండెన్నటికీ॥ 280

## ప్రతిపదార్ధము

జగము = "జ " అనగా పుట్టునది "గ " అనగా గతించునది పుట్టి నశించే స్వభావము కలిగినది. పంచ భూతాత్మకమైన ప్రపంచము

సంకల్పము = అధిష్టాన పరబ్రహ్మము యొక్క సంకల్పము వలన

జగమా సంకల్పము నను జనియించును = అట్టి సంకల్ప బలముచే పిండ బ్రహ్మాండములు ఏర్పడును

వేరగుపడదు జన్మ మందిరము = ఈ రెంటి ఉత్పత్తికి ఒకదాని కొకటి కారణము తప్ప మూడవ వస్తువు కానరాదు

అగుపడి = రెండు ఒకదాని కొకటి పెనవేసుకుని, విడిచిపెట్టక

ఎడబాసి నిల్వవు = ఒకదాని నొకటి విడిచి వేరుగా నుండవు

ఆ రెండు = ఎరుక, జగములు

బయలును గని = స్వత: సిద్ధమైన పరిపూర్ణమును ఉండజూచుకొని

నీవీ రెండెన్నటికీ = రెండుగా కనపడుతున్న ఈ ఏక వస్తువును వస్తునిశ్చయ పూర్వకముగా గుర్తించి

ఇక తలచ బోకుము = ద్వాదశి, షోడశి వాక్యముల ద్వారా ఈ రెంటిని విడిచి వుండుము

ఇవి పుట్టుటుళ్ళక్కి = ఇవి లేనివి అను భావన దృఢమైనచో తిరిగి పుట్టవు ఏలననగా ఇవి లేనివి కనుక

మృగ జలమగు పడ్డా = ఎండమావుల యందు నీరు కన్పిస్తున్నా

మిధ్యం చెరిగినమాడ్కి = నిజము కాదని తెలుసుకొన్న విధంగా

## తాత్పర్యము

అధిష్టాన పరబ్రహ్మము (అఖండ ఎరుక) నేను అనేక మగుదును గాక అను సంకల్ప బలముచే బ్రహ్మాండ పరిణామము దానినుండి పిండాండ పరిణామము ఏర్పడినవి. తదుపరి జీవోపాధులను సృష్టించి, తదుపరి వాటి యందు జీవ రూపముగా తానే ప్రవేశించి సకల వ్యవహారములకు కారణమగుచున్నది. ఈ క్రమము నందు ఈ రెండు ఎరుక జగత్తు ఒకదాని కొకటి ఆధారపడి, ఒక దాని నొకటి సృజించుకొనుచు విడదీయ రానివై వున్నవి. ఈ రెంటి ఉత్పత్తికి మూడవ వస్తువు కారణము కాదు. వస్తు నిశ్చయ జ్ఞానము చేత మాత్రమె ఈ మర్మము స్పష్టముగా తెలియ గలదు. ఇది అనుభవ నీయము. గురు సూచన ద్వారా స్వత:సిద్ధమైన పరిపూర్ణము నందు ఏకైక ద్వంద్వ పద్ధతి గల ఈ ఎరుకకు మూలముగాని, స్థానము గాని లేదని గురుర్వాక్యం ద్వారా (ద్వాదశి, షోడశి) విడిచిపెట్టవలెను. అన్నిటికీ మూలము, ఆధారము అయి వున్న దీనికి ఉన్న పరిపూర్ణము నందు మూలము గాని, స్థానము గాని లేకపోవుటచే లేనిదగుచున్నది. ఒక వేళ తోచ బడినా ఎండ మావులయందు నీటివలె నిజము కానిదని, తోచుట మాత్రమె కాని వాస్తవము కాదని దృఢ పరచు కొనవలసి వున్నది.

**కం॥ గురుడచలచలములను తన। కెరిగించిన శిష్యుడెరిగి యెరుకై**
**యుండన్। యెరుకనునిల్పకు మనినను। యెరుకను విడనాడి**
**శిష్య। డెట్లుండునంటే అట్లనేనేనిం కెట్లుండునంటే। పురుషుడు**
**లేనట్టి పొలతి సౌందర్యాము। మరిమరి కలిగుండి। మరిలేనట్లని**
**యంటి। యెట్లుండునంటే అట్లనేనేనింకెట్లుండు నంటే॥ 281**

## ప్రతిపదార్థము

గురుడు అచల చలములను తనకెరిగించిన = గురువు వస్తునిశ్చయ పూర్వకముగా ఎరుక పరిపూర్ణము లను గుర్తింప జేసిన పిమ్మట
శిష్యుడు ఎరిగి = శిష్యుడు వాటిని స్పష్టముగా గుర్తించిన వాడై
ఎరుకై వుండన్ = రెంటిని గుర్తించిన గుర్తు స్వరూపుడై వుండగా
ఎరుకను నిల్పకు మనినను = గుర్తించిన ఎరుకను కూడా విడిచిపెట్టుము ( షోడశివాక్యము ద్వారా)
ఎరుకను విడనాడి = ఆగుర్తును కూడా విడిచి పెట్టిన వాడై
శిష్యుడెట్లుండు నంటె = ఆ స్థితిని గ్రహించిన ( పాటించిన ) శిష్యుడు ఏ విధముగా ఉండుననగా
అట్లనే నే నింకెట్లుండునంటె = ఆ విధంగా నేను ఎలా వుంటుంది? అని ప్రశ్నించేగుర్తు ఏవిధంగా వుంటుందంటె?
పురుషుడు లేనట్టి పొలతి సౌందర్యము = భర్తతో సంబంధపడి అనుభూతము కావించుకోలేని స్త్రీ అందము
మరీ మరీ కలిగుండీ = ఎంతహెచ్చుగా కన్పిస్తున్నా
మరిలేనట్లు = లెక్కలో లేని విధముగా
అనియంటి = పై విధముగా ఉండునని చెప్పబడుచున్నది.

## తాత్పర్యము

గురుమూర్తి యోగ్యుడైన శిష్యునకు పరిపూర్ణము, ఎరుకలను గూర్చి వస్తునిశ్చయ పూర్వకముగా తెలియ జేసిన మీదట, ఆ రెండు అంశములను స్పష్టముగా దృఢపరచుకొని, ఎరుక స్వరూపుడే అయివుండగా,అట్టి గుర్తును కూడా విడచి వుండుమని (షోడశి వాక్యము ద్వారా) గురుడాజ్ఞాపించినపుడు, దానికనుగుణ్యముగా ఆగుర్తును విడచినవాడు ఏవిధముగా వుండును? అను సంశయముతో,వున్న గుర్తు ఏవిధముగా వుండును? అని ఆశ్చర్య కరమైన సంధర్భములో, మహాసౌంధర్యవతి భర్తతో ఏమాత్రము సంబంధపడక ఎంత కలిగున్నాలేని విధమెట్లో అవిధంగానే గుర్తు కలిగుండీ తానులేకపోవు చున్నది.

కం॥యెరుకనువిడనాడియా। పురుషునిస్థితి యెట్టిదనిన పొందుగ వినుమీ।
సరిపడుసరిపడదనకను। సరిగా వర్తింపు చుండు సమరాస బుద్ధిన్।
కార్యములందు। సహజప్రవృద్ధిన్। పరిపారి విధ మూలపరువులు
బెట్టాడు। మరి వైరాగ్యముచేత మానుకొనుండాడు। సమరసబుద్ధిన్।
కార్యములందు। సహజప్రవృద్ధిన్॥ 282

## ప్రతిపదార్థము

ఎరుకను విడనాడిన యాపురుషుని స్థితి = పైన పేర్కొన్న విధంగా గురువాక్యాను సారంగా ఎరుకను విడిచిపెట్టిన వానిస్థితి

ఎట్టిదనిన = ఎలావుండునంటె

పొందుగ వినుమీ = చక్కగా శ్రద్ధగా గమనించుము

సరిపడు సరిపడ దనకను = తెలుసుకున్నాను అనిగాని, తెలియలేదు అనిగాని ఏనిర్ణయము చేయక

సరిగా వర్తింపు చుండు = వున్నదానిని వుండ జూచుకొని దానివలెనే ఉనికి కలిగి వుండును

సమరస బుద్ధిన్ = సమయోచిత ప్రజ్ఞచే

కార్యములందు సహజ ప్రవృత్తిన్ = వ్యవహార కాలములో ఇట్టి ఆరూఢతకు ఏమాత్రము భంగము కలుగ కుండా వ్యవహరించును

పరిపరి విధముల పరుగులు పెట్టడు = లౌకిక కార్యములందు అందరివలె వ్యవహరించడు

మరి = అలాగని

వైరాగ్యముచేత మానుకొనుండడు = సన్యాసధర్మము వలె సంక్రమించిన దానిని వదులుకోడు

## తాత్పర్యము

గురువాక్యము ద్వారా (షోడశి) ఎరుకను విడచి పరిపూర్ణము నందు ఉనికిని కలిగి వుండు మహాత్ముని మానసిక స్థితి, జీవన విధానము చాలా విలక్షణముగా నుండును. నిశితముగా పరిశీలించినగాని వారి

అంతర్యమును గుర్తించుట పొసగదు. పరిపూర్ణము వున్నదని గాని, ఎరుక లేనిదని గాని, ఎట్టి నిర్ణయము చేయక సమయోచిత ప్రజ్ఞతో నేను, నాది అను కర్తృత్వ, భోక్తృత్వములు విడిచి వ్యవహారములందు అందరి వలె సహజముగానె ఎట్టి మార్పులు లేక జీవించు చుండును. ఇట్టి ఆరూఢత గురునిష్టచే సహజముగా సంక్రమించును. వ్యవహారములందు ఇది మంచి, ఇది చెడు, ఇది పాపము, ఇదిపుణ్యము అను మీమాంసలు చేయక యాదృచ్ఛాలాభ సంతుష్టి కలిగి భుక్తి, ముక్తి క్రియలందు ఎట్టి నిర్లక్ష్యము గాని, ఆసక్తిగాని చూపక చక్కటి ఉనికితో జీవించును.

**కం॥ అనహంకారుండనిమిషుడు। గనుకనె విశ్వంబనేటికల గానడహం। బనువాడుసనిమిషుడుగా। వున విశ్వంబనేటి స్వ। ప్నోద్యోగాముబూనీ। చేయుచుయా। వుద్యోగా ముమానీ। యను నీస్వప్నోద్యోగమునకు నేకారణ। మనితానని మిషు డెన్నడ నుకోడీమాట। నుద్యోగాముబూనీ। చేయుచుయావు। ద్యోగాముమానీ॥ 283**

## ప్రతిపదార్థము

అనహంకారుడు = అహంకారము లేని వాడు

అనిమిషుడు = రెప్పపాటు లేనివాడు అనగా దైవత్వమును పొందినవాడు

కనుకనే = అందుచేతనే

విశ్వంబనెటి కలగానడు = కలవంటి ఈ ప్రపంచము వాస్తవమని తలచడు

అహంబనువాడు = నేననే గుర్తుతో వ్యవహరించువాడు

సనిమిషుడు=మార్పునకు లోనైవున్న ప్రపంచమును వాస్తవమని భ్రమించువాడు

కావున = అందుచేతనే

విశ్వంబనేటి స్వప్నోద్యోగము = నిజముకాక భ్రమ ప్రమలకు లోనై తెలియబడుచున్నఈ ప్రపంచమున జనన మరణములకు లోనై

చేయుచు = ఉపాధికి వస్తూ

ఆ వుద్యోగము మాని=ఉపాధిని విడిచి పెట్టి (జనన మరణ చక్రమునకు లోనై)

అను ఈ స్వప్నోద్యోగమునకు = ఈ విధముగా పరిణామ క్రమమునకు లోనైవున్న వాస్తవము కాని దానికి
నే కారణమని = తానే కారణముగా నున్నానని
తాననిమిషుడు = పరిపూర్ణ భావమును ఆరూఢ పరచు కొన్నవాడు
అనుకోడు = యధార్థమని భావించడు

## తాత్పర్యము

పరిపూర్ణము ఉన్నది, ఎరుక లేనిది అని దృఢపరచు కొన్న మహాత్ముడు నేను అను గుర్తును విడిచి యుండును. తద్వారా నాది అను భావము కూడా రద్దవును. తాను గ్రహించిన పరిపూర్ణస్థితిని గూర్చి రెప్పపాటు కాలము కూడా అలక్ష్యము లేక ఉనికి కలిగి వుండును. అట్టి వునికి యందు అధిష్టాన పరిణామంలో ఏర్పడిన బ్రహ్మాండము + అక్షర పురుషుడు, ఇతని వ్యవహారము తరువాత క్రమంలో పిండాండము + క్షరపురుషుడు దీనివ్యవహారము వాస్తవరూపంగా క్రమంలో జరుగుచున్నా పరిపూర్ణస్థితియందు ఈ రెంటికీ మూలము, ఆధారముగా వున్న ఎరుక కలవవంటిదని భావించి ఉద్యోగ నిర్వహణలో నున్నవాడు మంచి చెడులతో, లాభ నష్టములతో, పుణ్యపాపములతో నిమిత్తపడక విధినిర్వహణ యందు ఎట్లు వ్యవహరించునో తన్ను అకర్తగా ఎట్లు భావించునో ఆవిధంగానే పైన పేర్కొన్న క్రమంలో అన్ని వ్యవహారములు జరుగుచున్నా వాటియందు తనకు ఎట్టి కర్తృత్వము లేదని గట్టిగ దృఢపరచుకొని వ్యవహరించు చుండును.

**కం॥ కలమేలుకొన్నపురుషుడు। కలలోపలిబాములెరుకగలి గుండ**
**గనే తిలకింపలేవు గురుకృప। తెలివొందిన వానికింక।**
**తిప్పాలున్నావే। తెల్పర కొద్దిగొప్పాలున్నావే। తలిదండ్రిదొరదాత**
**కులదైవ మాప్తులు। కలబాంధవులు దేశికులని నమ్మితే యింక।**
**తిప్పా లున్నావే। తెల్పర। కొద్దిగొప్పాలున్నావే॥ 284**

## ప్రతిపదార్థము

కలమేలుకొన్న పురుషుడు = స్వప్నావస్థనుండి మెలకువపొందినవాడు
కలలోపలి బాములు=స్వప్నములో అంతకుముందు తానను భవించిన కష్ట నష్టములు
ఎరుక కలిగుండగనె = మెలకువ స్థితిలో వాస్తవ రూపంగా తన కనుభవములోకి వస్తున్నా
తిలకింప = వాస్తవముగా విచారించగా
లేవు = నిజము కాదని తెలియుము
గురుకృప తెలివొందిన వానికి = పరిపూర్ణ బోధచే గుర్తెరిగే ఎరుక కలవంటిదని బోధచే ఆరూఢ పరచుకొన్న వారికి
ఇంక తిప్పలున్నవె = ఇక వానికి జన్మ పరంపర లుండవు
తెల్పగ = అనుభవములో చూచుకొన్నచో
కొద్ది గొప్పలున్నవె = పిండాండ బ్రహ్మాండములుగా మార్పుచెందు లక్షణము కలిగి వుంటుందా వుండదు
తల్లి, తండ్రి, దొర, దాత, కులదైవము, ఆప్తులు, కలబాంధవులు = తల్లి, తండ్రి, ప్రభువు ఆచార్యుడు, కులదైవము, మిత్రులు మొదలగు బంధువు లందరుకలసి
దేశికులని నమ్మితె=తనకు మంత్రోపదేశం చేసిన గురుమూర్తి యందు పైన పేర్కొన్న విలువలన్నీ కలవని అనన్య భక్తితో గురూపాసన గావించు వారికి

## తాత్పర్యము

స్వప్నావస్థ నుండి మెలకువ చెందిన వాడు, అంతకు పూర్వము స్వప్నములో తాననుభవించిన సుఖదు:ఖములు స్పృహలోకి వచ్చినా, మెలకువ చెందిన స్థితియందు స్పష్టముగా విచారించిన మీదట అవన్ని నిజము కాదని ఎట్లు తెలియుచున్నవో ఆవిధంగానే గురూపాసనచే తన సర్వస్వము లమిత్యాది పంచ పూజలచే సర్వార్పణ భావము పొంది, తనకుపద్రష్టయైన గురుమూర్తిని తల్లి, తండ్రి, పాలకుడు, పోషకుడు,

ఇష్టదైవము, స్నేహితులు, ఆత్మ బంధువు అని అనన్య చింతనతో గురూపాసన గావించి గురుకృపచేత ఉన్న పరిపూర్ణము నందు లేనిది ఎరుక యని దృఢ పరచుకొని, గురుర్వాక్యాను సారము జీవన విధానమును గడుపు వానికి జన్మ పరంపరలు కలుగవు. బ్రహ్మాండ, పిండాండ పరిణామ క్రమములకు వారు లోను కారు. ఇట్టి ఆరూఢత వారు చేయు గురునిష్టచే కలుగునని తెలియ వలెను.

**కంll ఈరీతిస్థితిగలిగిన। నేరుపుశాలితరజనుల నిందా స్తుతులన్।**
**తారేగిచేయడెన్నడు। వారలు మరిచేసిరేని। వలదానియనడూ।**
**చెవియొగ్గి। కావలెనాని వినడూ। వారుమీ వారు మావారువీరను**
**కొంచు। సారేకు వీధీలో పోరాడెవారీనీ। వలదాని యనడూ।**
**చెవి యొగ్గి। కావలెనానివినడూll 285**

## ప్రతిపదార్థము

ఈ రీతి స్థితి కలిగిన నేరుపు శాలి = పైన పేర్కొన్న విధంగా పరిపూర్ణ స్థితియందు ఆరూఢత చెందిన ప్రజ్ఞావంతుడు

ఇతరజనుల నిందా స్తుతులన్ = ఇతరుల గురించి నిందించుటగాని, స్తుతించుట గాని

తారేగి చేయడెన్నడు = తనకు తానుగా ఎప్పుడును మాట్లాడడు

వారలు మరిచేసిరేని = ఇతరులు తనను గూర్చి పొగిడినా, విమర్శించినా

వలదని యనడు = వద్దని చెప్పడు

చెవియొగ్గి కావలెనని వినడు = తనను గూర్చి ఇతరులు ఏమనుకొంటున్నారోనని ఆసక్తిని ఏమాత్రం ప్రదర్శించడు

వారు మీవారు, మావారు వీరను కొనుచు = వ్యక్తిగతమైన చుట్టరికములు, బంధుత్వములు కల్పించుకొని

సారెకు = అనేక విధాలుగ

వీధిలో పోరాడే వారిని = సమాజంలో ఒకరితో నొకరు విరోధము పొందుచున్న వారిని

వలదని అనడు = వద్దని, కూడదని చెప్పడు

## తాత్పర్యము

గురుప్రబోధచేత పరిపూర్ణ స్థితియందు ఉనికి కలిగున్న మహాత్ముడు ఇతరుల గూర్చి, వారి మంచి చెడ్డలగూర్చి ఏమాత్రము ప్రసంగించడు. ఒకవేళ ఇతరులు తనను గూర్చి వారు మాట్లాడినా వారిని వారించడు. లౌకిక జనులు తనను గూర్చి, తన ప్రవర్తన, మంచి చెడ్డల గూర్చి ఏమి మాట్లాడుకుంటున్నారు అను ఆసక్తిని కూడా కనపరచడు. చుట్టరికములు, బంధుత్వములు వ్యవహార దశలో కల్పించుకొని, ఒకరి నొకరు నిందించుకొని,కష్టనష్టములకు గురౌచున్న, వారి ఎడల ఎట్టి శ్రద్ధ కనపరచక నిర్లిప్తముగా వుండును.

కం॥ ధ్వనిమొదలుగు తన్మాత్రలు। గనుగొనగాలేశమైన గాన్పించనిచో। టును।
బట్టబయలుగాగని। ధ్వనిముఖతన్మాత్ర లున్న। దాన్నె యెరుకగనూ।
గనియీరెంట్లో దేన్నియెరుగకనూ। వునికి గలిగినయట్టి।
ఘనునిసన్నుతిజేయ। జనులాకు శక్య మంచన రాదు। వినరాదు।
దాన్నెయెరుగకనూ గనియీ రెంట్లో। దేన్ని యెరుగ కనూ॥ 286

## ప్రతిపదార్థము

ధ్వని మొదలగు తన్మాత్రలు = శబ్ధ, స్పర్శ, రూప, రస, గంధము మొ॥లగు 5 తన్మాత్రలు

కనుగొనగా = స్పష్టముగా విచారించగా

లేశమైనా, కాన్పించని చోటును = బీజ మాత్రముగా కూడా లేనటువంటి వస్తువును

బట్ట బయలుగా గని = పరిపూర్ణ పరబ్రహ్మముగా దృఢపరచుకొని

ధ్వని ముఖ తన్మాత్రలున్న దాన్ని=శబ్ధాది తన్మాత్రలతో కూడుకున్న దాన్ని

ఎరుగకను = లేనిదని, నిజము కానిదని

గని = విచారించి

ఈ రెంట్లో = పైన పేర్కొన్నట్లుగా ఎరుక, పరిపూర్ణములను

దేన్ని ఎరుగకను = దేనిని కూడా గుర్తెరుగ కుండా

ఉనికి కలిగినట్టి ఘనుని = సహజ మైన స్థితి యందు ఆరూఢత చెందిన మహాత్ముని
సన్నుతి చేయ = వారిని పొగడుటకు
జనులకు = సామాన్యులకు
శక్యమంచు = సాధ్యమగును అనుమాట
అనరాదు వినరాదు = చెప్పరాదు, వినకూడదు

## తాత్పర్యము

సృష్టి కారణమునకు ఆధారమైన పంచ తన్మాత్రలు (శబ్ధాదులు) సృష్టికి పూర్వం అధిష్టానమందు బీజరూపముగా ఇమిడి సృష్టి సంకల్పముచే అవ్యక్తము, మహత్, మహదహంకారము, పంచతన్మాత్రలై బ్రహ్మాండాకారము చెందును. దానినుండి క్రమములో పిండాండమందు ఇంద్రియ జ్ఞానముగా పనిచేయును. అధిష్టానము నందు బీజరూపముగా నున్నగుర్తు బ్రహ్మాండమునందు విజృంభణచే పంచతన్మాత్రలుగాను మార్పు చెందినవి అని తెలియవలెను. ఈ మీ మాంసలో బీజరూపంగా కూడా లేనిస్థితిని అచల పరిపూర్ణము గాను బీజరూపమై విజృంభణచే పరిణామమునకు లోనైన ఎరుకను దానియందు లేనిది గాను గురుముఖతా స్పష్టముగా దృఢపరచుకొని రెంటికి చెందని స్థితియందు ఆరూఢత చెందిన మహాత్ముని పొగడుటకు గుర్తించుటకు సామాన్యులకు సాధ్యమగును అనుమాట అనరాదు, వినరాదు అని తెలియ వలెను.

**కం॥హాటమున కుటిలాత్మునిజం। పుటకై ఘటకోటికాజ్ఞ। భూపతి యిడినన్। ఘటులటువలెజేసెటి లోపటకుటిలుడుబడిన పాట్లు। పాటించికనునా। అట్లనెగురుని। నోటతా వినెనా। యిటు వంటి బోధానుయెటువంటి నరుడైన। అటువెనుక తనచేష్టలెటు వంటివో వాట్ని। పాటించికనునా। అట్లనెగురుని నోటతా వినెనా॥**

**287**

## ప్రతిపదార్థము

హరమున = నేరారోపణచే

కుటిలాత్ముని = నేరస్తుని

చంపుటకై మరణశిక్ష వేసి

భట కోటి కాజ్ఞ భూపతి = భటులకు శిక్ష అమలు పరచుటకై రాజు అనుమతి నివ్వగా

భటులటువలె చేసెటి లోపల=సైనికులు ఆ మరణశిక్షను అమలు పరచు లోపుగా

కుటిలుడు = నేరస్తుడు

పడినపాట్లు = అనుభవించిన కష్ట నష్టములు

పాటించి కనునా = ఏ విధముగా గమనించి నిర్వేదనతో నుండునో

అట్లనె = ఆ విధంగానే

గురుని నోట = గురుముఖత: వస్తునిశ్చయ పూర్వకముగా

తావినెనా = తాను దృఢపరచుకొన్నమీదట

ఇటువంటి బోధను = గొప్పదైన పరిపూర్ణ భావమును

ఎటువంటి నరుడైనా = ఎట్టి స్థితియందున్న మానవుడైనా

అటు వెనుక = బోధ విధానము బాగా దృఢ పరచుకొన్న మీదట

తన చేష్ట లెటువంటివో = పూర్వము తనకు, తనజన్మపరంపరలకు సంబంధించిన మంచి చెడ్డలు

వాట్ని పాటించి కనునా = నిజమని, వాస్తవమని విశ్వసించునా?

## తాత్పర్యము

నేర ప్రవృత్తిచే ఒక నేరస్తుడు పట్టు బడి విచారణ కొరకు రాజు ముందు దోషిగా నిలబెట్టినపుడు వాద ప్రతి వాదములచే నేరము నిరూపింపబడి, అందుకు తగిన శిక్షగా రాజుచే మరణ దండన విధింపబడెను. అట్టి దానిని సైనికులు అమలు పరచు లోపుగా నేరస్తుని మానసిక ప్రవర్తన ఏవిధముగా ఉండునో పాఠకులు ఊహించు కోవలసియుండును. ఆవిధంగానే జన్మ రహిత విధానము నకు శ్రేష్టమైన

పరిపూర్ణ భావమును గురుముఖత: వస్తు నిశ్చయ పూర్వకముగా ఉన్నది పరిపూర్ణమని, లేనిది ఎరుక అని దృఢపరచుకొని అట్టి గుర్తును కూడా విడచిన వాడు (షోడశి వాక్యమును) తదుపరి తనజన్మ కర్మలు, పాప పుణ్యముల విషయముల గురించి ఏ విధముగా చింతించును అన్నచో నిర్వేదముతో తటస్థ లక్షణముతో, ఎట్టి మనో వికారమునకు లోను కాక భ్రాంతి రహిత స్థితియందు ఉనికి కలిగి వుండును.

**కం॥ తనుమనధనములు గురునకు। వినయంబునధార బోసి వేడ్కగురునిచే। అనువైనబోధబడసిన। ఘనమతిమంతునకు సాటి। గలదా యీభువినీ। లోకులు మ్రొక్క। వలదా చెవులవినీ। తనని తరుల నేతాననకయేమాటను వినక పరిపూర్ణత దనరువానికి సాటిగలదాయీ భువినీ। లోకలు మ్రొక్క। వలదా చెవుల వినీ॥ 288**

## ప్రతిపదార్థము

తను మన ధనములు = తనువు అనగా శరీరము మనస్సు అనగా భావములు ధనము అనగా వాక్కు (త్రికరణములు)

వినయంబున ధారబోసి = అత్యంత భక్తి శ్రద్ధలతో సమర్పించి

వేడ్క గురునిచే = గురుమూర్తి సంతోషపడునట్లుగా

అనువైన బోధ బడసిన=అందులకు తగిన అత్యంత విలువైన పరిపూర్ణ బోధస్థితి

ఘనమతి మంతునకు = అత్యంత శ్రేష్టమైన బుద్ధి కలవాడు

సాటి గలదా ఈ భువిని = అట్టి వారితో సరిసమానముగా పోల్చ దగినవారు ఈ భూమి మీద లేరు

లోకులు = ప్రాపంచీకులు

మ్రొక్క వలదా చెవుల విని = ఈ రహస్యమును చెవులార విని వారు ఎదురు పడినపుడు ఎట్టి సంకోచము లేక సాష్టాంగ నమస్కారము చేయవలెను.

తన నితరులను = నేను, మీరు

నే తా ననక = రెండు ఒకటేనని అనక
ఏమాట వినక = ఎట్టి నిర్ణయమును చేయక
పరిపూర్ణత దనరు వానికి = పరిపూర్ణము ఉన్నదని, ఎరుకలేనిదని ఏనిర్ణయము చేయక పరిపూర్ణమునందు ఉనికి కలిగి యుండు వారు

## తాత్పర్యము

సచ్ఛిష్యుడు తన త్రికరణములను వాటి పనులతో సహా అత్యంత వినయముతో సద్గురు మూర్తికి భక్తి పూర్వకముగా సమర్పించుకొని, అందుకు తగిన విధముగ గురుకృపచె అత్యంత శ్రేష్టమైన పరిపూర్ణ భావమును అనుగ్రహరూపముగా పొందిన విశిష్ట బుద్ధి శాలి. ఇట్టి వానితో మరి ఎవ్వరిని పోల్చి చెప్పుట తగదు. సామాన్యులు ఇట్టి మహనీయులు ఎదురు పడినపుడు వారి గొప్ప తనము విని సాష్టాంగ నమస్కారము చేయవలసి యున్నది. ఎందు వలననగా అట్టి వారు నీవు, నేను అనుభేద భావము గాని, ఒక్కటి అను అభేద భావముగాని లేక ఎట్టి భ్రమ, ప్రమలకు లోను కాక స్వత:సిద్ధమైన పరిపూర్ణము నందు ఉనికిని గలిగి వుందురు. (ఉత్త పరిపూర్ణమె వారు, వారె ఉత్త పరిపూర్ణము) అని దీక్షితీయ వాక్యము చెప్పుచున్నది.

**కం॥గురుగురుబోధలచేతను। పరిపూర్ణమునెరిగి యెరుక బాసినయతనిన్**
**గురుతెరుగ నొరుల శక్యమె। యెరిగిన నరులిట్టి। బోధ నెరిగే**
**రోయన్నా। వారెరుగాని। మరుగుండ దన్నా। చిరుత పాపని రీతిమరి**
**పైశాచముభాతి। తిరుగూచు నుండు వెక్కురుమాడ్కి గురుడెట్లు।**
**యెరిగేరోయన్నా వారెరుగాని మరుగుండదన్నా॥ 289**

## ప్రతిపదార్థము

గురుబోధ = ఆత్మ బోధ
గురు + గురు బోధ = పరిపూర్ణ బోధ
పరిపూర్ణము నెరిగి ఎరుక బాసిన యతనిన్ = స్వత:సిద్ధమైన పరిపూర్ణము

వున్నదని దానియందు గుర్తెరిగే ఎరుక లేనిదని దృఢపరచుకొని, అట్టి ఎరుకను గూడ విడిచిపెట్టిన వారు
అతనిన్ = అట్టి వారిని, అట్టి మహాత్ముల ఉనికిని
గురు తెరుగ = సామాన్యులు తెలుసుకొనుట
ఒరుల శక్యమె = సాధ్యముగాదు
ఎరిగిన నరులు = ఒకవేళ ఎవరైనా వారిస్థితిని గుర్తించ గలిగితె
ఇట్టి బోధ నెరిగే రోయున్నా = గొప్పదైన పరిపూర్ణ భావమును ఆరూఢపరచుకొన్న వారై వుండవలెను.
వారెరుగని మరుగుండదన్నా = పరిపూర్ణ బోదయందు అట్టి వారికి తెలియని రహస్యముండదు
చిరుత పాపనిరీతి = చంటి పిల్లవాని వలె
మరిపైశాచము భాతి = పిశాచము పట్టిన వాని వలె
తిరుగూచునుండు వెక్కురు మాడ్కి = మతిస్థిమితము లేని పిచ్చి వాని వలె తిరుగుచుండును

## తాత్పర్యము

అచలఋషి సాంప్రదాయమునందు "బ్రహ్మైవాహమస్మి" "అహం పదార్థ రహిత:" అను రెండు ముఖ్యమైన స్థితులు, లక్ష్యములు ప్రతిపాదింపబడి యున్నవి. దేనిని తెలిసిన మీదట అన్నీ తెలిసినట్లగునో అట్టి దానిని తెలుసుకొనుట గురు బోధగా చెప్పబడును. దేనిని విడిచిన మీదట, అన్నీ విడిచినట్లగునో అట్టి దానిని గురు గురుబోధగా చెప్పబడుచున్నది. "విద్యాంతం, బ్రహ్మ విద్యాంతం వార్తికాంత మగోచరం పూర్ణ బోధ" అనిన్నీ దేని గురించి చెప్పబడుచున్నదో అదియే గురుగురుబోధ అనగా స్వత:సిద్ధమైన పరిపూర్ణమున్నదని, దానియందు గుర్తెరిగే తెలివికి మూలము గాని, స్థానముగానీ లేదని తెలుసుకొన్న తెలివిని గూడా విడిచి పరిపూర్ణమునందు ఉనికి గలిగి యున్న మహాత్ములను, వారి ఉనికిని సామాన్యులు గుర్తింపలేరు. ఒక వేళ ఎవరైనా గుర్తింప గలిగినచో వారు

అట్టి బోధయందు, స్థితియందు ఆరూఢత కలిగి యున్నవారై వుండ వలెను. అట్టి మహాత్ములకు పరిపూర్ణబోధ యందు తెలియని రహస్యమంటూ వుండదు. " రహస్యం హేతదుత్తమమ్ " అను అంశము భగవద్గీత యందు శ్రీకృష్ణుడు అర్జునకు ఉపదేశించినట్లుగా చెప్పబడు చున్నది. అట్టి ఉనికిని మహాత్ములను ఈ క్రింద పేర్కొనిన విధముగా గుర్తించుటకు వీలున్నది.

1) చిరుత పాపడు = చంటిపిల్లవానికి తల్లి తండ్రులు ప్రేమతో బంగారు నగలు ఆ భరణములుగా ధరింప చేస్తున్నపుడు విపరీతంగా ఏడుస్తాడు. ఇంట్లో దొంగలు తమనుండి తీసుకు పోయినపుడు నవ్వుతాడు

2) పిశాచము, పైశాచము భాతి = పిశాచము పట్టినవాడు తన వ్యక్తిత్వ లక్షణములను రద్దుపరచుకొని, తనను ఆవహించిన పిశాచ లక్షణములు ఎట్లు కలిగియుండునో

3) వెక్కురుమాడ్కి = జడత్వము చెందినవాడు మనసున్నను, వ్యవహార సత్తా కాక ఎట్లు క్రియా శూన్యమై సంచరించును.

## ముఖ్యాధికారి ఆరూఢత

జన్మ కర్మల భ్రాంతి రహిత విధానమందు మోక్షాపేక్ష కూడా ఒక కోరిక గానే (ఒక భ్రాంతిగానే) చెప్పబడుచున్నది. సర్వ భ్రాంతి రాహిత్యమె జనన మరణ భ్రాంతి రాహిత్యమునకు సరియైన నిర్వచనముగా చెప్పబడుచున్నది. ఇట్టి ఆరూఢత గ్రంథ పరిశీలన వలనగాని, పురాణ శ్రవణము వలనగాని సిద్ధించదు. కేవలము గురు స్థానము నందుండి సేవా శుశ్రూషలు పాటిస్తు ఉపదేశ క్రమమునందు మాత్రమె గురుకృప ద్వారా దృఢము కాగలదు. ఇట్టి ఆరూఢతచే ప్రపంచమందలి ఇతర మార్గములను స్వయముగా పరిశీలించిన మీదట, గ్రంథములను విచారించుట చేత, పలుగురు శిష్యసంవాదములు, కృషి విధానము స్వయముగా చూచుట చేత, తాను పొందిన ఆరూఢత తిరుగులేనిదని ప్రపంచమందు భ్రాంతి సహిత విధానములు మాత్రమె మార్గములుగా సూచింపబడుచున్నవని తనకు తానుగా వివరించుకొని, మోక్ష భ్రాంతిని కూడా తృణప్రాయముగా

విడిచిపెట్టి తాను విన్నగురు ప్రబోధ యందు భ్రాంతి రహిత విధానము ఎట్లు స్పష్టముగా నున్నది గ్రహించి అట్టి విధానము, భావము నందు తన మనస్సును దూరము కానివ్వ కుండా అందుకు కావలసిన గురు నిష్టయందు ఏమరపాటు లేకజన్మ సాఫల్యమును పొందినామని సంతృప్తితో జీవించగలుగును.

**కం॥దేశాటనంబుజేసితి। వ్రాసితి గ్రంథములుకొన్ని వర గురుశిష్యుల్।**
**జేసేటి చర్చ వింటివి। రోసితిమోక్షాద్యపేక్ష। రూఢీగ వినుమీ।**
**నీవిట్టియా। రూఢాతగనుమీ। దేశీకుదయబుట్ట జేసిశుశ్రూషోప।**
**దేశాముగొని యుపదేశామిచ్చితిమెచ్చి। రూఢీగ వినుమీ।**
**నీవిట్టియా। రూఢాతగనుమీ॥ 290**

## ప్రతిపదార్థము

దేశాటనంబు జేసితి = భ్రాంతి రహిత విధానమునకు సరియైన మార్గములు వెతుకుటకు పలుదేశములు తిరిగినాను

వ్రాసితి గ్రంథములు కొన్ని = నా అనుభవములను పలువురకు తెలియ జేయుటకు గ్రంథ రచనలు కూడా కొన్ని చేసినాను

వరగురు శిష్యుల్ = గురు శిష్యపరంపరలో ఆదర్శవంతమైన గురుశిష్యులు

జేసేటి చర్చ వింటిని = వారి మధ్య జరిగిన వేదాంత ప్రసంగములు చక్కగా వివరించితిని

మోక్షాద్యాపేక్ష = మోక్షము కావలెననే కోరిక కూడా

రోసితి = విడిచి పెట్టితిని

రూఢీగ వినుమీ = ఈ అంశములను నీవు స్పష్టముగా గమనించుము

నీవిట్టి యారూఢత గనుమీ = నీవుకూడా ఇంత పరిశీలన మీదట నేనుపొందిన ఆరూఢతను పెంపొందించుకొనుము

దేశీకు దయ బుట్ట జేసిశుశ్రూష = నా గురుమూర్తిని ఆశ్రయించి, నాలుగు శుశ్రూషలు పాటించి వారి అనుగ్రహం సంపాదించి

ఉపదేశము గొని = అత్యంత రహస్యమైయున్న ఈ పరిపూర్ణ భావము

వారి ద్వారా దృఢపరచుకొని
యుపదేశమిచ్చితిని = గురు ఋణం తీర్చుకొనుటకు, పరంపరాభివృద్ధి కొరకు నేను గ్రహించిన రహస్యమును ఆరూఢతతో నీకు ఉపదేశించితిని.

## తాత్పర్యము

జన్మకర్మలనుండి విముక్తి కొరకు నా పూర్వజన్మ పుణ్యఫలప్రభావముచే పలు ప్రాంతములను తిరిగి ఎందరో మహాత్ములను దర్శించి, వారిచే రచింపబడిన గ్రంథములను పరిశీలించితిని సాంప్రదాయ బద్ధమైన గురుశిష్య పరంపరలో శ్రేష్టులైన గురుశిష్యులు చేసుకున్న ఆధ్యాత్మిక ప్రసంగములను శ్రద్ధగా వింటిని. ఇన్ని విని, చదివి, చూచిన మీద మోక్షము కావాలనే కోరిక కూడనాకు నశించినది. ఏలననగా పైన పేర్కొన్న ఏ ఒక్క విధానము చేతకూడా భ్రాంతి రహిత విధానము కలగదని, సర్వభ్రాంతి రాహిత్యమే లక్ష్యముగా గల ఒక పరిపూర్ణ భావము నందు మాత్రమె జనన మరణభ్రాంతి రహిత విధానము చేకూర గలదని, అట్టిది గురునాశ్రయించి, చతుర్విధ శుశ్రూషల ద్వారా వారి అనుగ్రహమును సంపాదించి ఉపదేశ విధానము నందు మాత్రమె అట్టి విధానము ఆరూఢత కాగలదని స్పష్టముగా గ్రహించితిని. అట్టి విధానమును పాటించి, గురు అనుగ్రహమును పొంది, అట్టి భావమును పొందుటకు యోగ్యతను సంపాదించితిని. అట్టి అధికార యోగ్యత లక్షణములు ఏవనగా

1) సూచన చేయగానే కనుక్కొనే లక్షణము గలవారు

2) అను మానము లేకుండా ఉండువారు

3) భ్రాంతి రహితం కావాలి అని మిక్కిలి కోరిక కలవారు

4) ఒక్కటైనా భ్రాంతి లేకుండా ఎవరు సూచిస్తారు అని అత్యంత ఆసక్తి కలిగి సూక్ష్మ ప్రజ్ఞ వున్నవారు.

ఇటువంటి వారికి మాత్రమె పరిపూర్ణ సూచన చేయమన్నారు.లేకుంటె చేయ కూడదు. ఇట్టి యోగ్యతతో, పాత్రతతో ఈ భావమును గురు అనుగ్రహము ద్వారా పొంది, లోక కల్యాణము కొరకు,

గురు ఋణము తీర్చు కొనుటకు, పరంపరాభివృద్ధికి, నీ యోగ్యతను గమనించి, ఈ భావమును నీకు ఉపదేశించినాను. నా వలెనే నీవును ఇట్టి ఆరూఢతను పొంది, జన్మ సార్థకతను గావించుకొనుము.

## గ్రంథ పూర్తి

జన్మరాహిత్య విధానమునకు మార్గమును తెలియ చేయుటకు గాను పరా, అపరా ప్రకృతుల రాహిత్యమును ప్రతిపాదిస్తూ (శక్తి ద్వయ నిరాసకం) ఈ పద్యములను ఈ గ్రంధ కర్త అయిన పరశురామ సీతారామ స్వామి అనుగ్రహముతో సామాన్యులకు కూడా పాడుకొని ఆనందించు విధానముగా జానపద సాహిత్యముతో తెలంగాణ మాట లేక శబ్ధములచే సమస్త వేదోపనిషత్ సారమైన బ్రహ్మ విద్యను అచ్చ తెలుగులో, సామాన్యులకు కూడా అందుబాటులో ఉండులాగ ఈ గ్రంథరచన ప్రారంభించి 292 పధ్యములుగా దీనిని పూర్తి చేసినారు. భ్రాంతి రహిత విధానమునకు ఇది ఆదర్శ గ్రంథముగా చెప్పబడుచున్నది.

**కం॥ శరశాస్త్రస్వరహిమకర పరిమితమైనట్టి శాలివాహన శకమం।
దరయగ శోభకృదనువ। త్సరమార్గశిరంబుకృష్ణ చవితినాటికినీ।
పద్యాల్పది దక్కువ। మున్నూటికినీ। మురయూచుజేస్తినెవ్వరువిన్న
చదివీన। పరిపూర్ణమెరుకై। లేనెరుక లేకుండూ నీ। చవితి నాటికినీ।
పద్యాల్పదిదక్కువ। మున్నూటికినీ॥ 291**

## ప్రతిపదార్థము

శర శాస్త్ర స్వరహిమకర =5 బాణములు, 6 శాస్త్రములు, 7 స్వరములు, ఒక చంద్రుడు

పరిమిత మైనట్టి = సరిసమానమైనటువంటి

శాలివాహన శకమందు = శాలివాహన శకములో

అరయగా = విచారించగా

శోభకృత నామసం = శోభకృత నామ సంవత్సరము

మార్గశిరంబు = మార్గ శిర మాసములో
కృష్ణ చవితి నాటికి = బహుళ చవితి నాటికి
పద్యాల్పది తక్కువ మున్నూటికి = మూడు వందలకు పది తక్కువ గల పద్యములు (290)
మురయూచు జేస్తి = ఎంతో సంతోషముతో వ్రాయబడినవి
ఎవరు విన్నా చదివిన = ఈ గ్రంథమును స్వయముగా ఎవరు చదివిన గాని, యోగ్యత గల వారిచే వివరము పొందిన గాని.
పరిపూర్ణ మెరుకై = స్వతఃసిద్ధమైన పరిపూర్ణము వున్నదని దృఢపడి
లేనెరుక లేకుండును=దానియందు లేక తోచుచున్న గుర్తు లేకుండా పోవును

## తాత్పర్యము

శాలివాహన శకము నందు శోభకృత నామ సంవత్సర మార్గశిర బహుళ చవితి (1765 సం॥) లో 292 పద్యములలో శక్తి ద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వమును ప్రతిపాదించు ఈ గ్రంథమును ఎంతో సంతోషముతో నేను రచించినాను. స్వయముగా ఎవరైనా ఈ గ్రంథమును పరిశీలించినచో స్వతఃసిద్ధమైయున్న అచల పరిపూర్ణము తెలియబడి, దానియందు భ్రాంతులకు కారణమై మూలముగాని, స్థానముగాని లేని గుర్తెరిగే తెలివి లేనిదని దృఢ మగును.

## గ్రంథ సమాప్తి

జన్మరహిత విధానమునకు పరిపూర్ణ భావమే శ్రేష్టమైనదిగా చెప్పబడుచున్నది. సర్వశాస్త్ర సమ్మతమై, ఆగమ నిగమో పనిషత్ సాగర మది తార్థ మవలయై, సామాన్యులకు కూడా అవగాహన కలిగించుకొనే రీతిలో శక్తి ద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వము అనుపేర శ్రీ భాగవత కృష్ణ దేశికేంద్రులవారు తమ గురుమూర్తి యైన పరశురామ సీతారామ స్వామి అనుగ్రహ విశేషముచే ఈ గ్రంథ రాజమును పాఠకులకు అందించినారు. ఇందలి అంశములు అనగా పరిపూర్ణము, ఎరుక, ఎరుకను విడచుట అను విషయ నిరూపణ మీద సిద్ధాంత పద్ధతి, ఉపదేశ పద్ధతి

అను రెండు అంశములను ఇమిడ్చి యున్నారు. జిజ్ఞాసతో చదివి తెలుసుకొన్నవారికి సిద్ధాంత మందలి విశిష్టత పరిపూర్ణ భావము యొక్క ప్రయోజనము తెలియగలదు. జన్మ కర్మల భ్రాంతి రహిత విధానమునకు ఇదే మార్గముగా గుర్తించిన వారికి " తద్విద్ధిప్రణి పాతేన" అన్నట్లుగా సాంప్రదాయ పద్ధతి యందలి యోగ్యుడైన గురువును ఆశ్రయించి, ఉ పదేశ పద్ధతిచే వస్తునిశ్చయ పూర్వకంగా ఇందలి మౌలికాంశములు అనగా పరిపూర్ణ మెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అనునవి నిరభిమాన పూర్వకమైన సేవా శుశ్రూషలచే గురుకృప పొంది నేర్వవలసి యున్నది. ఈ గ్రంథ రచన ముగిస్తూ రచయిత ఒక సందర్భములో సమగ్రమైన విషయ నిరూపణచే వారెరుగని మరుగుండదని, మునుపటి వలె భ్రమలు చెందరని స్పష్ట పరచి యున్నారు. కావున ఇందలి రహస్యములను ఎవరైనా గ్రహించ వలెనన్నచో గురూపదిష్ట మార్గమునందు మాత్రమె అది సాధ్యము కాగలదని స్పష్టముగా తెలియ వలసి యున్నది.

**కం॥ ఎరుకనెరుంగనిబయలులో। గురుడును శిష్యుండు**
**వారిగొడవయునే మీ। కెరిగించినవన్నియు। మీరెరిగినవన్ని**
**యును మీర। లేనునుళ్ళక్కి। వుళ్లక్కితా। నెప్పాడుళ్ళక్కిమరి**
**యింక మాటాడ మాటెలే। దాయాను సరిపాయ సరిపోతె**
**సరిపాయ సరిమీర। లేను నుళ్ళక్కితా। నెప్పుడుళ్ళక్కి॥ 292**

## ప్రతిపదార్థము

ఎరుక నెరుంగని బయలులో = స్వత:సిద్ధమైన పరిపూర్ణముయందు మూలముగాని స్థానముగాని లేనటువంటి గుర్తుచేత

గురుడును శిష్యుండు = గురుశిష్యులుగా

వారిగొడవయు = వారి ఇద్దరి మధ్య చర్చ

నే మీకెరిగించిన వన్నియు = బోధనా రూపకంగా మీకు నేను ప్రబోధించిన వన్నియును

మీరెరిగిన వన్నియును = నా ద్వారా మీరు గుర్తించిన వన్నియును

మీరలేను నుళ్ళుక్కి = మీరు నేనుగా తోచబడుచున్నది నిజము కాదు
వుళ్ళుక్కి తానెప్పొడుళ్ళుక్కి = నిజము కాదు అనేటిది కూడా నిజము కాదు
మరి యింక మాటాడ మాట లేదాయను = ఇంతకు మించి అనుభవమును చెప్పుటకును, మాటలాడుటకు కారణమైన గుర్తేలేనిదగుట చేతను
సరిపాయ = బాగా దృఢమైనదా? ఆరూఢపరచుకున్నావా?
సరిపోతె సరిపాయ = నీ ఆరూఢతను చెప్పడం చేతనే బోధ విధానము ముగుస్తుంది
సరి = ఈ విధంగా మొత్తము విధానమంతయు లేనిదే అగుచున్నది.

## తాత్పర్యము

మూలము లేని గుర్తెరిగే శరీరము చేత ఏమాత్రము అనుభవమునకు రాని స్వత:సిద్ధమైయున్న అచల పరిపూర్ణమునందు గురువు శిష్యులు వారిరువురి మధ్య జరిగిన సంవాదముగా నేను నీకు బోధించిన వన్నియును, మీరువిన్నవన్నియు లేని వగుచున్నవి. ఏలననగా ఇవన్నియు గుర్తు చేత చేయ బడుటచేత, గుర్తే లేనిదగుట చేత నిజము కావు. ఇక ఇంతకన్నా వివరించి చెప్పుటకు మాటలేదు. ఏలననగా ఈ మాటకు కూడా ఆధారమై గుర్తులేనిది కనుక విచారణ ఇంతటితో సరిపోయిందా? సరిపోతేనా కర్తవ్యము, నాబాధ్యత కూడా తీరినట్లు అవుతుంది. చెప్పుట, వినుట అను ప్రక్రియకూడా లేనిదగుచున్నది. సర్వ భ్రాంతి రహిత స్థితి దృఢపడి మిగిలి యున్నది.